

# పరిశోధన

(సారస్వత ద్వైమాస పత్రిక)

*K. Gopal Krishna Rao* M. A
Lecturer in Telugu,
Nizam College, Hyderabad-Dn.

జయ : శిశిరం

6

ఒక రూపాయ ఫిబ్రవరి-మార్చి 1955

# అనుక్రమణిక




సంపాదకులు : తిరుమల రామచంద్ర

సంయు : తిమ్మావజ్ఝల కోదండరామయ్య

సంచిక 6

పురాతత్త్వం :

# ముక్త్యాల పరిసరాలు : బౌద్ధస్తూపారామ శిథిలాలు*

శ్రీ వేటూరి శంకరశాస్త్రిగారు

ఎల్లందరు అన్ని విషయములందును ప్రవీణులు కాలేరు. మానవసంఘములో పరిమితముగా కొందరికే, కొన్నిటియందే ప్రావీణ్యము ఏర్పడుతుంది. ఈ ప్రావీణ్యముకూడా ఆ వ్యక్తులనుబట్టి తారతమ్యముతోనే వుంటుంది. ఏ విషయములోనైనా ప్రతిభావంతులు బహుకొద్దిమందే ఉండడం మనకు తెలియనివిషయము కాదు.

ఎవరైనా, ఏ విషయములోనైనా ప్రతిభావంతులు కావడానికి గాని, పేరుప్రతిష్ఠలు సంపాదించుకోడానికి గాని కారణం కేవలం వారి పాండిత్యప్రకర్షయేనని చెప్పడానికి వీలులేదు. వారి జన్మాంతరసంస్కారజనితమైన ఉపజ్ఞ చాలావరకు కారణ మవుతుంది. కొందరిని కొన్ని విషయముల నడిగితే అవి నాకు తెలియ దంటారు. మరి కొందరి నడిగితే, అట్టె విడదీసి, చిక్కు తీసి, తీర్చిదిద్దినట్లు విషయం తెలియజెప్పతారు. అట్టి ప్రతిభయే జన్మాంతర వాసనాఫలిత మని పెద్దలు చెప్పతారు.

కేవలం గ్రంథములు చదివితే కలిగే పాండిత్యప్రకర్షతోనే గాక, సంస్కారజన్యమైన ఉపజ్ఞతో చెప్పే విషయాలు ప్రామాణికముగాను, సత్యబద్ధముగాను ఉంటవని మనము నమ్మవచ్చును. జన్మాంతర సంస్కారము కలవారు, ఆ యా విషయములను చదివి మరచినవారివలె స్ఫురణకు దెచ్చుకొని, అట్టె ఆలోచన లేకుండానే చెప్పివేయ గలుగుతారు.

---

* శ్రీప్రభాకరపరిశోధకమండలి తృతీయ వార్షికసమావేశమునందు చదివిన వ్యాసము.
29-5-1954.

అట్టి వారి వాక్కులకు లోకంలో ఆదరణ, అంగీకారము యేర్పడుతుంది.

కొందరు పరిశోధకులు ఏదో ఒక శాసనమును గాని, పురాతనశిల్పకళాఖండమును గాని, నాణెమును గాని, గ్రంథమును గాని చూచిన తోడనే ఏవో విషయములు స్ఫురణకు వచ్చినట్లు, ఆ యా విషయములను ఫుటఘుటా అన్వయించి చెప్పడం, అవి చక్కగా అతికిపోయినట్లు అందరికీ నచ్చడం జరుగుతూంది. విచిత్ర సంఘటనగా యిట్టి విశేషాలు బయల్పడుతూ వుండడం కొందరికైనా అనుభవంలో నున్న విషయమే! జిజ్ఞాస గలవారు గుర్తించగలిగే ప్రస్ఫుట మైనసత్యసంఘటన మిది.

పూర్వచరిత్ర, నాగరికత, సంస్కృతి, ఇవన్నీ మానవసంఘానికి చెందినవే కదా! మానవుని జన్మపరంపరలో అంతర్వాహినిగా కలసియున్న ఆత్మసంస్కార జనితమైన ఒక అపూర్వ సంబంధము గోచరించక మనలో లీనమై యుండి, పురోగమింప జేయుచున్న దని ఆస్తికులైనవారందరు నమ్ముదురు.

మనలో గల ప్రతిభావంతులు వైణికవులు, గాయకులు, చిత్రకారులు, చరిత్రకారులు, శాస్త్రకారులు, మొదలైనవారందరు ఇట్టి జన్మాంతరవాసనలతో కూడినజ్ఞానసంపన్ను లని ఉపజ్ఞ కలవా రని మనము తలంపవలసియున్నది. లేనిచో ఈ జన్మలోనే, ఈ కొద్దిపాటి వ్యవధిలోనే వీరు ఆర్జించిన స్వల్పానుభవజన్యజ్ఞానములో ఎందరో ప్రతిభావంతులుగా వెల్లడి కానేర రని మనము నమ్మవచ్చును.

ఆంధ్రదేశపూర్వచరిత్ర చాలా విశిష్టమైనది, ప్రాభవోపేత మైనది యని చరిత్రకారులు చెప్పుచున్నారు. ఆంధ్రదేశపూర్వప్రాభవ మింకా యెంతో బయల్పడవలసినది కలదు. గతము నార్జించుకొనియే భవితవ్యమును మనము పొందవలసియున్నాము. గతచరిత్ర నెరుగనివాడు గంత కట్టినయెద్దు వంటివాడు కాగలడు.

ఆంధ్రదేశము ఒక విచిత్ర మైనసన్నివేశములో నున్న సారవంత మైనభూభాగము. జీవనదు లైన గోదావరి, కృష్ణ, తుంగభద్రలు, ఆంధ్ర భూభాగముగుండా ప్రవహిస్తు దేశమును సస్యశ్యామల మొనర్చుచున్నవి. వీటి ఉపనదులు కూడా ఆంధ్రదేశమునందే ప్రవహిస్తు ప్రజలకు తృణకాష్ఠజల సమృద్ధిని కలిగించుచు జీవకోటి కంతటికి ఆహారపానీయములే గాక, ఆరోగ్యమునకు కూడా కొరత లేకుండా చేయుచున్నవి.

ఆరువందలమైళ్ళ పొడవున గలతూర్పు సముద్రతీర మంతయు ఆంధ్రదేశమునకే చెంది యుండుట ఒక విశిష్టవిషయము.

పూర్వము గోదావరి కృష్ణానదుల ముఖద్వారము లన్నియు విదేశవ్యాపారమునకు గూడా తగియుండినట్లు చరిత్రజ్ఞులు చెప్పుచున్నారు. ప్రాచీనగ్రంథములను ఈ విషయమును నుద్ఘోషించుచున్నవి. అప్పటి రాజులు వణిజులు చాలామంది సముద్రయానము జేసి దూరదేశములకు వెళ్ళి ఆ దేశములతో వాణిజ్యమును సాగించినట్లును పురాతనచరిత్రకు సంబంధించిన శాసనములు, నాణెములు, గ్రంథములు తెలియ చెప్పుచున్నవి.

అప్పటి నదీతీరగ్రామములు, పట్టణములు, సముద్రతీర ప్రదేశములు, ఇప్పుడు వాటికి కొంచెము దూరముగా నుండుటవల్ల, సహజముగా ప్రకృతిలో యేర్పడుచుండు మార్పులు, ఈ నదులను, సముద్రమును, వాటి గతులయందును, సన్నివేశములందును గూడ మార్పును గలిగించి, అప్పటి గ్రామముల, పట్టణముల దరినుండి కొంతదూరమునకు పోయియుండవచ్చు నని మన మూహింపవలసియున్నది. లేనిచో అప్పటికి నదులకును, సముద్రమునకును దరిదాపుగా నున్నవని చెప్పబడుచున్నగ్రామము లన్నియుగూడా ఇప్పుడు దూరమునకు పోజాలవు గదా!

ఆంధ్రదేశపు ప్రాచీనచరిత్రను, సన్నివేశమును కనుగొనుటకై చాలావరకు శిలాశాసనములు, రాగిరేకులు, నాణెములు, ప్రాచీన శిథిలములు, ప్రాచీన తాళపత్ర సంపుటములు ఆధారము లగుచున్నవి. ఇవి గాక ప్రాచీనమైన జైనబౌద్ధమతముల బట్టియు, విదేశయాత్రికులు వ్రాసినవ్రాతలనుబట్టియు కూడ కొంత చరిత్రను నిర్ణయించ వలసియుండును. ఇట్టి ఆధారములు చరిత్రకారులకు 300 BC నాటినుండియు లభించుచున్నవి.

ఆంధ్రదేశమధ్యభాగమునుండి ప్రవహించుచున్న కృష్ణామహానది ఉభయతటములను దివ్యశిల్పకళావిలాసములతో విరాజిల్ల చేసుకొని సర్వప్రపంచవాసులకు తీర్థయాత్రాస్థలమై యుండడము చరిత్రజ్ఞులకు తెలియని విషయము

కాదు. పూర్వము ఆంధ్రదేశమున ధర్మప్రతిపాదకము లైన, అహింసాప్రబోధకము లైన జైనబౌద్ధమతములు ప్రబలియుండెడి వనియు, తదనుయాయు లగురాజుల,ప్రజల కలారాధనా ఫలితములుగా పెక్కు మనోహర విహార విగ్రహాదులు వెలసె ననియు ప్రాచీనశిథిల సంపదనుబట్టి మనము చెప్పవచ్చును.

శాతకర్ణి, శాతవాహన మొదలైన ఆంధ్ర భృత్యరాజవంశముల చరిత్ర పురాణములందు విరివిగా కనుపడుచునే యున్నది. ఆంధ్ర



[1 వ చిత్రము. అక్షరములతో నున్న రాతిబండ. ఇందలి అక్షరములను "దిమ్మచెరువు శ్రీ" అని మేము చదివినాము.]

రాజుల రాజ్యము తూర్పు కోస్తానుండి పడమటి కోస్తావరకును, దక్షిణమున మైసూరు, ఉత్తరమున ఉజ్జయినివరకును వ్యాపించి యున్నట్లు క్రొత్తగా బయల్పడిన పురాతనశిథిలములలోని శాసనాదుల ఆధారమునుబట్టి చరిత్రకారులు నిర్ణయముల జరుపుచున్నారు.

ముఖ్యముగా సముద్రవ్యాపారము ప్రాచీనకాలమున 6 శతాబ్దముల పాటు ఆంధ్రదేశములో ఉచ్చస్థితిలో నుండి బౌద్ధమతవ్యాప్తికి చాలా తోడ్పడి యుండినట్లును, చాలామంది రాజులు, ధనికులైన వ్యాపారులు, బౌద్ధమతావలంబకులైనందున మతాభినివేశముతో బహుధనము వ్యయించి పెక్కు స్తూప చైత్య విహారముల నిర్మించినట్లును మన మూహింప తగియున్నది.

సామాన్యముగా నీ స్తూపములు కట్టినస్థలములన్నియు చాలావఱకు ఇంచుమించుగా కృష్ణానదీతీరమునందే యుండుటయు మనము గమనింప

తగిన విషయము. ఇట్టి మహానిర్మాణములు నదీ తీరములందుండుటవలన అనేక సౌకర్యము లుండును. వ్యాపారము, రాకపోకలకు సౌకర్యము, తృణకాష్ఠజల సమృద్ధి, స్తూపనిర్మాణమునకు వలయురాళ్లు, సున్నము వగైరాలు సునాయాసముగా చేర్చుకొనే సదుపాయము, ఇవన్నియు ఏర్పడగలవు. దర్శనార్థమై వచ్చు యాత్రికులకుకూడా ఈ సదుపాయమువల్ల దర్శనీయమైన స్థలము లన్నియు అందుబాటులో నుండగలవు.

ఇందునుబట్టియు పూర్వము కాలినడకను



[2 వ చిత్రము. అక్షరములతో నున్న రాతిబండ. ఇందలి అక్షరములను "రతివిలాస శ్రీ" అని మేము చదివినాము.]

ప్రయాణములకంటె, నీటిమీద ప్రయాణమే యెక్కువ సౌకర్యవంతముగా తలంచినట్లును, వ్యాపారముకూడ నీ పద్ధతినే యెక్కువగా జరిగినట్లును మనము తలంపవలసియున్నది. నదీతీరప్రదేశముల కిందువలననే యెక్కువ ప్రాముఖ్య మేర్పడినది.

బౌద్ధస్తూపములు దక్షిణాపథమున ఆంధ్రదేశముననే యెక్కువగా కనుపడుచుండుటవల్ల ఆంధ్రదేశమున బౌద్ధమతప్రాబల్య మెక్కువగా యుండినట్లును, ఆంధ్రులు బౌద్ధమతావలంబకులై యుండినట్లును, బౌద్ధాచార్యులు ఆంధ్రులు కానివారు కూడ చాలామంది ఆంధ్రదేశమున నివసించి యున్నట్లును చెప్పుటకు ఆధారములు గలవు.

ఈ బౌద్ధయుగముననే లలితకళలు, అందును చిత్రకళ, నాట్యకళ, చాలా ఉన్నతస్థితి నొంది

యున్నట్లును స్తూపనిర్మాణ కౌశలమునుబట్టియు, అందలి శిల్పకలాచాతుర్యమునుబట్టియు గట్టిగా మనము నమ్మవచ్చును.

ఆరామతీర్థము, శాలిహుండము, అరుగోలను, గుంటుపల్లి, జగ్గయ్యపేట, ముక్త్యాల, రామిరెడ్డిపల్లి, అల్లూరు, బెజవాడ, గుడివాడ, ఘంటసాల, గోలి, నాగార్జునకొండ, అమరావతి, భట్టిప్రోలు, ఇవన్నియు బౌద్ధశిల్పకళా చాతుర్యమును వేనోళ్ల చాటుచున్న మహాపుణ్యస్థలములుగా నెన్నబడుచున్నవి. బౌద్ధులు నిర్మించిన నిర్మాణములు స్తూపచైత్యవిహార విగ్రహాదులన్నియు కృష్ణా గుంటూరు మండలములలో



[3 వ చిత్రము. 'దిమ్మచెఱువు శ్రీ' అని చెక్కబడిన రాతిగుండకు వెనుక భాగమున, ఎడమవైపు మూలగా, రాతికి క్రిందితట్టున ఈ అక్షరములు చెక్కయున్నవి. అక్షరములు సరిగా తెలియుట లేదు. 'పాచ (?) సన?]

నదీతీరమునందు యెక్కువగా కన్పడుచున్నవి. ఇవి యింకా యెన్నో గుర్తింపబడియు ఇంతవరకు భూగర్భముననే పాతుకుపోయి యున్నవియు కలవు. ఇప్పటివరకు ఆంధ్రదేశమున బయల్పడిన ప్రాచీనబౌద్ధనిర్మాణము లన్నియు ఆ నాటి ఆంధ్రదేశస్థితిని దెలుపునవిగా నుపయోగపడుటయే గాక ఆంధ్రుల కళాభిజ్ఞతను, సంస్కృతినికూడా చాటునవిగా నున్న విషయము సువిదితమే! ఇంకను భూగర్భమునుండి బయల్పడవలసిన వెన్నో కొన్ని యుండగా, త్రవ్వించిన శిథిలములలోని శిల్పఖండములుకూడ నెన్నియో మనకు తెలియకనే తెలుగునాటికి సంబంధించినవి, తెలుగునాడు దాటిపోయినవి విలువగలవి చాలా గలవు.

ప్రాచీనశిథిలములుగా నున్న పాటిదిబ్బల నన్నిటిని, లంజదిబ్బ లనియో, దీపాలదిన్నె లనియో, ధనంబోడు లనియో, ధర్మవరప్పాడు లనియో, భోగాలపాడు లనియో, వీరులబోడు లనియో,

ప్రజలు నేడు వాడుకగా పిలుచుచుండుటను మనము వినుచున్నాము. వీటి కీ పేర్లెందుకు వచ్చినవో తెలిసికొనుటకు తగిన ఆధారము లేవీ గ్రంథస్థములుగా లేనందున సరిగా నిర్ణయించి చెప్పుట కష్టమే యైనను ఇందు ధననిక్షేప ముండు ననియు, భోగము లనుభవించిన పాటి స్థలము లనియు మాత్రము ఇప్పటి పరిశోధనలవల్ల మన మూహించి [illegible]ము చెప్పుట యు[illegible].

ప్రాచీనశిథిలశిల్పములు శాసనములు మొదలైనవి యెన్నో భూమిలో నాతుకపోయినవి రత్నఖనుల నదగినవి, ఉద్ధరింపవలసినవి ఇంకా వున్న వని అందరికి తెలుసును. అట్టివానిలో కృష్ణాజిల్లా నందిగామ తాలూకా ముక్త్యాల గ్రామమునకు తూర్పు సుమారు మైలుదూరము లోపుగా కృష్ణానదికి ఉత్తరపు తీరమున 'భోగాలపాడు' అనే పేరుతో బేచిరాకుగా నున్న గ్రామము ఒకటి కలదు. ఇది యిప్పుడు సేద్యముచేయు మెరక పొలముగానే యున్నను ఒకే చోట దగ్గర దగ్గరగా పాటిదిబ్బలు, తెల్లటి కొండరాళ్లు, చిల్లపెంకులు, బూడిద మాత్రము భూమి యుపరిభాగమున కనుపడు చుండును. ఈ ప్రదేశము నదియొడ్డుననే కల దగుటవల్ల, కృష్ణ వెల్లువగా వచ్చినయెడల



[4 వ చిత్రము. 'వీరులబోడు నందు త్రవ్విన రాకాసిగుడి. గుఱ్ఱపు ఎముకలు, మనిషి ఎముకలు దొరికినసమాధి. త్రవ్వించుటకు ముందున్న దాని స్వరూపము.]

మునుగుచుండును. 'భోగాలపాడు' అనే ఈ స్థలము నేడు పాటిదిబ్బలతోను, నాపరాతి ముక్కలతోను పాడుపడి కళావిహీనమై యున్నప్పటికి, ఆ స్థలము చూచినతోడనే ఇదేదో ప్రాచీనప్రాభవము గలదిగా మాత్రము స్ఫురింపజేయగలదు.

ముక్త్యాల గ్రామములోని వృద్ధులు ఈ స్థలమునుగూర్చి ఒక కథ చెప్పగా నేను విని యున్నాను. పూర్వ మొకప్పుడు (సుమారు ఏనుబదియేండ్లకు ముందు) ఒక రైతు పొలము దున్నుచుండగా, నాగలికఱ్ఱునకు ఒక లంక బిందె తగిలిన దనియు, దాని నా రైతు యింటికి తీసుకొనిపోయి చూడగా నందు కొన్ని బంగారు నాణెములు, ధనము దొరికిన దనియు, దాని నతడు తీసికొనిన కొలదిదినములకే తన యింట నిద్దరు ఆప్తబంధువులు చనిపోగా, నంత నాతడు భీతిని జెంది యాధననిక్షేపమును మరల నెక్కడనో యెవరికి తెలియకుండునట్లు పాతిపెట్టినా డనియు వాడుకగా గ్రామప్రజలు చెప్పుచుందురు. విచారించగా స్థలజ్ఞులగు వృద్ధులు కొందరు ఈ విషయము నిజమే నని చెప్పుచున్నారు. ఇప్పటివరకు ఆ నిక్షేప మెక్కడ కలదో యెవరికిని దెలియదు.

పైన జెప్పినస్థలము 'భోగాలపాడు' నకు

యించుక తూర్పుగా సమీపముననే అనగా నొక ఫర్లాంగుదూరమున 'పాలేరు' వచ్చి కృష్ణానదిలో కలియును. పాలేరు అవతలి యొడ్డున తూర్పుగా 'రావిరాల' 'వేదాద్రి' యను గ్రామములు వరుసగా మైలు రెండు మైళ్ల దూరమున గలవు. దీనికి పడమటగా వంద గజములదూరమున కృష్ణకు యెగువను నేటికిని పాడుపడినగుర్తులు గల, పడవల రేవు కలదు. నిన్న మొన్నటి దాక అనగా, లారీల రాకపోకలు విరివిగా సాగకముందు కృష్ణానది మీద పడవలద్వారా జరుగు వ్యాపారమునకు ఇది యొక రేవుగా నుండెడిది. ముక్త్యాలకు 5 మైళ్లదూరమున గలజగ్గయ్యపేటకు వ్యాపారమంతయు ఈ రేవుగుండానే జరుగుచు, అప్పటి



[5 వ చిత్రము. గుఱ్ఱపుఎముకలు, మనిషిఎముకలు గలసమాధి త్రవ్వినతరువాతి స్వరూపము. మధ్యనున్న రాతిబండకు కన్నమున్నది చూడవచ్చును. ఆ కన్నముపైననే అక్షరములు కలవు. వాటిని "లువిశ్రీ"గా చదివితిమి.]

ముక్త్యాల జమీనుకు సుంకముల ద్వారా ఎన్నియో వేలరూపాయిలు చెల్లుచుండెడి వట !

ఈ 'భోగాలపాడ' నే పాటిదిబ్బలో గల ప్రాచీనశిథిలవిశేషములను గుర్తించుటను గూర్చియు, దీని ప్రాముఖ్యమును గూర్చియు ముందుగా స్పష్టముగా మాకు యెఱుకచెప్పినది పూజ్యులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. ముక్త్యాలలోనే ఒకనాటి ప్రార్థన సమయమున మిత్రులతో ప్రసంగవశాత్తు ఆంధ్రదేశ ప్రాచీన ప్రాభవము, బౌద్ధమతము, ఆంధ్రదేశమున దాని వ్యాప్తి, జగయ్యపేట పరిసరప్రదేశములందు గల

బౌద్ధశిల్పములు, వాటి నిర్మాణము, ప్రాముఖ్యము మొదలైన కొన్ని చారిత్రక విశేషములు— వానిలో నేటికొందరికి గల, అవిదిత మైన పూర్వజన్మల సంబంధ మైనగాథలు, వారికి యోగదృష్టిలో కలిగిన యంతరాత్మావబోధములలో చెప్పదొడంగిరి. అవన్నియు వినువారి కంతో ఆశ్చర్యమును కలిగించుచు అద్భుతముగా నుండెను. వాని నన్నిటిని వివరించి బహిరంగముగా జెప్పుట కిది యదను కాదు.

ఈ విషయములనే ఉచిత మైనంతవరకు, 1946 సం. లో ముక్త్యాలలో జరిగిన నవ్య సాహిత్య పరిషత్తు ఉపక్రమోపన్యాసమున ఈ విధముగా శ్రీ శాస్త్రిగారే వివరించియుండిరి :-

"కవిత్రయమువలెనే ఆంధ్రదేశమును వైభవాన్వితము కావించిన నదీత్రయములో నడిమి దైన 'కృష్ణవేణ్ణా' మహానది రెండు వేలేండ్ల క్రిందట శ్రీ శైలమునకు దిగువను సముద్రసంగమము దాకా ఉన్న తన ఉభయ



[6 వ చిత్రము. 'భోగాలపాడు' నందు దిబ్బ త్రవ్వించగా కనబడిన నిలువురాతి స్తంభములు రెండు. (1) అందలి ఇటుకలు ఆనువరుసగా పెట్టియున్నవి చూడవచ్చును.
(2) స్తంభముల వెనుక, స్తంభముల క్రింద పెట్టిన బండలు చూడవచ్చును.
(3) చిత్రము కుడివైపున నిలువురాతికి ముందుగా నొక నున్నని తెల్లనిరాతిబండ, దానిపైన పాత్రము చూడవచ్చును.]

తీరములనూ బౌద్ధధర్మోద్బోధములతో దివ్య శిల్ప కవితా కళావిలాసములతో విరాజిల్లజేసి కొని సర్వప్రపంచవాసులకు తీర్థయాత్రాస్థలమై ప్రఖ్యాతి కెక్కి ఉండడము ఈ నాటి చరిత్రజ్ఞులకును విదితవిషయమే! కానీ, ఈ ముక్త్యాల ప్రాంతము ఆది తెలియనికాలపు చరిత్రచిహ్నములుగా కానవచ్చు సమాధులు గలప్రదేశమవడము మాత్రము చరిత్రజ్ఞు లింతకు ముందు గుర్తించిరో లేదో నే నెఱుగను. కొన్ని యేండ్లకు ముందు నే నీయూరుప్రక్కనే అట్టి సమాధి నొక దానిని త్రవ్వించితిని. అందు అజ్ఞాతయుగపు సమాధివస్తువులుగా మదరాసు మ్యూజియములో సేకరించి యుంచబడిన వస్తువులవంటి వస్తువులే కానవచ్చినవి. అట్టి వీ చుట్టుపట్టులలో వందలకొలదిగా ఉన్నవి.

శ్రీ శైల ప్రత్యంత పర్వత మైన నాగార్జునుని కొండదగ్గర మహాయాన బౌద్ధశాఖా ప్రవర్తకు డైన నాగార్జునుడు నివసించి అనేక బౌద్ధ గ్రంథములను రచించినా డనీ, అంతే కాక శ్రీ శైల ప్రాంతపు దివ్యౌషధులను పరీక్షించి వాని మూలమున రసవాదవిద్యను వెలయించి రససిద్ధుడై బంగారు చేసినాడనీ చరిత్రజ్ఞులు చెపుతున్నారు. శ్రీ శైలవాసి నిత్యనాథు డనే సిద్ధుడు రసరత్నాకర మనే వైద్యగ్రంథంలో రస

పాదఖండంలో చాలా చోట్ల నాగార్జునుని పేర్కొన్నాడు.

నాగార్జునకొండ దగ్గర ఇక్ష్వాకు రాజులు అనేక బౌద్ధ నిర్మాణములను వెలయించినారు. ఆ రాజుల శాసనములతోనే ఇక్కడికి చేరువనే ఉన్న జగ్గయ్యపేట స్తూపముకూడా వెలసి ఉన్నది. ఆ నాటి శాసనములలో అపరశైల సంఘారామ మనీ, పూర్వశైల సంఘారామ మనీ రెండు బౌద్ధ సంఘారామముల ప్రశంస ఉన్నది. అవి నాగార్జునుని కొండ, ధాన్యకోట సంఘారామములకు వర్తించేవిగా గుర్తింపబడుతూ ఉన్నవి. చంద్రకీర్త్యాచార్యుని మధ్యమకావతారసూత్ర వ్యాఖ్యానంలో పూర్వశైల గాథలలోనివని కొన్ని శ్లోకములు ఉదాహరింపబడి ఉన్నవి. ఈ మధ్యమకావతార సూత్ర గ్రంథము చైనాభాషలో ఉండగా దానిని మన్మిత్రులు శ్రీ అయ్యాస్వామి శాస్త్రిగారు సంస్కృతీకరించినారు. ఈ దేశమువాడయిన నాగార్జునుని బౌద్ధ గ్రంథములూ, ఈ దేశపు బౌద్ధాచార్యులింకెవరో రచించిన గ్రంథములయిన పూర్వశైలగాథలు, ఈ దేశంలో అంతరించినా వాని ఉనికి అయినా చైనాదేశ బౌద్ధ



[7 వ చిత్రము. పాటిదిబ్బలో దొరికిన కుండలు, కుండ పెంకులు, ప్రమిదలు, పూజలు గలవి, సున్నము అతికియున్నవి, కుండపెంకులు మాడవచ్చును. ఇవి రంగు రంగులవి.]

గ్రంథములమూలాన గుర్తించ గల్గడం నాకత్యంతానందము గొల్పినది. అనాడా గ్రంథముల మహిమ ఎంత దూరదేశములకు గూడా ఎగబాకినదో చూడండి!

రెండు వేలేండ్ల నాటిదైన శాతవాహన సప్తశతిలో ఈ ముక్త్యాల ప్రాంతప్రదేశమును గూర్చి వర్ణనగాథలు కొన్ని ఉన్నవి. జగ్గయ్యపేటనుంచి యిక్కడికి వచ్చేటప్పుడు రోడ్డు ఎడమవైపు కొండమీద పాలేటి ప్రక్కగా బౌద్ధస్తూపమును చూచి ఉంటారు. అక్కడ నుండి ముక్త్యాలకు వచ్చేదాకా రోడ్డుకు రెండు ప్రక్కలా దట్టముగా మోదుగుచెట్లు వ్యాపించి ఉండడము కూడా చూచి ఉంటారు. జగ్గయ్యపేట బౌద్ధస్తూపమున బుద్ధవిగ్రహమునకు సాష్టాంగనమస్కృతి చేస్తూ ఉన్న అక్కడి బౌద్ధసన్యాసులను చూచీ, ఎఱ్ఱనిపూవులు క్రింద రాలియున్న ఇక్కడి మోదుగు చెట్లను చూచీ నూరన్న అనేకవి సంధానించిన గాథ ఇది:—

"కీరముహసచ్ఛహేహిం రేహఇ
వసుహా పలాసకుసుమేహిం
బుద్ధస్స చలణవందన
పడిఏహి వ భిక్ఖుసంఘేహిం"

జీబుగా నేలపై రాలే చిలుకముక్కులట్లు పూవులు మోదుగుచెట్లక్రింద

బుద్ధపాదాంబుజములకుఁ బుడమి వ్రాలి
వందనము సేయుభిక్షుకవర్గ మనఁగ.

ఈ వర్ణన మిక్కడికే చెల్లుతుంది.

నాగార్జునుని కొండనుండి గంటసాల దాకా ఉన్న బౌద్ధస్తూపములు అద్భుతము లైనశిలా శిల్పములు గలవి. శిలాశిల్పమునకు గండరువు అని పేరు. ఈ పదము గాంధారపదమునుండి పుట్టిన దని నేను గుర్తిస్తున్నాను. గంధార పదము ప్రాకృతమున 'గండారో' అగును. అదే మన తెలుగున గండారువు అయినది. నాగార్జునకొండస్తూప శిల్పములలో ఈ గాంధారశిల్పరచనలు విస్పష్టముగా కాన వస్తున్నవి. ప్రఖ్యాత మైన ఆంధ్ర శిలాశిల్పము గ్రీకు గాంధారములనుండి వచ్చి ఇక్కడివారి చేతులలో వన్నె హెచ్చి జగజ్జేగీయమాన మగుటకు ఈ గండరువు పదమూ, ఇక్కడ కాన వచ్చే గ్రీకు గాంధార శిల్పరచనా సామ్యములు నిరూపిస్తున్నవి. అయినా ఈ ఆంధ్ర శిల్పము గ్రీకు గాంధారశిల్పములకంటె చాల వైలక్షణ్యమూ, సౌందర్యవిశేషమూ స్వతంత్రముగా సంపాదించుకొన్న దన్న సంగతిని అందరూ అంగీకరిస్తున్నారు. స్తూపములలోని గండరు



[8 వ చిత్రము. మొదటివరుస : లోహపు ఓళ్ళలు, రేకులు, ముద్ద మాడవచ్చు.
రెండవవరుస : లోహపు ప్రమిదలు, రకరకములవి.
మూడవవరుస : లోహపుకడ్డీ, సరికిన లోహపు ఓళ్ళలు, కడియములు.]

వులను గండరించడ మనేది కొన్ని శతాబ్దుల కాలములో సాగి ఉంటుంది. కాని, అది అంతలో ఇంతలో అవడగినపని కాదు. ఆ శిల్ప విద్యను నేర్చుకొని గండరించినవారు ఆనాటి కర్మరాష్ట్రీయులే ననీ, వారే నేటి 'కమ్మ వా' రనీ నా అభ్యూహము.

ఇంతవరకూ నేను చెప్పినవి ఇక్ష్వాకుల నాటీ, బౌద్ధుల నాటీ గాథలు: అవి పదిహేను వందల యేండ్ల కింకా పూర్వకాలపువి. చాళుక్యులకు, కాకతీయులకు తర్వాత ఈ ప్రాంతమున సాగినవారి పాలనము సాగినది. క్రమముగా నీ ప్రాంతము వాసిరెడ్డి కమ్మ ప్రభువుల పాలనమునకు వచ్చినది.

1949 సం॥ మున శ్రీ శ్రీ ముక్త్యాలరాజా గారితోడ్పాటుతో ఈ చుట్టుపట్టులందు గల ప్రాచీన శిథిల శిల్పశిలాఖండములను ప్రోగుచేసి, ఈ ముక్త్యాల గ్రామమునకు చేర్చి ఇక్కడ నొక ప్రదర్శనశాల నేర్పాటు చేయవలె ననుతలంపుతో కొన్ని ప్రాచీనశిలాశిల్పఖండములను శ్రీ ప్రభాకరశాస్త్రిగారే సంపాదించి ముక్త్యాలకు చేర్చియుండిరి. ఇందు ఇక్ష్వాకులనాటి నుండి కాకతీయులనాటివరకును గల శిలా

శిల్పములు, శాసనములు, చేకూర్చబడియున్నవి. ఇందు ముఖ్యమైనవి పేర్కొనదగినవి కొన్ని కలవు. కాకతీయుల కులదేవతయైన కాకతమ్మ, సేనాపతి జాయప్ప, తాడిముత్తావిగ్రహము, మరికొన్ని కాకతీయులనాటి శాసనశిలలు ఇత్యాదులు. వీనికంటె ముఖ్యమైనవి, అతి ప్రాచీనమైనవి 'భోగాలపాటి' దిబ్బలోని శిలా శాసనములు శిథిలావశేషములు నయి యున్నవి. ఇవి ఇక్ష్వాకులనాటి వని తలంపబడుచున్నవి.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు యీ కొండగోజులకు తనువు చాలించెదరనగా ప్రత్యేకముగా పనిపెట్టుకొని యిందుకొరకై యిక్కడకు వచ్చి ఈ శిథిలములను త్రవ్వించి విశేషములను బయలు పరచవలెనను కుతూహలముతో కొంత ప్రయత్నము సాగించి యుండిరి కాని, ఆ నాటిపరిస్థితులు, మా మనోభావములు అందుకు కనుకూలింపక పోవడముచేత వారుండగనే వెంటనే త్రవ్వించు భాగ్యము మాకు కలుగలేదు. ముందు వ్యాకధిలే దన్నంత తొందర వారికి కలిగియే ఆ నాడంతగా వారు తొందరించి రన్న సంగతియు స్థావరవిశేషముల్లున్న దనియు తర్వాత గాని మేము తెలుసుకోజాలక పోతిమి.

శ్రీ శాస్త్రిగారియందు, వారిపలుకులయందు భక్తి విశ్వాసములు ప్రేరేప, కొన్నాళ్లు గడచిన



[9 వ చిత్రము. మొదటివరుస : మట్టిపిడతలు, బోలుగా శిఖరాకారముగా నున్న మట్టిపాత్ర. రెండవవరుస : మట్టిగోలు, మట్టిగొట్టములు. చివరిది చక్రాకారముగా నున్నది. మూడవవరుస : రంధ్రము లున్న మట్టిపూసలు, చివరిది రంధ్రములు గలపూసలు (గాజువి కావు, మరేవో తెలియలేదు.]

పిదప ఇందేదో గొప్ప విశేషమే యుండగలదను తలంపుతో 1953 మార్చినెల 9 వ తేదీ నుండి 15 వ తేదీ వరకు ఈ దిబ్బను మేము త్రవ్వించుటకు ప్రారంభించితిమి. శ్రీ ముక్త్యాల రాజాగారి కమతములో చేరిన సేద్యము చేయు స్థలములో నడ్డముగా నున్నది గాన, సేద్యమున కుపయోగపడి అడ్డము తీయునంతవరకే పైపైన త్రవ్వించినప్పటికి బయల్పడిన విశేషములు మాత్రము చాలముఖ్యమైన వనుటకు సందేహము లేదు.

ఇందు దొరకినవి కుండలు, కుండపెంకులు, శాసనపు రాళ్లు, ఎముకలు, లోహపుబిళ్లలు, రేకులు, పూసలు, ఆభరణములు, గాజులు, ఆటవస్తువులు ఇటువంటివి కలవు. (వీని వివరములు అనుబంధమున చూడుడు. ఈ వ్యాసమున ప్రచురించిన 1, 2, 3, 4, 5, 6, 7, 8, 9 10 చిత్రములలోని వస్తుసామగ్రి యంతయు ఇందు దొరకినవేను) ఇవి, వీటి విలువ తెలియని వారికి ఎముకలు కుండపెంకులే గాని, చారిత్రిక జ్ఞానవంతుల కివి నిక్షేపించిన బంగారు రేకులుగా

భాసిల్లగలవు.

భోగాలపాటిలో మేము త్రవ్వించిన పాటి దిబ్బ నిర్మాణము ఈ క్రింది విధముగా నున్నది. దీని నిర్మాణవిధానమునుబట్టియు అందు దొరకిన వస్తువులనుబట్టియు ఇది యొక బౌద్ధవిహారము కావచ్చునని మేము తలంచుచున్నాము. నేలమట్టమునకు సుమారు ముప్పదియడుగుల యెత్తుగా భూమి యుపరిభాగమున 200 అడుగుల చుట్టుకొలతగల ఒక పాటిదిబ్బ గలదు. దిబ్బచుట్టు అక్కడక్కడ 18" పొడవు, 9" వెడల్పు, 3" మందము కొలతలుగల పాత యిటుకరాళ్లు, ఆ దిబ్బలో పాతుకొనిపోయి కనుపడుచున్నవి. (నెం. 6 చిత్రములోని యిటుకలు) ఈచుట్టుపట్టుల యిటుకరాళ్లే దొరకవు. పైగా నీ కొలతలు గలవి అసలే లభించవు. దిబ్బ పైభాగమున నడిబొడ్డుమీద నాలుగు వైపులను రెండేసి నాపరాతి బండలు నిలువున వరుసగా పాతియున్నవి. వాని కొలతలు 8 అడుగుల పొడవు 4 అడుగుల వెడల్పు 5 అంగుళముల మందము కలిగియున్నవి. రెండడుగులవరకు భూమిలోకి పాతియున్నవి. రెండు బండలు అంతే కొలతగలవి ఉత్తరదక్షిణములుగా ఈ బండలపైన కప్పియున్నవి. ఇట్టి బండల నిర్మాణమును 'గొడుగుబండ'లని యిటువైపుల అందురు. తూర్పువైపున మనిషి లోపలకు పోతగినంతటి సందు గలదు. లోపల నేమియు



[10 వ చిత్రము. సమాధిలో దొరికిన గుఱ్ఱపు ఎముకలు, మనిషి ఎముకలు మాదిరికి కొన్ని చూపబడినది.]

కనుపడుట లేదు. ఈ నిలువుబండలకు ఆనుకొని ఉత్తరపువైపున నొక పెద్ద వేపచెట్టు కలదు. అది యెప్పటినుంచి కలదో తెలియదు గాని ఈ దిబ్బ నిర్మాణానంతరము మొలచి పెరిగినదే నని మాత్రము చెప్పదగియున్నది. ఇది ఆ దిబ్బయొక్క బహిరంగస్వరూపము.

ఈ నిర్మాణమున ఉపయోగించిన తెల్లటి రాతిబండలు తత్పరిసర ప్రాంతముల నెక్కడను దొరకవు. ఇట్టి వానినెల్ల దూరప్రదేశము నుంచి యిక్కడికి చేర్చుటకే యెంతో ప్రయాసలు పడవలసి యుండును. ఒకరిద్దరు కలిసి చేయతగినపని కూడ కానేరదు.

ముందుగా మేము పైననున్న నిలువుబండల (గొడుగుబండల) నూడబెరికి చుట్టు త్రవ్వించుటకు ప్రారంభించితిమి. త్రవ్వించగా బయల్పడిన సన్నివేశ మిట్లు కలదు.

ఈ నిర్మాణమునకు తూర్పుగా ఇరుపార్శ్వముల, ఉత్తరదక్షిణములందు రెండు తెల్లటి నలుచదరపు రాతిస్తంభములు నిలువబెట్టియున్నవి (చిత్రము 6 లోని రెండు నిలువు

స్తంభములు) ఆ స్తంభముల మొకిరిమాత్రము భూమిపైకి కనుపడుచుండెను. ఈ స్తంభములు 5-6 అడుగులు నిడివి యుండి యుండవచ్చును. నాల్గువైపుల ఒక్కొక్క అడుగు కొలతతో నలుచదరముగా నున్న స్తంభము లివి. ఈరెండు స్తంభములు ఒకదాని కొకటి యెదురుగా పది యడుగుల దూరమున గలవు. నేలమట్టమునకు వియగొట్టిన గుర్తులుగల స్తంభభాగము విరిగి పోయినది పోగా, నేలలో పాతుకొనియున్న స్తంభపు పొడుగు 4 అడుగులు గలదు. ఒక్కొక స్తంభము క్రింద ఒక రాతి బండ గలదు. (చిత్రము 6 లో నిలువు స్తంభముల వెనుక నున్నవి.) దాని మందము 5 అంగుళములు. పొడవు 24 అంగుళములు. వెడల్పు 18 అంగుళములు. ఈ బండలమీద కొన్ని ప్రాకి యక్షరములు అస్పష్టముగా చెక్కబడియున్నవి. ఒక అక్షరము 'జ' గా గుర్తించుటకు వీలుగా నున్నది-మిగిలినవి తెలియుట లేదు-ఈ స్తంభముల కించుక వెనుకభాగమున విస్పష్టమైన అక్షరములతో రెండు తెల్లరాతిబండలు గలవు (చిత్రము 1,2, సంఖ్య గలవి.) వాటి కొలతలు 2" పొడవు 18" వెడల్పు 5" మందము. వీని మీద గలలిపి పోలికనుబట్టి చూడగా ఇక్ష్వాకుల నాటిదిగా గుర్తింప తగియున్నది. నెం 1 చిత్రముగా నున్నరాతికి వెనుక తట్టున యెడమ తట్టుగా క్రింది భాగమున మూలగా మరికొన్ని యక్షరములు కలవు.

ఈ నిర్మాణమునకు ఉత్తరపు దిక్కుగా భూమిలో పాతుకుపోయిన పెద్ద మట్టిబాన, అందులో సున్నము గడ్డకట్టుకుపోయినది, బాన సగమువరకును కలదు. అది గడ్డకట్టుకుపోయిన సిమెంటుకంటె కూడ గట్టిగా నున్నది. దీనిని త్రవ్వించి బయటకు తీయుట పెద్దకష్టమైనపని యైనది. బాన పగిలిపోయినది. ఈ నిర్మాణమునకు వెనుకభాగమున వాయువ్యదిశయందు ఒక గోడ. ఆ గోడలో తెల్లరాతిబండలు మందపాటివి నిలువున గలవు. 5-6 అంగుళముల మందము గలిగి మనిషి నిలువు యెత్తున వున్నవి. అందులో నొక బండ తొలిచి, గూడుగా చేసి, ఆ గూటిలో కరిగిన లోహపు ఓళ్లు, రేకులు, కొన్ని లోహపు దీప హారతులను బోలిన వస్తు సామగ్రి గుప్త పరిచియున్నవి కానవచ్చినవి. (చిత్రము 8 లోని వస్తువులు) మట్టి పిడతలు, కుండలు, కుండపెంకులు, పూసలు త్రవ్వుచుండగా కొన్ని మట్టిలో చెదురుగా కానవచ్చినవి. రంగు రంగుల కుండ పెంకులు అనేక విధములైనపూజలు గలవి కలవు. పూసలకు సన్నని రంధ్రములు వేసి యున్నవి. కాలికో చేతికో వేసుకొనే రాగికడియ మొకటి దొరకినది. పూసలు గాజుపూసలు మాత్రము కావు. విలువ గల వనియే నమ్ముచున్నాము. అనుభవజ్ఞులు పరీక్షించిన గాని వాని విషయము తేలదు.

ఈ నిర్మాణము చుట్టు నిలువున బండలు పాతియు, ఇరువది యడుగుల లోతునుండి గుండ్రాళ్లతోను, ఇసుకతోను పునాది గట్టిపరిచి అందుమీద పాటిమన్ను పోసి, పెద్ద పెద్దయిటుక రాళ్లతో వేదిక అమర్చబడియున్నది. వేదిక చుట్టు ఇటుకరాళ్లతో కొంతవరకును, తెల్లరాతి బండలతో కొంతవరకును మెట్లు కలవు. లోపలివేదిక యొక్క కొలతలు తూర్పు పడమరలుగా 15 అడుగులు ఉత్తర దక్షిణములుగా 21 అడుగులు.

ఈ నిర్మాణమునందు దొరికిన శిథిలావశేషములనుబట్టి చూడగాను, నిర్మాణ విధానమును బట్టి చూడగాను, ఇక్ష్వాకుల నాటి బౌద్ధ భిక్షువులు ఇక్కడ విహారము కట్టుకొని యుండి నట్లును బౌద్ధాచార్యులు కొందరు ఈ విహారమున నివసించుచు బౌద్ధధర్మముల ప్రచార మొనర్చుచుండి రనియు చెప్పదగియున్నది.

ఇందు దొరకిన వస్తుసముదాయ మంతయు పోల్చి చూడగా ఇట్టి వన్నియు చాల వరకు, నాగార్జునకొండ శిథిలములందును, మహెంజొదారో శిథిలములలోను దొరకినవాటితో పోల్చ తగియున్నవి. మేము యెక్కువ లోతుకు త్రవ్వి చూడలేదు. ఇంకను చుట్టుపట్టుల నున్న పెద్ద దిబ్బలను త్రవ్వి చూడలేదు. ఈ పని యంతయు ప్రత్యేకసాధ్యమే గాక, నిపుణుల యొక్క సలహా ననుసరించి ప్రభుత్వము వారు పెద్ద పట్టున ప్రారంభించిన గాని జరుగ నేరని పని యైయున్నది. పక్కనున్న పెద్ద దిబ్బను గాని, దీని నే యింకను లోతునకు గాని త్రవ్వి పరిశీలించినచో ఆంధ్రదేశ ప్రాచీన చరిత్ర యెంతయో బయల్పడ గలదని మేము నమ్ముచున్నాము.

ఇక్ష్వాకు రాజవంశమునకు చెందిన మాఢరీపుత్ర శ్రీ వీరపురుష దత్త మహారాజునకు

చెందిన శాసనములు కొన్ని జగ్గయ్యపేట స్తూపములోను, నాగార్జునకొండ స్తూపములోను దొరకియున్నవి. అందు ఆ రాజవంశమునకు చెందిన స్త్రీల యొక్కయు, పురుషుల యొక్కయు పేళ్లు సుమారు ముప్పదివరకు ఇదివరకే గుర్తింప బడియున్నవి. నాగార్జునకొండలోని విశేషములను బట్టి మాఢరీపుత్ర శ్రీ వీరపురుష దత్తుని తండ్రి, వాశిష్ఠీపుత్ర శ్రీ చాంతిమూల యనియు, కుమారుడు వాసిష్ఠీపుత్ర ఇహువుల చాంతి మూల యనియు తెలియుచున్నది.

వీరు వేదమతావలంబకు లైన బ్రాహ్మణులై యజ్ఞయాగాదులు చేయుచా నైనప్పటికీ, బౌద్ధ మతాభిమానులై బౌద్ధస్తూపములు, విహారములు కట్టించి బౌద్ధ మతవ్యాప్తికి యెక్కువగా తోడ్పడినట్లు చరిత్రకారులు వ్రాయుచున్నారు. వీరి అగ్నిష్టోమము, వాజపేయము, అశ్వమేధము, మొదలైన కర్మకాండలను గూడ జరుపుచుండిరట.

చాంతిశ్రీ, అడవి చాంతిశ్రీ, చూలచాంతిశ్రీ. ఉపాసిక బోధిశ్రీ, నాగశ్రీ, సునీలిశ్రీ, మూలశ్రీ, అయకోటిశ్రీ, బుధశ్రీ, శివనాగశ్రీ, నదిశ్రీ, శివరాగశ్రీ, రతుమశ్రీ, నాగశ్రీ, రామశ్రీ, ఇత్యాది నామములతో సుమారు ముప్పదిమంది స్త్రీ పురుషులు ఆనాటి వారు గుర్తింపబడియున్న సంగతి సుప్రసిద్ధ చరిత్రకారు లగు శ్రీ భావరాజు వెంకటకృష్ణారావుగారు రచించిన * గ్రంథమును బట్టి తెలియుచున్నది.




[ఈ వలయాకారమున బండలు పాతి యున్నవి.]

భోగాలపాటికి సుమారు 4 ఫర్లాంగుల దూరముగా ఉత్తరపు దిక్కున మరొక బోడు గలదు. ఈ బోడు జగ్గయ్యపేట-ముక్త్యాల కంకరరోడ్డునకు అంటుకొనియే తూర్పు దిక్కున గలదు. దానికి 'ఊర్లబోడు' అని పేరు. అందు వలయాకారముగ రాతిబండలు పాతియున్న 'రాకాసిగుళ్లు' అని పేరుగల సమాధులు (?) పెక్కు గలవు. అందు పెద్ద వాటిని రెంటిని కూడ త్రవ్వించితిమి.

(నెం 4. చిత్రములోనిది రాకాసిగుడి యొక్క బహిఃస్వరూపము. నెం 5 చిత్రము రాకాసిగుడి త్రవ్వించగా తేలిన స్వరూపము.)

పై చిత్రమున

నెం 1. సమాధియందు + గుర్తుంచిన స్థలమునందు ఒక కుండలో కొన్ని యెముకలును, నెం 2. సమాధిలో × గుర్తుంచిన స్థలమునందు, మరొక కుండలో మరికొన్ని యెముకలును కనుపడినవి. 1, 2 సమాధు

1 Early History of Andrha Dynasties.

లకు మధ్యగా నున్న బండకు ↑ గుర్తుంచిన చోటున సుమారు, ఒక మనిషి దూరగలంతటి సుంద్రపాటికన్నము తొలచియున్నది. నెం. 1. సమాధియందున్న యెముకలు చాలా పెద్దవై యుండుటచేత అవి మనిషివి మాత్రము కావని నిశ్చయించుకొని, ఇక దేనివై యుండునాయని నిపుణుల సహాయము నపేక్షించి, గుంటూరు మెడికల్ కాలేజి ఆనాటిమీ ప్రొఫెసరుగా నున్న డాక్టరు. వి. రామచంద్రరావు (యం బి, బి. యస్. యం. యస్. సి) గారికి చూపగా, నెం 1. సమాధిలో దొరకిన యెముకలన్నియు గుఱ్ఱపుయెముకలనియు, నెం 2. సమాధిలో దొరకిన వన్నియు మానవునికి సంబంధించిన వనియు గుఱ్ఱపు దంతములు, వెన్నెముకలు విడి విడిగా గుర్తించి చూపిరి. రెండు సమాధులకు హద్దుగా పాతిన తెల్లరాతి బండమీద ↑ గుర్తుంచిన, కన్నము పైభాగమున, మూడు పొడియక్షరములు చెక్కబడియున్నవి. అవి అంత స్పష్టముగా కానవచ్చుట లేదు. ఫోటో తీయుటకు వీలు కాలేదు-ఎస్టాంపేజి తీసినను అంత విస్పష్టముగా రాలేదు-వాటి స్వరూప మిట్టిది. ఆ యక్షరములు చాలా పెద్దవిగానే చెక్కబడి యున్నవి:--ఈ యక్షరములు 'లవిశ్రీ' కావచ్చునని తలచితిమి. క్రింది యక్షరము 'జ'

దీనికి చేరువనే మరియొక చోట ఒక తెల్లని నాపరాతిబండమీద వేగముగా అతి పౌరుషముతో పరుగిడుతున్నట్లు ఒకానొక అశ్వముయొక్క చిత్రము గండరింప బడి యున్నది. ఇది చూచుట కెంతయో ముచ్చట గొల్పుచు కనులపండువుగా నున్నది. కాని ఇటీవల నెవరో ఈ చిత్రమును చెడగొట్టిరి. ముఖము చెక్కివేయబడినది-(దీని ఫోటో నా వద్ద కలదు. దరిమిలా దొరికిన దగుటచేత బ్లాకు చేయించుటకు వీలుపడలేదు.)

వీటి నన్నిటినిబట్టియు ఆలోచించి చూడగా ఇక్ష్వాకురా జగువీరపురుషదత్త మహారాజుగాని, (మరొకరు గాని) అశ్వమేధయాగము చేసినపుడు యాగమునకు ప్రధానాంగ మగుఅశ్వమును దేశముమీద వదలుట ఆచారము గదా! ఆ విధముగా వదలినయశ్వమును, అశ్వసంస్థాపనము అయినతరువాత మహావైభవముతో సమాధిచేయుట యాచారముగా నుండెననియు, అట్టి యాగాశ్వమును సమాధి చేయునపుడు, దానిని పాలన జేయు వీరునియొక్క కళేబరమును కూడా ఆస్థలముననే సమాధి చేయుట ఆచారముగా నుండెడిదనియు మనము ఊహింప తగియున్నది-లేనిచో నొక అశ్వముయొక్కయు మానవునియొక్కయు సమాధు లొకే చోట చూచుట గాని, వీరినాముకు లైనచో నిట్టి సంఘటన జరుగుట గాని తటస్థింప నేరదు. మానవుని సమాధి చేయవచ్చునుగాని గుఱ్ఱమునెందుకు జేయుదురు? అందును అనామక మైన దానిని అసలే సమాధి చేయరు కదా! ఒక సమాధియందు మానవాస్థులును, మరొకదానియందు ఘోటకాస్థులును, రెంటికి మధ్య అడ్డముగా నున్న రాతిని తొలచి, సుంద్రపాటి కన్నము తొలచి, ఆ కన్నపుదారియైన యక్షరములు చెక్కుటయు, ఇందుకు వేరే అర్థము కనుపడుట లేదు. ఈ సమాధి నిర్మాణము కూడా యెంతో జాగ్రత్తతోను, భద్రముగాను చేసినట్లు కనుపడుచున్నది. చుట్టు పెద్ద పెద్ద తెల్లరాతి బండలు, అడుగున పరుపుబండలు, పైన భద్రముగా కప్పుబండలు కలిగియున్నది.

అశ్వమును, అశ్వపాలకుడును ఒకే సారి మృతి నొందిన గదా రెంటిని ఒకేచోట సమాధి చేయుట యని ఒక ఆక్షేపము రావచ్చును. ఇందెవరు ముందైనను, వెనుకైనను, సంబంధికుల నిద్దరిని ఒకే చోట సమాధి చేయుట విశేషమే గాని, ఇటుల సమాధి చేయుటకిద్దరును ఒకేసారి మృతి నొంద నక్కఱ లేదు.

ఇదంతయు నా యూహాగానమే గాని, ఇందుకు ఆధారము లేవియు లేవని కొంద రాక్షేపించవచ్చును. అట్టివారు దీనికి వేరే యర్థము చెప్పవలెను గదా!

ఈ విశేషము లున్నటువంటి ప్రదేశమునకు 'ఈర్లబో' డని పేరు. ఇదే 'వీరులబోడు' ఈర్లబోడైనదని శబ్దశాస్త్రవేత్తలు చెప్పగలరు. ఈ పేరు ఈ చోటికి వచ్చుటకు కూడ కారణ ముండి యుండవలెను-యుద్ధవీరుల సమాధు లున్నచోటునకు వీరులబో డని నామ మేర్పడి యుండవచ్చును-బౌద్ధకాలము నాటి వీరుల కొందరిని వారి వాహనములతో కూడా నిక్కడ సమాధి చేయు నాచార ముండి యుండు నని ఊహించినను తప్పు కాదు - అయితే నేను త్రవ్వించిన నాలైదు సమాధులలోను ఇట్టి విశేషము ఈ ఒక్క సమాధియందే కానవచ్చినది కాని మరి దేనియందును కానరాలేదు-ఈ సమాధినిర్మాణమే ఒక విచిత్రసన్నివేశములో నున్నది మిగతా వాటిలో కుండ పెంకులు అస్థికలు దొరికినవే గాని మరేవీ దొరకలేదు - ఇవి వీరుల సమాధు లనియు, అందుకే 'ఈర్లబోడ'ని పిలుచుచున్నా రనియు శ్రీ భావరాజు వెంకట కృష్ణారావుగారు చెప్పుచున్నారు. ఇదియు సంగతముగానే యున్నది.

ముక్త్యాల గ్రామమునకు తూర్పు పడమరలుగా రాళ్లతో గూడిన తిప్పలమీద 'రాకాసిగుళ్లను' పేరుతో చాల సమాధులు గలవు. ఇవి యెత్తైన గట్టి ప్రదేశములందు బహు శ్రమతో లోతుగా భూమిని త్రవ్వినిర్మించినవిగా కనుపడుచున్నవి. వలయాకారముగా 30, 40, అడుగుల చుట్టుకొలత గల ప్రదేశము నాక్రమించుచు మిక్కిలి బరువు గల రాతి గుండ్లు గాని, బండలు గాని సగమువరకు భూమిలో పాతి చుట్టు అమర్చపడియుండును. ఈ వలయమునకు మధ్యప్రదేశమునందు, సుమారు 8 అడుగుల పొడుగును, 4 అడుగుల వెడల్పును గల స్థలమున పొడుగున రెండు ప్రక్కల రెండు 8×6 అడుగుల నాప రాళ్లు పాతికలోతువరకు భూమిలో పాతియుండును. అలాగే 4×6 అడుగుల నాపరాళ్లు అడ్డముగా కూడ రెండు వైపులకు పాతికలోతుకే పాతియుండును. ఈ నాల్గు నాపరాళ్ళ మీదను మరల నొక పెద్ద నాపరాయి కప్పబడియుండును. ఒకే వలయమున రెండు సమాధు లున్నవి బహు అరుదుగా నుండును. వీటిలో కొన్నిటిని త్రవ్వించి చూడగా నందు, మట్టి పిడితలు అస్థికలు, కానవచ్చినవే గాని మరే విశేషమును కానరాలేదు. కొన్ని మట్టి పిడతలమీద మాత్రము బహు ప్రాచీన మైనఇక్ష్వాకుల నాటి లిపిలో పొడి యక్షరములు మాత్రము కలవు. పొడియక్షరములే యుండుటచేత వాని కర్థ మేమియు కుదురలేదు. వీటినిబట్టి ఈ పిడతలు, ఎముకలు, కుండ పెంకులు చాలా పురాతన కాలమునకు చెందిన వని ఊహించుటకు వీలగుతున్నది. రంగు రంగుల కుండపెంకులు తీరు తీరుల పిడతలు దొరికినవి.

ఈ చుట్టుపట్టుల జనులందరు వీనిని రాక్షసుల సమాధు లనియు, అందుకే 'రాకాసిగు'ళ్లని పిలుతు రనియు చెప్పుదురు.

ఇట్టివి లెక్కలేనన్ని నందిగామ తాలుకాలో కృష్ణానదీతీరమున గలవు. పురాతత్త్వ వేత్తలు వీటి నన్నిటిని పరిశీలించిన కొన్ని చారిత్రక విశేషములు తప్పక బయల్పడగల వని నాతలపు.

## అనుబంధము

1. గుండ్రని లోహపుపోత బిళ్లలు దొరకినవి సంఖ్య 7 (చిత్రము 8 మొదటి వరుస)

| బ॥ | మధ్యకొలత | మందము |
|---|---|---|
| 1. 110 తు॥ | 6 అం॥ | ½ అంగుళము |
| 2. 97½ ,, | 5½ ,, | డిట్టో |
| 3. 53 ,, | 4½ ,, | ¼ ,, |
| 4. 45 ,, | 5 ,, | ¼ ,, |
| 5. 42 ,, | 4½ ,, | ¼ ,, |
| 6. 31½ ,, | 3¾ ,, | ¼ ,, |
| 7. 31 ,, | 3¾ ,, | ¼ ,, |

ఇవి రాజముద్రికలకొఱకు పోత పోసిన లోహపు బిళ్ళలుగా గాని, తూకముకొరకై ఉపయోగించుటకు పోత పోసినవిగా గాని తోచుచున్నది. పరిశీలించవలెను. ఏ లోహమైనది కూడ పరిశీలించవలెను.

2. కరిగి పోతపోసి గుండ్రముగాను కొంచెము దొప్పగాను కోసిన రేకుబిళ్ళలు-దొరకినవి మొత్తం 9 (చిత్రము 8 మొదటివరుసలో 8 వ సంఖ్యబొత్తి)

| | బరువు | మధ్యకొలత | మందము |
|---|---|---|---|
| 1. | 13¾ తు॥ | 3 అం॥ | 1/8 అంగుళము |
| 2. | 14 ,, | 3 ,, | ,, |
| 3. | 13 ,, | 3 ,, | ,, |
| 4. | 10 ,, | 2¾ ,, | ,, |
| 5. | 8 ,, | 2½ ,, | ,, |
| 6. | 6½ ,, | 2¼ ,, | ,, |
| 7. | 7 ,, | 2 ,, | ,, |
| 8. | 6¼ ,, | 2¾ ,, | కొంచెమందపు రేకు |
| 9. | 6 ,, | 2½ ,, | ,, |

ఇవి యెందుకు తయారు చేయబడినవో తెలియుట లేదు. ఏ లోహమైనదియు పరిశీలించవలెను.

3. 19 తులాలు బరువు కలిగి కరగి పోత పోసిన లోహపుబిళ్ళ అర్ధచంద్రాకారము గలది పొడుగు 4 అంగుళములు వెడల్పు 2½ అంగుళము (చిత్రము 8లో 4 సంఖ్య గలరేకు)

4. 16½ తులాలు బరువు కలది కత్తిరించిన రేకుబిళ్ళ ½ అంగుళము మందము గలది, పొడుగు 4" వెడల్పు 2" (చిత్రము 8 లో, 3 వ వరుసలో 3 రేకు)

5. పొడుగుపాటి లోహపు ఖడ్గీ, పొడుగు 6¼ అంగుళము బరువు 21 తులాలు (ఇది రెండుగా విరిగినది) (చిత్రము 8 లో 3 వరుసలో మొదటిది)

6. కరిగిన లోహపు ముద్ద. తూకం 28 తులాలు (చిత్రము 8, మొదటివరుసలో 2వది)

7. రేకుబిళ్ళలు (లోహపువి) గుండ్రటివి దొరకినవి మొత్తం 10. (చిత్రము 8 లో మొదటివరుసలో 5 వ బొత్తి)

| | బరువు | మధ్యకొలత | మందము |
|---|---|---|---|
| 1. | 12½ తు॥ | 5¼ అం॥ | అర్ధణామందం |
| 2. | 10 ,, | 5¼ ,, | ,, |
| 3. | 10½ ,, | 4¾ ,, | ,, |
| 4. | 14 ,, | 4½ ,, | ,, |
| 5. | 11 ,, | 4¼ ,, | ,, |
| 6. | 8 ,, | 4½ ,, | ,, |
| 7. | 12½ ,, | 4 ,, | పయివాటికంటె కొంచెం మందం |
| 8. | 8½ ,, | 3½ ,, | అర్ధణామందం |
| 9. | 8 ,, | 3½ ,, | ,, |
| 10. | 7 ,, | 5½ అం॥ పొ॥ | అర్ధచంద్రా |
| | | 2¾ ,, వెడల్పు | [కారపురేకు |

ఇందులో నెం. 7 రేకునకు మధ్యగా కాని చుట్టుకొలత గలస్థలములో వలయాకారముగా గాడి కొట్టియున్నది.

8. లోహపు పనిముట్లు దొరకినవి. (చిత్రం 8 లో రెండవ వరుసలో 3 వది)

దేనిలో మాత్రగా కనుపడుచున్నది. మాత్ర పైన శిఖరాకారముగా బొడ్డు గలదు. తూకం 14 తులాలు.

9. లోహపుభరిణ. మధ్య రంధ్రము గలదు. బరువు 12½ తులాలు (చిత్రము 8 లో రెండవ వరుసలో 2 వది)

10. హారతి యిచ్చు ప్రమిదలాంటిది. లోహపుది. శిఖరాకారపు బొడ్డు గలది. తూకం 8 తులాలు (చిత్రము 8 లో రెండవ వరుసలో 1 వది)

11. లోహపు ప్రమిదతూకం 8¾ తులాలు. (చిత్రము 8 రెండవ వరుసలో 4 వది)

12 మట్టిపిడతలు (చిత్రము 9 లో, మొదటి వరుసలో 4, 5, 6)

13. మట్టి ప్రమిదలు 2 (చిత్రము 9 లో మొదటివరుసలో 1, 5)

14. రంధ్రముగల మట్టి గ్లాసులు. తానికా గుంతవి. 3 (చిత్రము 9 లో మూడవవరుసలో 1, 2, 3)

15. మట్టితో చేసిన శిఖరముబోలుగానున్నది. 4" యెత్తు 11" చుట్టుకొలత దిగువభాగంలో కలదు. చిత్రముగా నున్న ఈ శిఖరాకారము వస్తువు దేనికొరకు చేసినదో గాని విచిత్రముగా నున్నది. (చిత్రము 9 లో, మొదటి వరుసలో 2 వది)

16. మట్టిచక్రము గట్టిగా భరిణవలె నున్నది. 6½" చుట్టుకొలత గలది. చూడ దానికి రెండు మట్టి ప్రమిదలు ఒకదానిమీద ఒకటి బోర్లించి మట్టితోనే సీలు చేసినట్లుండును. రెండు ప్రమిదలకు చుట్టు లోతుగా అరవడి కలదు. చిత్రము 9 లో, రెండవ వరుసలో 6 వది)

17. మట్టిగొట్టములు 2 (చిత్రము 9 లో 2 వ వరుసలో 2, 3)

18. చిన్నపిడతలు 2

19. లోహపుగాజు 2" మధ్యకొలత గలది. (చిత్రము 8 లో 3 వ వరుసలో 4 వది)

సాహిత్యమీమాంస :

# నాటకపితామహుని సంవిధానచాతురి

శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు

ఆంధ్రనాటకపితామహుఁడు సృజించిన నాటకములు ముప్పదికిఁ బైఁగా నున్నను అందు ముద్రితము లైనవి పదునాల్గు మాత్రమే. ఈ పదునాల్గింటిలోఁ బెక్కాయన జీవిత కాలమునందును మరణానంతరమును బహు నాటకసమాజములచేఁ బ్రదర్శింపఁ బడినట్టివే. అముద్రితము లైనవానిలో సైత మజామిళ చరిత్రాదులు కొన్ని ప్రదర్శింపఁబడి జనాదరము నొందినట్లు నాటకముఖస్థము లైనపీఠికలవలనఁ దెలియుచున్నది. అతిమాత్రమైన దిన దిన ప్రవర్థితమైన యీజనాదరమే యాచార్యులుగారన్ని నాటకములు రచించుటకుఁ బ్రోత్సాహ మొసంగెను. చిత్రనళీయము, చంద్రహాస, ప్రమీలార్జునీయము మున్నగు నాటకము లిప్పటికిని దమ క్రొత్తఁదనమును బాయక సహస్రములకొలఁది సామాజికుల నాకర్షించుచు నే యున్నవి. ఇట్టి నాటకము లింతకాల మవిచ్ఛిన్నమైన యభిమానము నాహరించుట యందలి యపూర్వమైనశిల్పగౌరవమును జెప్పక చెప్పుచున్నది. అట్లు కానిచో నవి పెక్కితర నాటకములవలెఁ దమ కర్తల జీవితములతోనే యంతరించి యుండెడివి.

ఆచార్యులుగారు గ్రహించిన వస్తువు లన్నియుఁ గొంచె మించుమించుగాఁ బ్రఖ్యాతములే. పరిచితపూర్వము లైనకథలందే సామాజికుల కపార మైనయభిరుచి కలిగించుట యందాయన నైపుణ్యము బహువిధముల గోచరించును. మూలవస్తువునకు నాటకరూప మొసంగుటలో నాయన స్వతంత్రించి క్రొంగ్రొత్త కల్పనల నెన్నో కూర్చుచుండును. అందుచే నాటకవస్తువు ప్రాఁత దయ్యుఁ బ్రత్యగ్రము వోలెఁ గన్పట్టి సామాజికుల మనస్సులను మిక్కిలి యవహితములుగా నొనరించును. శిశిరమున శుష్కించి నిష్పత్రములై చూచుట కింపుగొల్పనిపాదపములే వసంతాగమమున నవనవములై నేత్రానందము సంధానించునట్లు మూలమున నీరసము లైనవస్తువులే యాయన నాటకముల రసనిర్భరము లై యపూర్వరామణీయకముతో విలసిల్లుచుండు ననుటకు చిరకారి, బృహన్నల మొదలగు నాటకములు నిదర్శనములు. కథానిర్మాణమున స్వతంత్రించి మూలభిన్న మైనమార్గము నవలంబించుటయే యాయన యందలి శిల్పవిశేషము కాదు. మూలవస్తువునే యావశ్యకము లైనకించిద్భిన్నకల్పనలచే నభినవముగా గోచరింపఁ జేయుటయం దది మూర్తీభవించియున్నది.

కథ లెంత ప్రాచీనము లైనను ఆధునికము లైన సాంఘికరాజకీయాది విషయముల నందు సందర్భోచితముగాఁ జొప్పించి సామాజికులకు వానియం దత్యుత్సాహము కల్పించుట వస్తునిర్మాణమున నాయన యవలంబించు పద్ధతులలో నొకటి. ఇట్టిదాని నాంగ్లేయులు Anachronism అను దోషముగాఁ బరిగణిం

---

(17 వ పుట తరువాయి)

20. పూస, నీలవర్ణం గలది. ½" పొడుగు. మధ్యరంధ్రమున్నది (చిత్రము 9 లో 3 వ వరుసలో 5 వది)

21. గుండ్రనిపూస, మధ్య రంధ్ర మున్నది. (చిత్రము 9 లో 3 వ వరుసలో 5 వది)

22. మట్టిగాజులు, ముక్కలు (చిత్రము 9 లో 2 వ వరుసలో 5 వది)

23. రంధ్రము లేనిపూస (చిత్రము 9 లో 3 వ వరుసలో 4 వది)

కుండలు, కుండపెంకులు, సున్నము, రంగు రంగుల కుండపెంకులు (పూజలు గలవి, లేనివి). కొన్ని కుండపెంకులు సమకూర్చి చూడగా ఒకటి రెండు కుండల నతుకుటకు వీలున్నది. (చిత్రము 7)

24. ఎముకలు, మనిషివి గుజ్జువి. దంతములు, వెన్నుపూసలు, ఇతర ఎముకలు (చిత్రము నెం. 10) ఇవన్నియు 'రాకాసిగుడి' సమాధిలో దొరకినవి.

తురు. అయ్యు నట్టివి కొన్నిచోట్ల సామాజికుల యభిరుచికిఁ బోషకములే యగుచుండును. పాంచాలీపరిణయమునందలి యువతీ వివాహ ప్రశంసయు, ప్రమిలార్జునీయమునందలి స్త్రీ స్వాతంత్ర్య సంబంధి చర్చయు, చంద్రహాస లోని యుప్పుపన్నుమీఁది యుపన్యాసమును నిట్టివే. అనిశ్చితము లగుటచే దేశమునం దల్ల కల్లోలము కలిగించునిట్టి సమస్యలు నాటకమున నేదో యొక విధమునఁ బరిష్కరింపఁబడు నప్పుడు సామాజికు లవిహితచిత్తులై యావాదోపవాదముల నానందముతో ననుసరింతురు. ఇట్టివి శ్రద్ధతో నాలకించుటవలన వారికిఁ దాత్కాలికానందమే కాక యట్టి సమస్యల పరిష్కారమునకుఁ బూనికతోఁ బ్రయత్నించు సదుద్దేశములు కూడ జనించును.

రసపరిపోషణమున నాచార్యులుగారు సిద్ధహస్తులు. నాటకాదియందు నిర్దేశింపఁబడిన రసమునకు విచ్ఛిత్తి కలుగకుండఁ గట్టకడదాఁక దానిని నిపుణముగాఁ బోషించుట యాయనకు వలెఁ బెక్కు నాటకకర్తల కందరానిది. శృంగార, కరుణ, హాస్యరసములాయన నాటకములలో మిక్కిలి యుదారముగఁ బోషింపఁబడియున్నవి. కరుణరసము నాంధ్రమున నింత నిశితముగఁ బోషించిన నాటకకవి యింకొకఁడు లేఁడని చెప్పవచ్చును. పాదుకాపట్టాభిషేక విషాదసారంగధర నాటకములలోని కరుణ మనన్యాదృశ మైనట్టిది. ఆచార్యులుగారు శృంగారమును మిక్కిలి చాకచక్యముతో వర్ణింతురు. ఆయన నాటకములలోని ప్రణయసంవాదము లన్నియు సహజములై నిర్మల మైనయనురాగమున కాకరములుగా నున్నవి. హాస్యరస పోషణమున నాయనకుఁ గలకౌశలమునకు వరూధిని చివరి యంకమునందలి పితాపుత్రుల సంవాదమును గాని, చిరకారిలోని మోహినీ కల్పిత మైనహాస్యవినోదమును గాని చూచినఁ జాలును.

ఆచార్యులవారి నాటకములలోని పాత్రలు పెక్కు సుస్పష్టరేఖలతోఁ దీర్చి దిద్దఁబడియున్నవి. ఏ పాత్ర యేసందర్భమున నేస్థానము వహింపవలయునో యాయన బాగుగా నెఱుంగును. మంథరాదు లొకరిద్దరు తప్ప నాయన నాటకములందలి స్త్రీ పాత్ర లన్నియుఁ బాతివ్రత్యమునకుఁ బరమాదర్శములు. పాత్రలందుఁ దాను బ్రదర్శింపఁ దలఁచినభావముల కాయన సమగ్ర మైనరూపొసంగి సామాజికుల మనఃఫలకములందు వానిని సుస్థిరముగా నచ్చొత్తుకొనునట్లొనరించును. నలాదులలోని యౌదార్యమును, దుష్టబుద్ధిలోని దౌష్ట్యమును, రుక్మాంగద ప్రహ్లాద ప్రభృతులందలి భక్తినిష్ఠను ఆయన మిక్కిలి విశదముగా వర్ణించెను. ఆయన నాటకములందలి పాత్రలు మంచివైనను సుస్పష్టరేఖలతో గోచరించు ననుట కింకను అనేకనిదర్శనము లున్నవి.

పాత్రలచిత్తవృత్తి నిరూపణమున నాచార్యులవా రప్రతిమానులు. మానవ మనఃప్రవృత్తు లనేక సందర్భములలో ననేక విధములుగా గోచరించుటయే కాక యుత్తమమధ్యమాధములలో నొక్కొక్కరి యందొక్కొక్కవిధమునఁ బ్రతిఫలించుచుండును. వీని నన్నింటిని బర్యాప్తముగా గ్రహించినయనుభవ మాచార్యులుగారి నాటకములలోఁ బెక్కుచోట్లఁ గానిపించుచున్నది. విషాదసారంగధరమునఁ జిత్రాంగి చిత్తవృత్తి నాయన ప్రదర్శించినవిధ మత్యద్భుతముగా నుండును. ఆమె నిర్మల మైనయనురాగము తిరస్కారముచే ననివార్య మైనమహాక్రోధముగా మాఱుటయు, నాక్రోధముయొక్క క్రమపరిణామమున మరల ననురాగచ్ఛాయ లెడనెడ గోచరించుటయు నందు విశదముగా వర్ణింపఁబడియున్నవి. ఇట్లే కైకా మంథరల మనోవృత్తులఁ బ్రదర్శించుటయందును, స్త్రీ యైన భర్తను బెండ్లాడిన కళావతి మనోభావములను, నపుంసకుఁడై భార్య నన్యుఁ డవమానించుచుండఁ జూచుచు నూరకుండవలసిన బృహన్నల మనోభావములను ఆయన మిక్కిలి నేర్పుతో వర్ణించెను. ఈ విధముగ స్త్రీ పురుషుల చిత్తవృత్తుల మనోహరముగాఁ బ్రదర్శించుటలో నే నాటకకవి శిల్పగరిమ గోచరించును.

అర్వాకన్నివేశ సంఘటనమున నాచార్యులుగారిని మించువా రెందరో యుండరు. ఆంధ్రనాటకకర్తలలో నాచార్యులుగారు సన్నివేశకల్పనములవలనను, పానుగంటివారు సంవాదనైపుణ్యమువలనను, తిరుపతి వేంకటకవులు తీరైనపద్యములవలనను పేరు గడించి రనునొకానొకవిమర్శకుని వాక్య మెంతయు సమంజసముగా నున్నది. చిత్రనళీయమునఁ బర్ణాదసుదేవుల సమాగమమును, జరకారిలోఁ జంద్ర

రేఖ పురుషవేషమున నున్న మోహినిని ముద్దాడుటయుఁ, జిత్రాంగియు రాజరాజును మాటాడుకొనుచుండఁగా రత్నాంగి యచ్చటికిఁ వచ్చి పుత్రభిక్ష వేఁడుటయు, ముక్తావళి తన యాడుఁదనమును గళావతి కెఱింగించుటయు, నభిమన్యుఁడు తన తండ్రులఁ జూడ నరుదెంచి వారిని జేర్వఁగఁ బిలువ వారు తాము పాండవులు కానట్లు నటించుటయు నఖండ మైనభావోజ్జృంభణము (Thrill) కలిగించునద్భుతము లైనసన్నివేశములు. ఇట్టి వాచార్యులుగారి నాటకము లన్నింటిలోఁ గానిపించును. రసమయములు నాశ్చర్యావహములు నగు నిట్టి సన్నివేశముల సంఘటనమే యాయన నాటకముల కధిక సౌందర్యము చేకూర్చి వాని ప్రచారమునకు మిక్కిలిగాఁ దోడ్పడఁ జాలినది.

నాటకారంభములను నిపుణముగా రచించుట కవికి మిక్కిలి క్లేశకర మైనవిషయము. నాటక మంతయు రచించుట యొక యెత్తు. ఈ యారంభమును నిసర్గకోమలముగా నెలయించుట యింకొక యెత్తు. నాటకగాథకుఁ దత్పూర్వగాథతో నవిచ్ఛిన్న మైనసంబంధము కల్పించుటలోఁ గవి మిక్కిలి శ్రద్ధ వహింపవలెను. మఱియు విస్తృత మైనమూలకథలోని యే భాగముతోఁ బ్రకృత నాటకకథ నారంభింపవలయునో కవి ముఖ్యముగా గమనింపవలయును. ఆరంభమే ప్రధానకథలో సంబంధింపని యనావశ్యక విషయములతోఁ గూడి యందగనిదిగా నున్నచో సామాజికులకుఁ దొలుఁదొల్తనే నాటకమునెడ వైముఖ్యము దయించును. ఆచార్యులుగారి నాటకారంభ రంగములను మిక్కిలి చతురముగా నిర్వహింతురు. ఆయన నాటకములు తెలుచంతకుఁ బూర్వమునుండియు జరుగుచున్న యొక సంవాదముయొక్క నడుమ నారంభించును. దీనివలన పూర్వగాథకును నాటకగాథకును గలసంబంధ మెంతో సాంద్రముగా నతుకఁబడుటయే కాక సామాజికుల యుత్కంఠ, ద్విగుణీకృత మగుటయు సంభవించును. పాదుకాపట్టాభిషేకము, వరూధిని మొదలగు నాటకములలో నీ యారంభములు మఱియు రమణీయములుగా నున్నవి.

వరూధిని :

ప్రవ: — శతానందా! నీవు చెప్పగలవు కాని ఆచింత యెట్లు విడిచిపెట్ట వలయును?

శతా: — దానిని తలఁచుకొనకయే యున్న సరి.

పాదుకాపట్టాభిషేకము :

వసిష్ఠుఁడు: — అట్లయిన నీ యిష్టము. నీకే భయముగా నున్నపుడు కానిమ్ము.

దశరథుఁడు: — భయమునకుఁ గాదు. నాకేమో చేయవలయు ననియే యున్నది.

విషాదసారంగధరము :

మతిమంతుఁడు: — నీతిజ్ఞా! నయజ్ఞా! మన రాజుగారి శిరశ్శూల యిప్పు డెట్లున్న దని తెలిసినది.

నాటకము సారస్వతప్రయోజనమే కాక రంగప్రయోజనమును గూడ సాధింపవలయును గావున నందలిశైలి సామాజికులలోని పండితులకును బామరులకును గూడ సుబోధ మగునట్లుగా నుండవలయును. శ్రవ్యకావ్యములందు రచన సమాసభూయిష్ఠ మై కొంత క్లిష్టముగా నున్నను అవి సావకాశముగాఁ బఠింపఁబడును. కాన తదవగాహనవిషయమున నంత కష్ట ముండదు. నాటకమున వాక్యపర్యాలోచనకు వీలులేదు. అందుచే నందలి రచన యేకవారశ్రవణ మాత్రముచేతనే స్పష్టముగా బోధపడునంత సరళముగా నుండవలెను. అయ్యది పేలవతాదోషమున కాకరము కాకూడదు. అట్లయినచో నాటకజీవమే సడలి నీరసమై పోవును. సంస్కృతనాటకకవులలో మిక్కిలి నాటకోచితమును సుగ్రాహము నైనశైలి కలవాఁడు కాళిదాసు. ఆతని నాటకముల ప్రసిద్ధికిఁ బ్రబలముగాఁ దోడ్పడినసాధనములలో నిదికూడ నొకటి. ఆచార్యులుగారి రచనలోఁ బద్యములలోఁగాని గద్యములలోఁగాని క్లిష్టత యంతగా నుండదు. అందలిశైలి సర్వజనసుబోధ మై యొప్పారుచుండును. చిత్రనళీయమునందలి బాహుకుని పద్యములు మాత్ర మిందు కొక విధముగా నపవాదము లని చెప్పనగును. ఆయన పద్యములు పెక్కింటిలో భావగౌరవము లేదను మాట నిజమే కాని యవి దుర్గ్రాహము లనుటకు మాత్ర మవకాశము లేదు. ఆయన చెప్పఁదలఁచిన భావమును మిక్కిలి స్పష్టముగాఁ జెప్పుచుండును. ఆయన స్వయముగాఁ బాత్రల ధరించి నయ్యాయాసందర్భములలోఁ బదములను దగినంత యొత్తిడితో నర్థస్ఫోరకములుగా నుచ్చరించుట వినఁదగిన దని యాయన పాత్ర

ధారణమును జూచినవారు పలువురు నఢావు చుందురు. పదముల నుచ్చరించుటలో నియాయన యాగాంభీర్యము రచనలో నైతము కానిపించుచున్నది.

నాటకపాత్రల స్వభావములను స్పష్టముగా వివరించుటకై యాయన పెక్కు విధములఁ బ్రయత్నించును. క్లిష్టముగా నున్నయెడలఁ బాత్రల యూహలను వానితో సంబంధించియున్న కథాభాగములను ఆయన వేఱువేఱు ప్రక్రియలద్వారా సులభగ్రాహ్యముల నొనరించుచుండును. ఆయన వాడిన రెండు పూర్వరంగములును బాత్రల శీలస్వభావావబోధనమునకుఁ దోడ్పడు నట్టివే. ఆయన రచించు స్వగతములును, ఉత్తరములును జరిగిన కథాంశములను సామాజికులకు విశద మొనరించుటకు మిక్కిలిగా సహాయపడుచుండును. పూర్వులు విష్కంభాదుల ద్వారా సూచించు సూచ్యవస్తువు నాయన రంగములలోఁ బాత్రల సంవాదముల మూలముననే వ్యక్తము చేయుచుండును. ఆయన సంవాదములు తఱుచు సహజములై ప్రస్తుతవస్తువు నంటియుండు నుక్తిప్రత్యుక్తులతో సరసముగా సాగుచుండును. ఆయన రాఁబోవు కథాంశములఁగూర్చి యప్పుడప్పుడు కావించుచుండు నాటకోచిత మైన సూచన సామాజికులను ఫలాగమము నెడ సంశయగ్రస్తులఁ గావించి వారికి నాటకకథానుసరణమున నెక్కువ యుత్సాహము నొదవించుచుండును. ఇట్టి భావి కథా సూచక మైన ధ్వని నుపయోగించుప్రజ్ఞ సంస్కృత నాటక కర్తల కెల్లఁ గరతలామలక మైనట్టిది. ఆచార్యులుగారు ప్రాచ్యపాశ్చాత్యవాఙ్మయములు రెండింటియందు నారితేఱినవా రగుటచే వారి నాటకములలో నాటకసౌందర్యమునకుఁ బుష్టి చేకూర్చుతగుభయలక్షణసమ్మేళనమును గానిపించుచుండును.

ఆచార్యులుగారి నాటకములను సర్వజనాదృతములు కావించిన గుణవిశేషము వేఱొకటి కలదు. ఆయన స్వయముగా నటు లగుటచే నితరనటుల యొక్కయు సామాజికుల యొక్కయు నిష్టానిష్టములను జాగరూకతతో గమనించి వారి యానుకూల్యములను మనసునం దుంచుకొనియే నాటకములను రచించెడివారని చెప్పుదురు. ఇట్లు రంగముపైపు కూడ దృష్టి నిగిడ్చి నాటకములు వ్రాయువారు ప్రాచ్యులలోఁ జాలఁ దక్కువ. సంస్కృత నాటక కవులు నాటకముల సారస్వతప్రయోజనమును సాధించుటకై పూనినంత శ్రద్ధ రంగప్రయోజన సాధనమునకై తీసికొని యుండలేదు. అందుచేతనే వారి నాటకములు పెక్కు భాషాభావములందు రమ్యములే యయ్యుఁ బ్రదర్శనమున కంతగాఁ బనికి రాక పోయినవి. లక్షణవ్యతిరేకమునకైన నంగీకరించి కేవలము సామాజికుల యభిరుచుల కనుగుణముగా నుండు నను దృష్టితో నవలంబింపఁబడిన పద్ధతు లాయన నాటకములలో నెన్నియో కలవు. ఘన నాటకములలోఁ బాటలకుఁ దావు లేకున్నను ఆ ప్రాంతమువారు సంవిధానచాతుర్యము మొదలైన యితరగుణములకంటె సంగీతము నెడ మిక్కిలి యాదరము గలవా రగుటచే వాని నెడనెడ రచింపవలసి వచ్చెనని యాయన యే చిత్రనళీయ ప్రస్తావనలోఁ దేటపఱచియుండిరి. ఈ జనాదరప్రాప్తి నొందలి యభిలాషచేతనే వా రుచ్చనీచభావములతో సంబంధము లేకుండఁ బాత్రలన్నింటికి నెచ్చటనో యొక చోటఁ బద్యపఠనావకాశము కలుగఁ జేసియుండిరి. ఇట్లే కేవలహాస్యములోఁ గూడ రంగములను విషాదసారంగధరమునందలి న్యాయస్థానరంగమువంటి యితరరంగములను ఆయన రచించుట జనుల యభిరుచులకుఁ బోషకములుగా నుండుననియే. ప్రకరణమున కవసరము లేకపోయినను రాజసభలలో రంభాదుల నాట్యము ప్రదర్శించుటయు సామాజికుల యానందముకొఱకే. రంగస్థలమునకును నాటకమునకును సన్నిహిత మైనసంబంధ ముండుట యావశ్యకమే యయ్యు నది నాటకముయొక్క కళాసౌందర్యమునకు విధ్వంసక మగునంత యధికముగా నుండరాదు. అట్లున్నచో నాటకము తాత్కాలికముగా సామాజికబృందముల మెచ్చుకోలు పడయఁ గల్గినను జిరస్థాయి యైనప్రతిష్ఠను సంపాదించుకొనఁ జాలదు. అందుచేతనే నిజమైన నాటకకర్త నాటకమున రంగసారస్వతప్రయోజనముల రెండింటిని యథార్హముగా సాధింపవలెను. ఆచార్యులవారి నాటకములలో నిట్టి సాధనమునకుఁ జేయఁబడిన ప్రయత్నము సర్వత్ర గోచరించుచున్నది.

కళకును నీతికిని నపరిహార్య మైనయవినా

భావ సంబంధము లేదు. ఉత్తమ మైనకళా పద్ధతిలో నీతి యంతరితమై యుండినను నెన్నఁడును ప్రాధాన్యము వహింపఁ జాలదు. కేవల నీతిబోధనమునకై ప్రయత్నించుకవి కావ్యకళా గౌరవమునకుఁ గళంకము తెచ్చిపెట్టినవాఁ డగును. కళారూపము కళంకితము కాకుండఁ గావ్యమున సరసముగా నీతిని బోధింపఁజాలుట ప్రతిభకసాధ్య మైనపద్ధతి. ఆచార్యులవారి నాటకము లన్నింటిలో నీతి యంతర్వాహినిగాఁ బ్రవహించుచునే యుండును. అది కొంత నిశితముగనే సూచింపఁబడినను శిల్పసౌందర్యమున కట్టి వైరూప్యమును గలిగించుట లేదు. ఇట్లు నైతికముగా శిల్పసంఘటన మొనరించుట యాచార్యులవారి యుపాసకళానైపుణ్యమున కద్దమైనతార్కాణము.

ఏకకవిలోనైనను సమగ్రత్వము సంపాదించుట కష్టము. నిరవద్యమైనకళాసృష్టి నిర్జరలోకమునను లేదు. ఆచార్యులుగారు స్వతంత్ర నాటకములు పెక్కు రచించి యాంధ్రవాఙ్మయమును బెంపొందించినవా రగుట నిర్వివాదమే యయ్యుఁ గళాదృష్టితోఁ జూచినచోఁ గొన్ని దోషములు సైతము వారి నాటకములలో గోచరించును. ఈయన నాటకవస్తువులలో బీజము మొదలు ఫలాగమమువఱకు నుండఁదగినపరిణామావస్థలు పెక్కుచోట్లఁ గానిపింపవు. నాటకప్రారంభమున బీజప్రాయముగా సూచింపఁబడు విషయమే నిర్వహణమున ఫలోన్ముఖ మగుట సహజ మైన పద్ధతి. ఉపసంహృతిలోని కార్యమునుబట్టియే బీజాదుల నిర్ణయమున కారంభించినచో నవి వారి నాటకములలో నే నడుమనో కానిపించుచుండును. అట్టిచోట్ల నంతిమమం దున్న విషయము నాటకములం దప్రస్తుత మేమో యనిపించును. వరూధినిలో వసూధసేవీరసేనుల ప్రణయముతో నారంభించినకథ మనోరమా స్వరోచుల వివాహముతో ముగియుటలోను, అర్జునుని శాపముతో నారంభించు బృహన్నల నాటకము త్తరాభిమన్యుల వివాహముతో ముగియుటలోను, చిరకారి కౌసామము వచ్చుటతో ముగిసిన యా నాటకము మేధానిధిరాజా యోగసాధనతో నారంభించుటలోను సంబంధ మేమియుఁ గానిపించుట లేదు. అందుచే నా నాటకములు చరిత్రవలెఁ గొన్ని సన్నివేశముల కూర్పులుగా గోచరించుచున్నవి. ప్రమీలార్జునీయమున నర్జునుఁడు కర్ణవధకై పశ్చాత్తాప మొందు రంగమునకును, పాంచాలి స్వయంవరమున నేకచక్రపురప్రసంగమునకును, చిరకారి నాటకమున మోహినీవృత్తాంతమునకును, బృహన్నలలోఁ గీచకవధకును గలస్థాన మేదియో నిర్ణయించుట కష్టము. అవన్నియు నానాటకములలో ననవసరముగాఁ గల్పింపఁబడినవి. ఈయనావశ్యకవస్తువిస్తరణముచే నాచార్యులుగా రందు నాటకమూలసూత్ర మైనసంక్షేపమున కంతరాయము కల్పించిరి.

ఇట్లు సంక్షిప్తతకు భంగము కల్పించిన విధానములలోఁ బద్యగద్యగేయములలోని భావముల పౌనరుక్త్యము వేఱొకటి. ఇది నాటకములఁ బ్రదర్శించు నటసమాజములకు సహాయకారియే యయ్యు సారస్వతదృష్టితోఁ జదువుకొనువారి కసహ్యభావమును గలిగించును. ఈ పౌనరుక్త్యమును గల్పించినచో నీ నాటకములు ప్రస్తుతపరిమాణమును సగము కోల్పోవు ననుటలో సందేహము లేదు. మూలవస్తువున కేదో విధముగఁ గొంత నూతనత్వమును గూర్పవలెననియే కాని యందలి యనావశ్యకవిషయములను దొలఁగింపవలె ననునుద్దేశ మాయన కున్నట్లు లేదు. అందలి విషయము లన్నిటి నెట్లో యొకట్లతుకుటకై యాయన చేసినప్రయత్నమే కీచకవధాదుల కాయా నాటకములలో నస్థానోపస్థితి సంభవించుటకుఁ గారణ మైనది.

ఆచార్యులవారి నాటకములలోఁ బ్రధానపాత్రలు పెక్కు క్రియాశూన్యములు. చంద్రహాసుఁడు, సత్యవంతుఁడు, సారంగధరుఁడు మున్నగువారి వృత్తాంతములు పరిశీలించినచో నీవిషయములు బోధపడును. మగవారికంటె నాఁడువారి కీనాటకములలో గొంత ప్రాధాన్యము హెచ్చు. అందుచే వారిలో స్త్రీ సహజమైన లాలిత్యము కొఱఁత పడినదని చెప్పవచ్చును. తిలక, మంథర, కమల మున్నగు నీచపాత్రలపై నాయా నాటకములలోని కథ యంతయు నాధారపడి యుండుట వాని సామాన్యగౌరవమునకు లాఘవ మాపాదించుచున్నది. వీనియన్నిటికిని దోడు నాటకకార్యముతో నంతగా సంబంధము లేని కొన్ని పాత్రలను సైతము కొన్నింటిని సృష్టించుట యందందుఁ గానఁబడును. చిరకారిలోని శ్వేతకేతుపాత్ర యిట్టిది. స్త్రీలకుఁ బురుషవేషములు

వేసి నాటకకథను నడిపించుట యాచార్యులుగారి కిష్టమనుటకు ముక్తావళి, చిరకారి, మోహినీ రుక్మాంగద యను నాటకములు నిదర్శనములు. ఆ నాటకములలో ముక్తావళీ మోహిన్యాదులు పురుషవేషములు ధరించుట మీఁదనే కథ చాలవఱకాధారపడియున్నది.

ప్రబంధకథలవలె నాచార్యులవారి నాటకవస్తువు లన్నియు రాజకుటుంబములతో సంబంధించి యున్నవే. ఒక్క చిరకారిలో మాత్ర మది కొంత సహజమై సాధారణ మానవుల జీవితముతో సంబంధించి యున్నది. పాశ్చాత్యుల పద్ధతుల నంత గాఢముగా నలవఱచుకొన్న యాచార్యులుగారు తమ నాటకములలో సాధారణ మానవజీవితములను గూడ వర్ణించుట కేల యత్నించి యుండలేదో తెలియదు. బహుశః ఆంగ్లనాటకకర్తలలో నగ్రేసరుఁడైన షేక్స్పియరు నాటకములందలి కులీనపాత్ర సంఘటనము చూచి యాయనయు నట్లే కూర్చి యుండును. అది గాక యాయన పెక్కు వస్తువులను పురాణప్రబంధాదులనుండియే గ్రహించి యుండుటచే నవి యంతకంటెఁ గ్రిందికి దిగుట యసంభవము.

ఆచార్యులవారి నాటకములలోఁ బ్రబంధముల ప్రభావము పెక్కువిధములఁ గానగుచున్నది. ఆయన మొదట రచించిన నాటకములు నాలుగైదు నాటకరూపమున నున్న ప్రబంధములనియే చెప్పవచ్చును. అందుఁ బురవర్ణనము, వియోగవర్ణనము మొదలగునవన్నియుఁ బ్రబంధపద్ధతి కనుసరణములుగా నుండును. మధురగతి వృషభగతి రగడలు, పద్యగద్యములలోని శబ్దాలంకారములు వానికిఁ బ్రబంధములతోఁ గలసారూప్యమును జెప్పక చెప్పుచున్నవి. వచనమున సైత మవకాశమునుబట్టి యనుప్రాసముల నుపయోగించుట యాచార్యులుగారి సంబోధనలలోఁ బెక్కుచోట్లఁ గానిపించును. సీసపద్యములలో రాగనామములు చొప్పించి వ్రాయుటయు, బహువిధవృత్తముల ప్రయోగమును, ఆనాటకములలోని పద్యముల నడకకును, రసోత్పాదనమునకును మిక్కిలి భంగము కలిగించుచున్నవి. అసలాచార్యులవారి పద్యములలో భావగాంభీర్యము తక్కువ. ఆయన శబ్దమున కిచ్చినంత ప్రాధాన్యమును భావమున కొసంగరు. ఇదియుఁ బ్రబంధకవిత్వాభిమానముకలన వచ్చిన దోసమే.

నాటకమునకు సంవాదము ప్రాణమువంటిది. అట్లు గాక కథనమార్గమే యవలంబింపఁబడుచో రూపమునఁ దప్ప తత్త్వమున నది నాటకమే యనిపించుకొనదు. షేక్స్పియరు Tempest నాటకమునందు ప్రారంభమున Prospero నోట ననిపించిన యుపన్యాసమును, Hamlet నాటకమున Haratio రాజకీయ చరిత్రను గూర్చి యొసంగిన యుపన్యాసమును కథనమార్గము నాశ్రయించుటచే నా నాటకములకుఁ గళంకము సంపాదించుచున్నవని విమర్శకులు నుడివియున్నారు. ఆచార్యులవారి నాటకములలో సంవాద మెంతయో కథనము కూడ నంత. కథాగమనమును విప్పి చెప్పునప్పు డాయన పాత్రల సంభాషణ యుపన్యాససరణి ననుసరించి పోవుచుండును. చిరకారి నాటకమునందలి తిలక కావించిన చివరి యుపన్యాసమునకు నాటకముకంటె నవల యుచితతరమైన స్థానము.

నాటకలక్షణవిషయమునఁ బాశ్చాత్యుల ననుసరించుటయే కాక ప్రాచ్యలక్షణములను బరిహాసము చేయుట కూడ నాచార్యులవారి నాటకములు కొన్నింటిలోఁ గానిపించును. ప్రాచ్యలక్షణోల్లంఘనముగ, నాటకములను విషాదాంతములుగా నొనరించుటయును, మరణాద్యుద్వేగకరము లగు విషయములను నీరసపశుయుద్ధములను రంగముమీఁదనే ప్రదర్శించుటయును నను కొన్ని పద్ధతులు పండితుల కాయన నాటకములయెడ నుండవలసిన యభిమానాదరములను కొంతవఱకుఁ దగ్గించి వైచినవి. అంకములను రంగములుగా విభజించుటలో దోసము లేదు కాని యవి యధికసంఖ్యాకము లగుచో నాటకానురక్తి ఖండితమై సామాజికుల రసాస్వాదనమునకు భంగము కలిగించును. Antony Cleopatra లో షేక్స్పియరు రచించిన బహురంగములు తన్నిర్మాణక్రమమునకుఁ గొంత లోపమాపాదించుచున్నవని పెక్కులు నుడివిరి. ఆచార్యులుగారు సైత మంకముల ననేకరంగములుగా విభజించుట ముక్తావళిలోఁ గాననగును. ఇంతే కాక రంగమునకును రంగమునకును విశేషకాలవ్యవధాన ముండుట వారి నాటకములలోఁ దఱుచు. అంకమునకు నంకమునకు నే కాలవ్యవధాన మంతగా నుండరాదను


ధ్వని
అవివక్షితవాచ్యము
వివక్షితాన్యపరవాచ్యము
అర్థాంతరసంక్రమితము
అత్యంతతిరస్కృతము
సంలక్ష్యక్రమవ్యంగ్యము
అసంలక్ష్యక్రమవ్యంగ్యము
శబ్దశక్తిమూలము
అర్థశక్తిమూలము
ఉభయశక్తిమూలము
పదైకదేశము
రచన
వర్ణము
వస్తుధ్వని
అలంకారధ్వని
స్వతఃసంభవి
కవిప్రౌఢోక్తిసిద్ధము
కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధము
అ.ధ్వని
ప్ర
వా
ప
ప్ర = ప్రబంధగతము. వా = వాక్యగతము. ప = పదగతము.

# కవిసంజీవనీ లక్షణవిశేషములు

శ్రీ రావూరి దొరస్వామిశర్మగారు

(మూఁడవసంచిక తరువాయి)

---

ఇఁక నీ గ్రంథములోని లక్షణములఁ బ్రస్తావించి వానిపై నితరలాక్షణికుల యభిప్రాయములఁ గొన్నింటిని దిక్ప్రదర్శనముగాఁ దెలిపెదను.

ప్రథమతరంగము :

పద్యసంఖ్యలు—.

(1-4) దేవతాస్తుతి, గ్రంథకర్తృవృత్తాంతము.

(5-8) దథ (బిందుపూర్వక) ప్రాస - దీని నప్పకవి స్వవర్గజప్రాస మని పేర్కొనియె. థధలు బిందుపూర్వకములు గాకున్న నప్పకవి మతమునఁ బ్రాస చెల్లును; మఱియు నందు దథలకును బ్రాసమైత్రి చెప్పఁబడె.

(9-11) ఖండాఖండ ప్రాస - దీర్ఘముల మీఁద సబిందుక నిర్బిందుక ప్రాస చెల్లు నని ముద్దరాజు రామన మతము. ఉ. మూఁడు-కూడె. అనంతామాత్యుఁ డిట్టి ప్రాస 'ట-ప' లకు మాత్రమే చెప్పె. అట్లు గా దని యన్నింటికిఁ జెప్పవచ్చు నని రామన సవరించె.

'సాగ్ధబిందువు లై తేకిన్టిపటల
కరయఁ బ్రాసంబు నిర్బిందు లైనఁ జెల్లు

(1-52) నని యనంతుఁడు రామన యొన్ని యక్కరములకును దీర్ఘములమీఁద మాత్రమే యీ ప్రాసమైత్రి చెప్పుటం జూచి, కూచిమంచి తిమ్మన హ్రస్వములమీఁదను నిది చెల్లు నని వెండియు సవరించె.

గీ. అర్ధబిందువు నిర్బిందు వగుపదముల
ప్రాసములు దీర్ఘములమీఁదఁ బలుకఁ జెల్లు
ననుచుఁ దగ ముద్దరాజురామన వచించె
హ్రస్వములమీఁద నటువలె నలరు రుద్ర.
(సర్వలక్షణసార సంగ్రహము)

అప్పకవియు రామన ననుసరించి కొంబొలు నిడుపులమీఁది యరసున్నకే యీ ప్రాస నిర్దేశించెను.

రామనమతమున 'చీఁకటి' సార్ధబిందకము.

(12-21) గసడదవాదేశ సంధి—

ప్రథమాంతములమీఁదను, గాకుసంబోధనావ్యయ కర్మధార యాచేతనములమీఁదను కచటతపల కాదేశము వికల్ప మని రామన లక్షణము రచించి లక్ష్యములఁ జూపె. కూచిమంచి తిమ్మన కాకుసంబోధనలకు వికల్ప మనుటకు లక్ష్యములు గానరా వని యీ క్రింది రీతి విమర్శించె.

గీ. కాకుసంబోధనావ్యయకర్మధార
యంబుల నచేతనంబుల నగు వికల్ప
మనియె మును ముద్దరాజురామన సులక్ష్య
ములు వినము కాకుసంబోధనలకు భర్గ.
(సర్వలక్షణ. 1-99)

రామన చూపినపద్యములలోఁ గాకుసంబోధనలకుఁ దక్కఁ దక్కినవాని కాదేశము వచ్చినందుకు రానందుల కుదాహృతులు గలవు. ఇది చూచి కొంబొలుఁ గాకు సంబోధనలకు సులక్ష్యములు విన మని తిమ్మన చెప్పుట కాకర మేర్పడియుండును.

ఈ క్రింది లక్ష్యములు పరిశీలనార్హములు.

అవ్యయవికల్పము :

ధృతరాష్ట్రుండను బుత్త్రులు స్వనము......
వేగించే టొందుఁ గాన తిగంబొందుట కార్య
మా......' (1-10)

కాన-ఇది ద్రుతప్రకృతికము గాన సంధియందు మీఁదిపరుషములకు సరళాదేశాదులు వచ్చి 'కానఁ దగ' అనురూపము గలది యగు. అట్లగు నేని ప్రాసభంగ మేర్పడు. అధునాతన విమర్శకులు గొందఱు 'కాన' యరణ్యవాచక మని సంధి వికల్ప మని యేదో విధముగాఁ బై పద్యసందర్భము సమర్థించెదరు. మఱికొందఱు 'కాన' కళగాఁ జెప్పుదురు. ముద్దరాజురామన దీని నవ్యయవికల్పమునఁ జేర్చె. అవ్యయ మగుటచే మీఁది కచటతపలకే యాదేశము రాక వికల్పపక్షమున సరిపోయెను. ఆదేశమే వచ్చి యున్న ద్రుతముమీఁదివి గానఁ బరుషములకు సరళములె రావలయు. కాని రామన మతమున గసడదవలే వచ్చునేమో దురూహము.

కాకుస్వరవికల్పము :

నీ చెప్పిన పెద్దలు...వారలం గాని,
యేచక్కం బెట్టువాఁడనే పాండవులన్.
(1-14)

'కానియే' — ఇది కాకువు గాన దీనిమీఁద నాదేశము వికల్ప మని రామన మతము. కాని కూచిమంచి తిమ్మన యీప్రయోగము నే 'ఏను+చక్కంబెట్టు' అని సంధిగతశబ్దములుగా విభజించి 'తాను నేను' అను పదములు ద్రుతాంతము లయినను ప్రథమాంతము లగుటచేత 'ఏఁ జక్కం బెట్టు, ఏ చక్కం బెట్టు' అనురీతి రూపద్వయము సంధియం దుండు నని వ్రాసెను.

క. 'విదితముగఁ దాను నే నను [దాఁ
పదములు ప్రథమ లయి నాంతపదము లగుటఁ
జదివెను నే చదివితి నని
వదలక యిరుదెఱఁగుఁ బలుకవచ్చు మహేశా!'
(1 ఆ. 119-120-121 ప. 48-49 పు.)

తిమ్మన మతమున 'ఏ సక్కంబెట్టు' అను రూపము సైతము సాధువు గావలసియుండు. ఏతన్మతానుసారముగా 'కవదోనలును గాండీవము' అను భారతపద్యమునఁ బ్రాసస్థాన ఘటిత మగు 'ఏను విదప డిగియెద' (ఏను+పిదప) అను నాదేశ సంధివిధానమునకు సాధుత్వకల్పనము సుకర మగుచున్నది. కాని యీపై ప్రయోగములందలి సంధికల్పనకు మతాంతరములు పాఠాంతరములు పెక్కురీతుల వెలయఁ జొచ్చినవి.

అవ్యయమున నాదేశము వచ్చినందులకు రామన 'అవలీలక' అనుపద్యములోని 'చిక్కు వడం జేయదె' (1-17) అనుప్రయోగము చూపెను. ఇందు 'చిక్కు' అవ్యయమా? విశేష్యము గాదా? కూచిమంచి తిమ్మన యవ్యయమున కాదేశము రానందులకు రామన యొసఁగిన 'కాన తగం బొందుట' యను ప్రయోగమే యిచ్చెఁ గాని, యాదేశము వచ్చినందులకు 'చిక్కు వడు'నను ప్రయోగ మొసఁగక 'బిట్టు దునిమె, క్రూరాత్ముండవై సీర లొలిచి' యిత్యాదుల నుదాహరించె.
(సర్వలక్షణ-1 ఆ; 99-104 ప; పు. 44-45)

(22-24) పువు - పువ్వు, దవు - దవ్వు-ద్వైరూప్యము.

(25-28) ప్రాణాన, సౌఖ్యాన, నిటలాన, ఫలాలు.— పాదాలు (కవిచింతామణి) వేషాలు, దోషాలు, వేదాలు (చూడామణి) గ్రామాలు, పురాణాలు, శాస్త్రాలు, వేదాలు (ఆంధ్రకౌముది) గ్రామ్యము లని చెప్పఁబడినవి. కూచిమంచి తిమ్మన గ్రామ్యశీర్షిక క్రింద 'ఫలాలు' అను రూపము పేర్కొని, యిటువంటివి గ్రామ్యపదంబు లయినను సుశబ్దంబు లగుట కుదాహరణ మహాకవిప్రయోగ మని వ్రాసి, రామన యొసఁగిన వరాహపురాణపద్యము నే (రమణులాఁద ఫలాలు రాల్చిన కీరపోతముల ప్రాణాలకుఁ దప్పినారు) యుదాహరించె. మలోపతత్పూర్వస్వర దీర్ఘతారూపములు కవిప్రయుక్తము లసంఖ్యాకములు గలవు. ఆంధ్రశబ్దచింతామణిలో 'వికృతౌ క్వచిచ్ఛలోపో మోర్దీర్ఘశ్చాత ఆదిమస్య భవేత్' అను పై రూపసాధకసూత్రమందలి వికృతిశబ్దము గని యాచ్ఛికశబ్దములకే యీ విధి యని కొందఱు భ్రమించెదరు. చింతామణి మతమున సామాన్యముగాఁ దత్సమతద్భవ దేశ్యాత్మకం బయిన తెనుఁగునకు వికృతి యను సంజ్ఞ వ్యవహృతముగాఁ గన్పట్టెడు. 'ప్రాణాన, నిటలాన' ఇత్యాది భారతప్రయోగములే యిందులకుఁ బ్రమాణము.

(29-31) లడప్రాస (అభేదప్రాస)
రామన :— లడయో రభేద యనఁగా, నిడఁదగుఁ
బ్రాసములు కృతుల నితరేతరముల్.

దడము దళం బన మొసలి మొ, సడి వెడలె వెలలె ననంగ జలరుహనాభా.- లక్ష్యములు-భీష్మపర్వము - కొడుకులు దమ్ములు గుజ్జుపు, దళములు-నైషధము-చిలుకలు గూయనో చెవులు చిల్లులు వోవఁగ నంచు నెన్నఁడుఁ వెడలఁడు.

(అచ్చుప్రతిలోఁ బై లక్ష్యములందు 'దడములు, వెలలఁడు' అని యున్నది. అట్లన్నచోఁ బైలక్షణమున కివి లక్ష్యములు గాఁజాలవు.)

లడల కభేద ముంటచే లడప్రాస చెల్లు నని పై లక్షణమున కాశయము.

కూచిమంచి తిమ్మన పై రామన యభేద ప్రాస నిట్లు ఖండించె:—

క. అడలకు నభేద మనుచుఁ
వెడఁగులు గదుఁ బ్రాసములను విశ్రమములను
బ్బడరఁగ గలుపుదు రది యె
య్యెడలను భవ్యంబు గాదు హిమకరమకుటా!
(2-20)

ఆ. వెలుడె నన్వదంబు వెడలుట యంచు ల
త్ష్యంబు నైషధమున నరసి అడల
కిల నభేద మనుచు నలముద్దరాజారా
మన వచించెఁ దలఁప నది హుళిక్కి.

పై భారతనైషధపద్యములనే (2-22) 'కొడుకులు...దడములు, చిలుకలు...వెలుడఁడు' అనుపాఠములతో నుదాహరించె.

అప్పకవీయము కవిసంజీవనిలోని యభేద ప్రాస యథాస్థితముగా గ్రహించె.
(చూ. అప్ప-అభేదప్రాస-3 ఆ. 368-371 ప)

(32-36) ద్రుతహల్సంధి.

సాంతపదములమీఁద కచటతప వర్గములు పరంబు లగుచో నకారమునకు బిందువగు; కచటతపలకు గజడదబ లగు. (32)

నకారము (ద్రుతము) మీఁది కచటతపలు గజడదబ లగుట ప్రసిద్ధము. ఇందులకు లక్ష్యములు కవిసంజీవనిలో లేవు. పరుషేతరపరకత్వమున నకారమునకు బిందువు గలిగిన ప్రయోగములు (33-36) మాత్రము చూపఁబడినవి. కచటతప వర్గాక్షరముల కన్నింటి కీ విధి చెల్లు నని యూహింపవలయు. ఇందులకు 'కాచెం గజంబు, ప్రోచుం జగంబు, తాల్చెం మురారి' ఇత్యాదు లుదాహృతములు. అథర్వణవ్యాకరణములలో వర్గయుక్స్వరశంబులు పరంబు లగునపు డొకానొకచోఁ బూర్ణబిందువును గానంబడియెడి నని మాత్రము గలదు. (బాల-సంధి-19)

చింతామణి సూత్రముచొప్పున సరళస్థిర పరకత్వమునను నకారమునకు బిందుప్రాప్తి గ్రాహ్యమగుచున్నది. (చూ - లుగ్వాద్రుత ప్రకృతికాత్పరత స్సరళే స్థిరేచ న స్సస్యాత్, బిందుం ప్రవదంతి తం క్వచి త్కేచిత్) అట్టి నకారమునకు మకారము పరమగుచో (తాల్చెన్ + మురారి) బిందుత్వము వహించు నకారము మకార మగు నని యీ క్రింది యథర్వణకారికవలనఁ దెల్ల మగు. 'కేచిద్వదంత్యభేదత్వ మనుస్వార మకారయోః.' (తాల్చెం+మురారి-తాల్చె మ్మురారి) ఈ యథర్వణకారిక 'కమ్మని లతాంతములకు మ్మొనసి' (లతాంతములకున్ + మొనసి' యను నన్నయప్రయోగము సమర్థింప నారబ్ధమై యుండును. అప్పకవి మకారపరకత్వమందే కాక నకార పరకత్వమందును ద్రుతమునకు బిందు వుపదేశించి యట్టి వానికిని ద్విత్వమకార నకారములకుఁ గ్రమముగ ననునాసికప్రాస చెల్లునని లక్షణము రచించె. (3-340)

అతఁ డిచ్చినలక్ష్యములు—

మిన్నేఱు పాదమున ధా, తం నాభిని (3-341)

తమ్ములను......భ, త్రిం మురసంహారు (3-342)

పై యాథర్వణసూత్రపద్ధతింబట్టి పై సంధులందు మకార ద్విత్వమువలె నకారద్విత్వము గలిగె నని సమాధానము చెప్పికొన నగు. మీఁదు మిక్కిలి యీ నకారద్విత్వమునకు 'అలుకిచ సంశ్లేషస్స్యా' త్తను చింతామణి సూత్రము సాధక మగు. నకారమునకు (ద్రుతమునకు) నకారపరకత్వమున సంశ్లేష మయ్యెను. (ధాతన్ + నాభిని - ధాతన్నాభిని)

రామన స్పర్శముల మాత్రమే చెప్పెను గాని స్థిరములనెల్లఁ జెప్పఁడయ్యె. చింతామణిచొప్పున నంతస్థోష్మ పరకత్వమందును నకారమునకు బిందుతావ్యాప్తి యనివార్య మగు. ఏతన్నిర్ణాయక ప్రయోగము లన్వేషణీయములు. వీని నెల్లఁ బరికించియే కాఁబోలు సూరి వర్గయుక్స్వరశంబులు పరంబు లగుచోఁ గ్వాచిత్కముగ ద్రుతబిందుతాప్రాప్తి సూత్రించె. 'కమ్మని లతాంతములకు మ్మొనసి' ఇత్యాదిప్రయోగములు కలిమింజేసి ప్రౌఢవ్యాకర్త 'ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతమునకు మకారాదేశం బగు' (సంధి-22) అని సూరి వదలినయంశమును బూరించె. రామన ద్రుతప్రకృతికమును నాంతపద మని పేర్కొనియె. కేతనాదిప్రాచీన లాక్షణికు లెవ్వరును ద్రుతసంజ్ఞ నుపయోగించి నట్లు లేదు. ద్రుతమును నకార మని, ద్రుతప్రకృతికమును నాంతపద మనియే వ్యవహరించిరి. ద్రుతసంజ్ఞ ప్రథమముగా నాంధ్రశబ్దచింతామణి యందే యుపదేశింపఁబడిన ట్లున్నది.

(37-39) ధర్మము - ధమ్మవు, కర్మము - కర్మువు.

(40-42) ఏవాఁడు - ఎవ్వాఁడు-ఎవ్వఁడు.

(43-44) నేతురు- నెత్తురు.

(45-48) పూంచె - పూనిచె - పూన్చె (మూఁడురూపములు)

పెనిచితి - పెంచితి, మనిచితి-మంచితి, అనిచితి - అంచితి (రెండురూపాలు)

(49-51) న-ణప్రాస
(52-54) అభేదయతి- పవర్గ వకారయతి.
(55-64) ఉభయయతి-స్వాంత, వేదండ, మార్తాండ శబ్దములు.
(65-68) ఒక్క, ఒక్కఁడు, అచ్చోటు
(69-71) వృద్ధివడి
ఏ కృతులయందును నకా
రైకారంబులను వృద్ధియతి నిడఁ జెల్లున్ (అచ్చులో-వడి నిడఁ జెల్లున్ - అని యున్నది, అచ్చో యతిభంగ మగు)

అ+ఏ=ఐ — ఐకారమునకు మాత్రమే యిందు లక్షణము లక్ష్యములు గలవు. ఔకారమున కీకృతియందు లక్ష్యలక్షణములు గానరావు.

(72-74) డిగి - దిగి.
(75-77) పొనరు - ఒనరు, పొనరించు - ఒనరించు.
(78-80) నఞ్సమాసయతి.
అనేకము (న+ఏక)-ఉభయయతి చెల్లును.
(81-84) అందఱు-అందొఱు, కొందఱు-కొందొఱు.
(85-88) అచ్చులతో హయలు యతి చెల్లుట (సరసయతి)

తెలుఁగున వాకుత్వము వోత్వము పదాది యందు లేవు.

వు-వూ-వొ-వోలు తెలుఁగుమాటల మొదట లే వనుట. ఈ విషయమును తెనుఁగు లాక్షణికు లందఱు చెప్పినారు. ఉండు, ఊరు, ఒకటి, ఓడ-ఇత్యాదుల వకారాదిగా వ్రాయరా దని దీన నెఱుంగునది.

(89-92) అఖండవడి :—

రామన యఖండవడి నంగీకరించి భారత రామాయణప్రయోగముల నొసఁగె. ఈ వడి విషయమున మతభేదములు కలవు. అఖండవడి నిరసించినవాఁడగుట నప్పకవి యుభయయతుల క్రిందఁ బంద్రెండు భేదములు చెప్పవలసివచ్చె. సామాన్యాఖండవడిని (సంధిగతశబ్దముల కెల్ల నుభయవడిని) భీమన, చిత్రకవి పెద్దన, కస్తూరి రంగకవి మున్నగువా రంగీకరించినట్లు దోఁచెడు. వెల్లంకి తాతంభట్టు, అప్పకవి యఖండవడిని నిషేధించిరి. కూచిమంచి తిమ్మన దీనిని వడి భేదములందుఁ జేర్కొని లక్ష్యలక్షణములు రచించి కడపట 'ఇట్టి ప్రయోగములు కలవు గాని అఖండవడికి త్రికవుల ప్రయోగములు లేవు గనుక ఇది సుప్రయోగము కాదు' అని సూచించె. (2 ఆ-పు. 111)

ముద్దరాజు రామన యఖండవడికి భారత ప్రయోగములు రెండొసఁగినట్లు నేఁటి యసమగ్ర ప్రతివలనఁ దెలియుచున్నది.

(1) ఆరణ్యపర్వము—
ఉరమునయందుఁ గన్నులు......అశేష
సత్త్వఘస్మరుఁ డగుచున్న యట్టిదివి+జారిఁ
గబంధునిఁ గాంచి రచ్చటన్.
(2) ఉద్యోగపర్వము—
అని మది నిశ్చయించి.........మా
కొనరిన సైన్యముల్ పదునొ+కొంటికిఁ
బ్రాభవ మాచరింప
(3) తర్యాతిభాస్కర రామాయణప్రయోగము-
అన్నవు తండ్రియట్ల......రాజు లే
మన్నను దప్పు గాదు నృప+ మండన
ముఖ్యము లైన కానుకల్.

కూచిమంచి తిమ్మన పై భారతపద్యములఁ జూపక రామాయణపద్య ముదాహరించె. అప్పకవి పై భారతపద్యద్వయమునందు నఖండవడి లేనిపాఠాంతరముల నొసఁగి యఖండవడి యప్రశస్త మని నిషేధించె. పైరెండుపద్యములే కాక భాగతమునుండి మఱి మూఁడుపద్యములను బై రామాయణపద్యమును వ్రాసి, యవి యెల్ల సులక్షణసారమందు లింగమగుంట తిమ్మన వ్రాసిన యప్రశస్తంబు లగులక్ష్యంబు లని వానికి లక్షణ వంతంబు లగుపురాతనప్రోక్తంబుల వివరించెద నని యఖండవడిరహితపాఠములనే చూపెను.

రామనోదాహృతుల కప్పకవిసవరణలు :—

1. అశేషసత్త్వసం, హరుఁ డగుచున్నవాని దివి+జారి (3-210)

2. మా, కొనరిన సైన్యముల్ పదునొ+కొంటికి—ఇం దప్పకవి పాఠాంతరము చూపక యున్నదాని నీ క్రిందిరీతి సమర్థించెను.

'పదునొకొంటికి-నని యున్నచోట సంధి గూర్చి స్వరప్రధానవడిగాను సోమరాజులు ప్రయోగించినారు. ఇది తెలియక కొందఱు మూఢులు నిత్యనిత్యసమాసవడి యనుకొందురు' (3-212)

ఇందు మాకు+ఒనరిన......పదునొక+ఒంటికి (పది+ఒక+ఒండు—పది+ఒకొండు పదునొకొండు—పదునొకొంటికి) అనుపద చ్ఛేద మరయునది.

ఒకొండు శబ్దము 'ఒక+ఒండు' అను శబ్దముల కూడికచే నేర్పడిన సంధిగతశబ్ద మని యప్పకవిమతము. ఇటీవలిపండితు లది యఖండ మగు నేకపదమే యని యంటుఁ బదద్వయని ర్భాగప్రసక్తి గానరా దని యుగ్గడింతురు. క్రింది తెనాలిరామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యములోనియతిస్థాన ఖచితప్రయోగము పై శబ్దము సంధిగతపదద్వయ మని నిర్ధారక ముగా స్పష్టపఱచెడు.

'గీ. వాసుదేవాది నరశక్తి వైభవంబు...
ఇదియె వహించు నని నల్వ యిడిన పసునొ
కొంటి లెక్కనఁ గనుబొమ్మ + లువిద
కమరు (3-198)'

ఒకొండు శబ్దమందలి యఖండవడింగూర్చి భారతి (1949-సెప్టెంబరు) లోను, త్రిలింగ లోను (16-7-1951) నావ్యాసములఁ జూచు నది. ఒకొండు శబ్ద మఖండవడిలోఁ జేర్చరేని యుభయ (స్వరవ్యంజనములకు రెంటికి) యతి ఘటింప వచ్చు నని యెఱుంగునది. స్వర యతికిఁ బై ప్రయోగములు లక్షణములు. వ్యంజన మైత్రికి 'పాండవులవలనఁ గీడగా, కొక్కొం డును లే దధిప నీదు+కొడుకులు' అను భారత పద్యభాగము లక్ష్య మగు.

(93-95) ఎగసె-సెగసె

(96-97) శయ్యాశబ్దభవములు—సజ్జ సెజ్జ.

కవిసంజీవనిలో సెజ్జకు ద్రోణపర్వ పద్య ముదాహృతము; సజ్జకు నుదాహృతి యుండి యుండును గాని నేటిప్రతిలోన విలుప్తము.

కూచిమంచి తిమ్మన 'శయ్య యనెడుచోట 'సజ్జ సెజ్జ' అని లక్షణము రచించి పైద్రోణ పర్వపద్యమును (సెజ్జను) వసుచరిత్ర కాశీ ఖండ పద్యములను (సజ్జకు) నుదాహరించె.

(98-104) నిత్యసమాసయతి.

ఆపోశన, వాతాశన, వాతాయన, రామా యణ, పరాయణ, నారాయణ, ఏకాంత, జనార్దన-శబ్దముల కుభయయతి.

(105-109) డకారమునకు ణకారరూపము.

పోఁడిమి - పోణిమి, ఉరువడించు - ఉరువణించు.

(110-111) ఉపసర్గల కుభయయతి-ఇందు లక్ష్యములు గానరావు.

కవిసంజీవనిలో ద్వీపశబ్దమునకు నచ్చు హల్లు చెల్లుట కుదాహృతులు గలవు. ద్వి+అప ద్వీప, ఇందు 'అప' శబ్దముయొక్క అకా రమునకు ఈకార మాదేశ మయ్యె. ద్వ్యన్త రుపసర్గేభ్యోఽప ఈత్ (6-3-97) ద్వి+అన్తర్ ఉపసర్గలకంటెఁ బరముగా అప్ శబ్దమునకు 'ఈ' ఆదేశము సూత్రమునఁ జెప్పఁబడినది. ద్వీప (ద్వి+అప్), అన్తరీప (అన్తర్+అప్) ప్రతీప (ప్రతి+అప్). సూత్రమున నుపసర్గల జేర్చి చెప్పుటచే ద్వీపశబ్దము సైతము కవిసంజీ వనిలో నుపసర్గోభయయతిక్రింది లక్ష్యముగా నొసఁగఁబడి యుండుఁ గాబోలు. ఈ ద్వీపాంత రీపశబ్దముల నిత్యసమాసయతిక్రిందఁ జేర్పఁగానె నప్పకవి.

(112-114) డక్కు-నుశబ్దము; దక్కు-అపశబ్దము (రామనమతము)

క. దక్క నని కాని చెల్లును
దక్క ననఁ బ్రయోగ మబ్జదళనేత్రునకుఁ
జక్కగవిల్లునికేళిని
? డ (ద) క్కరి పసి గాపు లెఱమి దారు
లనంగ (1-122)

లక్ష్యము-డక్కను రాజ్య మంచు నకటా యిది (ఉద్యోగ)-(1-113)

డక్కునకు దక్కనురూపాంతరము నిషేధించునట్లు పై పద్యమువలనఁ దెలియ నగు. నేటి సంజీవని యచ్చు ప్రతిలోఁ బై పద్యమున మూఁడు చోట్లను 'డక్కు' అనియె ముద్రితము. ద్వితీయచతుర్థపాదము లందుఁ బై లక్షణమున 'దక్కు' అని కవి వడియందు నిల్పుటకుఁ గారణ మా శబ్దము దకారాదిగాఁ జూపుటకే కాని 'దక్కు' శబ్దరూప మాతని యభిప్రేత మనరాదు. ఇందు 'దక్కు' నకుఁ బ్రయోగములు చూపఁ బడవు. రామన మత మిం దచ్చుప్రతిలోని పొరపాట్లవలనను పై లక్షణార్థము సందిగ్ధముగా నుంటవలనను నిదమిత్థ మని తేలకున్నది గాని తరువాతి కూచిమంచి తిమ్మన కావించిన రామన మతఖండనమువలనఁ గవిసంజీవనీలక్షణ మత గాహన మగుచున్నది. చూ.

(సర్వలక్షణ...పుట 101)

గీ. దక్క డక్క ననఁగ దబ్బర డబ్బర
దాసి డాసి యనఁగ దప్పి డప్పి
దిగ్గి డిగ్గి యుదుగతిని దాగి డాగి దా
పలను డాప లనఁగఁ బరఁగు నీశ!

గీ. డక్కనని కాని చెల్లదు దక్కనను ప్ర
యోగ మంచు వచించె నిం పొసర ముద్ద
రాజు రామన్న యది యథార్థంబు గాదు
రెండు గల వెన్నఁ గృతుల గౌరీశశ్ర.

(గమనిక :— కవిసంజీవనిలోని కందపద్య పూర్వదళము నట్లే కైకొని గీతముగా సరి చేసి రామన మతమును ఖండించెఁ దిమ్మన - గీఁత లుంచినభాగమును బరికింపుఁడు)

తిమ్మకవి తరువాత అడిదము సూరకవియుఁ దనకవిసంశయవిచ్ఛేదమున రామన పేరు చెప్పక యీ క్రిందిరీతిఁ దైమతమును ఖండించె.

'క. ఒక్కకని లేదటంచును
వక్కాణించుటను జెప్ప వలసెను నాకన్
డక్కను దక్కననం బను
దక్కను జయలక్ష్మి పురవిదారి కనంగన్.
(1 84)

ఈ ప్రసంగముంబట్టి కవిసంజీవని లక్షణము పూర్వార్థమునకు సవరణ'డక్కనని కాని చెల్లదు దక్కననఁ ప్రయోగ మబ్జదళ నేత్రునకున్' (115-116) రివడి 'ఋ-రి' యతి చెల్లును. (117-120)

1. తాయెత్తు, ఉయ్యెల, పయ్యెద-అను మూఁడు శబ్దముల మధ్య యకారమునకు మాత్రమే యెత్వము గలదు.

2. అంతమునఁ గ్రియలం దక్క యకార మున కెత్వము రాదు. (కనియె, చనియె మొ.)

3. ఆదియందు యకారమున కత్వము రాదు.

తాయెతయునుయ్యెలయుఁబయ్యెదయునుదక్క
గలుగ దెత్వంబు మధ్య యకారములకు,
తుదనుగ్రియఁ దక్క నెత్వంబు గదియ, దాది
నత్వ మొందదు తెనుఁగుల నబ్జనాభ
(కవిజన-1-117)

ఉయ్యెలాదు లేకపదములుగా వని, సంధి గతశబ్దద్వయము లని, యందలి 'యె' లఘు యకార మని యప్పకవి విమర్శించె.

తే. ధరణి నుయ్యెల పయ్యెద తాయెతులను
గలయకారంబులకు వక్రములు నిజంబు
ముద్దరాజు రామన వాని మూఁటిని బద
మధ్య యా లని చెప్పె నిమ్మాట మిథ్య.
అప్పకవి పదచ్ఛేదము— (2-184)

ఊఁచు+ఏల - ఉయ్యెల; పయి+ఎద-పయ్యెద, తాయి+ఎత్తు-తాయెత్తు ఇవిమూఁడును ప్రత్యేకపదములు గాని యేకపదములు గావు.
(2-186)

ఇందులకుఁ గూచిమంచివారి పరామర్శను దిలకింతము.

గీ. తాయెదయు నుయ్యెలయుఁ బయ్యెదయు [ననంగ
గలుగ దత్వంబు మధ్యయకారమునకు
ననుచు మును ముద్దరాజు రామన వచించెఁ
గాని యత్వంబు గృతులందుఁ గలదు శర్వ.
(పు. 63)

కవిజనసంజీవని లక్షణమునకు దీనికి భేద మున్నది. తాయెత్తు మున్నగు శబ్దత్రయమందుఁ దక్క మధ్యయకారమున కెత్వంబు గలుగ దనుచున్నాఁడు రామన. పై యభిప్రాయ మప్ప కవీయములల్లను జెల్ల మగును. (యకారములకు వక్రములు నిజంబు అప్ప. 2-184) ఇది యిట్లుండఁ దిమ్మన తాయెద-ఉయ్యెల-పయ్యెద శబ్దములందు యకారమున కత్వము గలుగ దని రామన చెప్పినట్లు వ్రాసి యమ్మతమును ఖండించె. తిమ్మనకు లభించినకవిసంజీవనీ లక్షణపాఠము వేఱై యుండు నేమో? తిమ్మన మతప్రకారము ఉయ్యాల, పయ్యాద యను రెంట నత్వవిశిష్ట యకారములు గలవు గాని తాయెతు(ద) అను చోటఁ గల దనుట మృగ్యము. తిమ్మన యత్వ విశిష్ట యకారమధ్యములుగా 'ఉయ్యాల, పయ్యాద' శబ్దద్వయమునకు మాత్రమే యితర లక్ష్యములఁ జూపె. తాయెద కత్వవిశిష్ట యకారము కలిమికే ప్రయోగము చూపలేదు. అత్వవిశిష్ట యకారమునకు లక్ష్యము నాతఁ డొసఁగలేదు. అట్టి ప్రయోగ మన్వేషణీయము. తాయెత్తు-తాయెతు-తాయెత అనురూపములు కోశములందుఁ గలవు. తాయెతయనురూపము నే తాయెద యని తిమ్మన గ్రహించె నేమో?

పదమధ్య యకారమున కెత్వము 'బోయెత' (బోయత-రూపాంతరము) శబ్దమందు నీ క్రింది పద్యమున యతిస్థానమునఁ బ్రయుక్తము.

'అతినవపల్లవోజ్జ్వలతరాంబర యా
తొలుసంజ గబ్బిబో
యెత తతి పేచి వింటఁ గదియించిన
వేగురుఁజుక్క యుంట.
(హరిశ్చంద్రనలోపాఖ్యానము-4 ఆ.)

(121-123) గురునకు—గురునికి
కృష్ణునకు—కృష్ణునికి
(సశేషము)

తెలుగుతోబుట్టువులు :

# తమిళవాఙ్మయపరిచయము

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారు

## కడసంగము :

ఇది 1850 సంవత్సరములు వర్ధిల్లెను. ఇందు 49 మంది కవు లుండెడివారనియు, 449 గ్రంథములు విమర్శింపబడెననియు ప్రతీతి. ఈ సంగమున కధ్యక్షుడు నక్కీ (త్కీ) రుడు. దిశాష్టకము నావరించు యశస్సు సముపార్జించిన తిరువళ్లువర్ మహనీయు డీ సంగమునందలి ప్రసిద్ధకవులలో సంభావ్యుడు. తిరుక్కుఱళ్, పేరిసై, కూత్తు, పత్తుప్పాట్టు, ఎట్టుత్తొగై, పదినెణ్ కీళ్క్కణక్కు మున్నగు గ్రంథములు వెలుగులోనికి వచ్చినవి యీ కాలము నందే. ఈ మూడు సంగములును ప్రసిద్ధములు. ఇవి కాక మఱి మూడు సంగములు చోళనాడులో వర్ధిల్లెను[1]. ఇక తమిళవాఙ్మయమునందు తలమానికముగా వెలుఁగొందుచున్న తిరుక్కుఱళ్ గ్రంథప్రాశస్త్యమును, తత్కర్త తిరువళ్లువర్ మహనీయుని జీవితవిశేషాదికమును గమనింతము.

“ అల్పాక్షరముల ననల్పార్థరచనఁ
గల్పించుటయ కాదె కవివివేకంబు ”

అని నుడివిన మహాకవి పాలకురికి సోమనాథుని మాటలకు లక్ష్యముగా పేర్కొనఁదగుగ్రంథ మేదని నున్న దన్నచో అదియే తిరుక్కుఱళ్ అని నుడువదగును. నీత్యుద్బోధకముగ సంతరింపబడిన యీ యుద్గ్రంథమును తమిళవేద మని నాడు నాటికిఁ గూడ తమిళులు విశ్వసించుచున్నారు. కొండంత భావమును రెండు పాదముల గీతికలో (కుఱళ్) అలతి యలతి మాటలతో కాహళివలె ధ్వనించునట్లుగ కుదించి చెప్పిన ప్రతిభాగరీయస్కుడు తిరువళ్లువరు. “ కొంచెపు నీటిబిందువున గోచర మైనమహావృక్షమువలె మహోన్నతములు, మనోజ్ఞములు నైనమధురభావములు రెండుపాదముల కుఱళులలో చెప్పబడెను ” అని సహృదయు డొకడు కుఱళును కొనియాడెను. ఇది యత్యుక్తి కాదు.

ఇట్టి యుద్గ్రంథమునకు సంబంధించిన యైతిహ్య మొకటి కలదు. సంగములు వర్ధిల్లిన యా దినములలో ఏ గ్రంథ మైనను సరియే బహుళప్రచారమును గడింపవలయు నన్నచో నది తొలుత సంఘకవుల యామోద ముద్రను పొందవలసి యుండెను. మహాకవుల పరిశీలనార్థము తిరుక్కుఱళ్ మూడవసంగము వారికి సమర్పింపబడెను. కాని యాసంగకవులు కుఱళును ప్రామాణికగ్రంథముగ పరిగణింప లేదు. ఆ విషయమును తెలిసికొని ప్రసిద్ధ తమిళకవయిత్రి యగు అవ్వై[2] కుఱళ్ నందలి వైశిష్ట్యమును సంఘకవులకు తెలియజేసెను. అప్పటికిని వారు తమ యభిప్రాయమును మార్చుకొన నిరాకరించిరి. పిమ్మట తిరుక్కుఱళును ‘ [3]సంగపు పలక ’ పై నుంచి యా పలక నొక సరోవరమున పడవేయగ చూపఱకు సంభ్రమాశ్చర్యములు కలుగునట్లుగ కుఱళు మాత్రము సురక్షితముగ కొలనిగట్టును జేరెను. సంగపు పలక నీట మునిగిపోయెను. అప్పుడు సంగకవులు కుఱళును ప్రామాణికగ్రంథముగా నంగీ

1. చేరచోళపాండ్యమహీపతుల యాస్థానములందు బహుశః 586 మంది సంఘకవు లుండినట్లు తమిళపండితుల విశ్వాసము. చూడుడు: శ్రీ పూర్ణలింగం పిళ్లైగారి ‘ తమిళవాఙ్మయ చరిత్ర ’

2. అవ్వై వళ్లువరుసహోదరి యని తమిళపండితులు కొందఱు విశ్వసించుచున్నారు.

3. సంగపు పలక : ఇది భగవద్దత్త మని విజ్ఞులు భావించుచున్నారు. మధురలో వెలసిన మొదటి సంగమున కధ్యక్షు డైనసుందరేశ్వరుడే యీ పలక నొసగెనట. ఇది బంగారముతో చేయబడిన దని (పొఱ్పలగై) ప్రతీతి. సత్కవులకు మాత్రమే యాపలక కూర్చుండుటకు తావొసగుచుండెను. కుకవులను దరి చేరనీయదు. ఈ పలక నాధారముగ చేసికొని సంగకవులు కవిపరీక్ష సలుపుచుండిరట.

కరించిరి.

తిరువళ్ళువరు శైవు డని కొందఱును, జైను డని మఱికొందఱును భావించుచున్నారు. అసలీ కవి నిజనామధేయమే నేటివఱకు చరిత్రకు తెలియరాలేదు. వళ్ళువన్ అను మాటకు వింత గొలుపునర్థములు[1] చెప్పబడుట వలన తిరువళ్ళువర్ కులమును గాని మతమును గాని యిదమిత్థ మని నిర్ణయించుటకు వలను పడకున్నది. ఇతడు మదరాసునందలి మైలాపూరులో ప్రభవ మొందె నని విజ్ఞులు భావించుచున్నారు. ఈ హేతువును బురస్కరించుకొనియే కాబోలు మైలాపూరులో నీ మహనీయుని కొక యాలయము నిర్మింపబడెను. ఏది యెట్లున్నను నేడు తమిళనాడులో సర్వమతావలంబకులును, సర్వవర్ణములవారును తిరువళ్ళువరును వేనోళ్ల కొండాడుచుండుట గమనింపదగువిషయము. వళ్ళువర్ కులమునుగుఱించి భిన్నాభిప్రాయము లున్నటులనే, ఈతని కాలము గూడ వివాదగ్రస్తమైనది. వళ్ళువర్ క్రీస్తునకు పూర్వమే వర్ధిల్లినసంగయుగమునకు చెంది యుండనోపు నని కొందఱును, క్రీస్తుశకము తొలిమూడు శతాబ్దులలో జీవించి యుండవచ్చు నని కొందఱును తలచుచున్నారు. కాని రెవరెండ్ జి. యు. పోపు[2] "క్రీ. శ. 800-1000 ప్రాంతమున వళ్ళువర్ జీవించి యుండు నని తలచుచున్నాను" అనియు, [3]శ్రీ. పి. టి. శ్రీనివాస అయ్యంగారు "వళ్ళువర్ క్రీ. శ. 6 వ శతాబ్దమునకు తరువాతివా" డనియు నిర్ణయించిరి. ఇటుల పండితు లీ విషయమున భిన్నాభిప్రాయులై యున్నను, వళ్ళువర్ క్రీ. శ. తొలిమూడు శతాబ్దములకు చెందినవా డని పలువురు విశ్వసించుచున్నారు.

మహాకవియు, మహాతత్త్వవేత్తయు నైన తిరువళ్ళువర్ శాశ్వతయశస్సును గడించుటకాతని గ్రంథ మగుతిరుక్కుఱళే కారణము. సార్వజనీనము, సార్వకాలికము నైన యీ నీతిగ్రంథమునందలి సూక్తులు, ఇందలి విషయములన్నియు సహజసుందరముగాను, స్వాభావికముగాను చెప్పబడుటయే కాక యే మతప్రసక్తియు లేనివై కండ్లకు కట్టునట్లుగా నున్నవి. ఈ కారణముచే దీనికి పెక్కు పాశ్చాత్యభాషలలో ప్రశస్తము లగుయథానువాదములు వెలసినవి[4]. ఈ యుద్గ్రంథమునకు ముప్పాల్ (త్రివర్గము) ఉత్తరవేదమ్, దెయ్వనూల్ (దివ్యగ్రంథము) పొయ్యామొழி (యథార్థకావ్యము) తమిழ்మఱై (తమిళవేదము) మున్నగు నామాంతరము లేర్పడినవి. అటులనే యేతత్కర్తకు గూడ నాయనార్ (పూజనీయుడు) నాన్ముగనార్ (చతుర్ముఖుడు) పెరునావలర్ (మహావక్త) దేవర్ (దైవము) మొదలగు పేళ్లు వ్యవహారములో నున్నవి.

తిరుక్కుఱలో ధర్మార్థకామములకు సంబంధించినవిషయములు వివరింపబడినవి. కావుననే దీనికి త్రివర్గ మనుష్యవహారనామము కలిగెను. దైవస్తుతితో నారంభమైనధర్మఖండములో ప్రవృత్తి నివృత్తి మార్గములు విశదీకరింపబడినవి. అర్థఖండమునందు రాజ్యాంగ విధానము, కోశపద్ధతి, మిత్రత మున్నగువిషయములే కాక పాలకులకును పాలితులకును సంబంధించినయంశములు కూడ నభివర్ణింపబడినవి. కామఖండమున ప్రేమమూర్తు లయిన ప్రేయసీప్రియుల ప్రథమసమాగమము, వారి రహస్యప్రేమ, పిమ్మట నానాటికి పరిణతి చెందు వారిప్రేమానురాగములు, అనంతరము దుర్విధివశమున వారి నడుమ నేర్పడిన వియోగసంజనితదుఃఖోద్వేగము మున్నగు విషయములు సుకుమారహస్తముతో చిత్రింపబడినవి. వళ్ళువర్ కమనీయ కవితాశక్తిని, నిరుపమాన మగు కల్పనాచాతురిని నవగాహనము చేసికొనుటకు కామఖండము మిక్కిలి యుపకరించును.

వళ్ళువర్ దృక్పథమున కష్టపడి నేల పండించి ప్రపంచమున కాహార మిడుకర్షకుడును, యతులకు, మృతులకు, నభ్యాగతాదులకు, దీను

1. 'వళ్ళువన్' అనుమాటకు క్రిందియర్థము లొసగబడినవి. "పంచముడు, ఏనుగు నెక్కి నగారా మ్రోగించుచు రాజాజ్ఞలను తెలియజేయువాడు, ఆదిద్రావిడుల పురోహితుడు, శకునములను బట్టి భవిష్యత్తు నూహించువాడు."

2. ఇతడు తిరుక్కుఱళును ఆంగ్లములోని కనువదించెను. గొప్ప పండితుడు.

3. History of Tamils.

4. వివరములు కోరువారిని "తమిళవేదమును" (తిరుక్కుఱళ్) చూడగోరెదను.

లకును దిక్కుగా నుండునిర్మలు లైనగృహస్థుడును పరమపూజ్యులు. వీ రిరువురు లేకున్నచో సర్వసంగపరిత్యాగ మొనర్చి సాంద్రాటవీసీమలందు కాలము గడపుసన్న్యాసులు కూడ కష్టములకు లోనగుదురు. అటులనే గృహిణిని గురించి వళ్లువ రిట్లనును. "సహధర్మచారిణి సుగుణశీలవాల యైనచో దారిద్ర్యమునకు తావే లేదు. సుగుణసంపన్న కానప్పుడు ధనరాసు లుండి మాత్రము ప్రయోజన మేమి?"

"దెయ్‌వన్ తొழாஅళ్ కొழுనఱ్ఱెழுదు
తెళువాళ్ పెయ్యెనప్పెయ్యు మழை (ழ)
పరదైవముల వీడి పతిఁ గొల్చు చాన
కురియు మన్నంతనే కురియదే వాన".

అనియు వళ్లువర్ సహచరిని ప్రశంసించినాడు.

కామఖండమున ప్రేమనుగురించి వివరించుచు తిరువళ్లువ రిట్లు మనోజ్ఞముగ నుడివెను. "పూని ద్రాక్షాసవం బానఁగఁ దీపి, కాని ప్రేమరసమ్ము కనినంతఁ దీపి." ఈప్రేమ పుష్పముకంటెను మృదులాతిమృదులము. ఆ మృదుత్వమును గ్రహించి దానిని సుకుమారముగ సంరక్షించువారు చాల కొద్దిమంది. ఈ విషయమును వళ్లువరు

"సదమలప్రేమపుష్పముకంటె మృదుల
మది గ్రహించి భరించుమదితాత్మ లరిది[1]"

అని పేర్కొనుచున్నాడు.

తమిళవేద మగు నీ గ్రంథమును పఠించిన పిమ్మట పఠితకు నీ విషయాదికము ప్రధానముగ స్ఫురించును. పాలకులు పాలితులు--ఎల్లరు ధార్మికులై సంచరింపవలయును. శాశ్వతసౌఖ్యమును ప్రసాదించు ధర్మమార్గము నవలంబించుటయే మహదాశయమై యుండవలయును. కామక్రోధమోహములు మానవుని కష్టపరంపరకు కారణభూతములు. ఇవి విసర్జితములైననాడే మానవుడు కష్టజలధినుండి గట్టెక్కగలడు. "కామం, వెగుళి, మయక్కం, ఇవైమూన్ఱన్, నామంకెడక్కెడుం నోయ్" (కామక్రోధమోహములు మూడును వివర్జితములయిననాడే మానవుడు సుఖపడును) అని తివళ్లువ రనుచున్నాడు.

స్వతంత్రరచనముగా వ్యవహృత మగుచున్న యీ తిరుక్కుఱళుపై సంస్కృతవాఙ్మయ ప్రభావము కొంతవఱకు స్పష్టముగా గోచరించుచుండుట గమనింపదగినవిషయము[2]. మనుస్మృతి, అర్థశాస్త్రము, హితోపదేశ పంచతంత్రములు, కామందకుని నీతిశాస్త్రము, రామాయణ మహాభారతములు, భర్తృహరి మున్నగునవి తిరువళ్లువరునకు సుపరిచితములుగ నుండి యుండు ననియు విజ్ఞులు భావించుచున్నారు. కుఱల్ గీతికా రచనావిధానము సంస్కృతమునందలి సూత్రరచనావిధానమును తలపించుచుండుట పై విషయమునకు ప్రబల సాక్ష్యము. ఇట్లనుటవలన కుఱళు కేవలము స్వతంత్రరచనము గా దని యభిప్రాయపడ గూడదు. ఇంతకు తమిళవేదము మంజుల కావ్యము; నీత్యుద్బోధకగ్రంథము. ఇది యని యన నేల? తిరుక్కుఱళ్ లోక విజ్ఞాన సర్వస్వము!

తిరువళ్లువరునకు పిమ్మట మహాకవయిత్రి యను 'అవ్వై'యను పేర్కొనవలయును. ఈమె ఆత్తిచ్చూడి, కొన్ఱైవేందన్ అనునీతి గ్రంథములను సంతరించెను. వీనియందలి వాక్యములు నేటికిని తమిళుల జిహ్వాగ్రముల నిలిచి యుండుట చెప్పదగినవిశేషము. అఱంశెయ విరుమ్బు (ధర్మము చేయనభిలషింపుము) ఐయమిట్టుణ్ (ఒకరికి పెట్టి ఆవల తినుము) శని నీరాడు (శనివారము నాడు అభ్యంగన మాడుము) నన్ఱిమఱవేల్ (చేసిన మేలును మఱువవలదు), అన్నైయుం, పితావుం మున్నఱి దెయ్‌వం (మాతాపితరులు ప్రత్యక్షదైవతములు)-ఇట్టి వాక్యములు అవ్వై రచనములందు కొల్లలుగా గలవు.

ఇంకను సంగయుగపు వాఙ్మయములో పేర్కొనదగిన యమూల్యగ్రంథములు చాల గలవు. వానిలో అగనానూరు, పురనానూరు ముఖ్యములు. అలనాటి తమిళుల రాజకీయ సాంఘికచరిత్రలను ప్రతిబింబించుదర్పణములుగా నీ గ్రంథములు ప్రసిద్ధి కెక్కినవి. కనుక వీనినిగురించి మఱియొక వ్యాసములో విపులముగ వివరింతును.

---

1. శ్రీ చల్లా లక్ష్మీనారాయణ శాస్త్రిగారు కావించిన యీ యథానువాదములను 'తమిళవేదము'న చూడఁగును.

2. ఈ వాదమును తొలుత లేవదీసినవారు కీ. శే. శ్రీ. వి. ఆర్. రామచంద్రదీక్షితరుగారు.

# స్వాతితిరునాళ్ సంస్కృతకృతులు

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు

---

సంస్కృతసాహిత్యమునందు - 'కాశ్మీర'మున కెంత విశిష్టమైనస్థానము గలదో-'కేరళ'మున కున్నమరియాదయు నట్టిదే. వారు సాహితీనిర్మాణమున నేమి, జీవితవిధానమున నేమి, యొక యనితరసంపాద్యమైన స్థితి నందికొన్నారు. రచనావిధానమును జూచి, యేశ్లోకమైనను, 'ఇది కేరళకవి' దని యనుభవము గలవాఁడు చెప్పవచ్చును. వారు వాడు 'టెంకాయనూనె' యెంత స్నిగ్ధములో-ఆ రచనయు నంత స్నిగ్ధతమము. భవభూతి 'యాంధ్రుఁ'డని -చారిత్రకుఁడు చెప్ప బనిలేదు. వాని కవితయే పల్కును. అట్లే-యొక కేరళకవిని-యితఁడు 'చేరుఁ' డని యెవ్వఁడు నిరూపింప నవసరము లేదు. వాని రచనయే చెప్పును.

ప్రాచీనకాలమునుండియు మన కవులకుఁ గేరళముపై నొక మమత. నేఁడు-దురావేశములతో, అనవసరభాషాద్వేషములతో మనము 'వేఱువే' రనుకొనుచున్నాము గాని, రసికులైన ప్రాచీను లీవింగడింపు నెఱుఁగరు. 'కుంతలసౌభాగ్యము'ను దడువవలసినపు డంతయుఁ గేరళమును స్మరింపని-కవి లేనే లేడు. యాయావరమహాకవి - రాజశేఖరుఁడు 'చేరము' నిట్లు చిత్రించినాఁడు.

"ఆమూలతో వలితకుంతలచారుచూడ
శ్చూర్ణాలకప్రచయలాంఛితఫాలభాగః
కక్షానివేశనిబిడీకృతనీవి రేష,
వేషశ్చిరం జయతి కేరళకామినీనాం."

ఇంతే గాదు-అతఁడు మరియొకవిషయమును జాల నాజూకుగాఁ జెప్పినాఁడు. 'సాహిత్యవిద్యావధువు' కావ్యపురుషుని లోబరచికొనుటకై యనేకోపాయముల బన్నినట! అతఁడు వలలో బడలేదు. వానితోఁ గూడ నెన్నిదేశములోఁ జుట్టినది. కడకు చేర దేశమున కలయించికొని వచ్చిన దట! ఈ గాలి సోకినంతనే, కావ్యపురుషుఁడు వెన్నవలెఁ గరగినాఁడు. ఆ కాంత యొడిలో - పద్మమున రాజహంసమువలెఁ బండినాఁడు. అది 'కేరళ' మనగా—

అక్కడి ప్రకృతియుఁ జాల సుందరమై, యుద్వేగకర మైనది. ఎక్కడ జూచినను, 'తలలు విరిసికొని' నిలచిన టెంకాయచెట్లు-తన్వంగీతను సదృశక్రముకములు, సౌందర్యమూరఁ బరచికొన్నమామిడులు - అడుఁ గనపడక పండిన పనసలు-ఈ సౌభాగ్యము నొక తమిళమహాకవి యిట్లు పొగడినాఁడు.

"కాయ్మాన్ట త్తెంగిన్
పఴంవీఴక్క ముకిన్ నెట్రి
ప్పూమాన్ట తీన్తేన్ తొడైకీఱి,
వరుక్కై పోఴ్న్తు
తీమాఙ్కళిసితఱి, వాఴైప్ప
ఴంగళ్ సిందుం
ఏమాంగదమెన్ను, ఇసైయాల్,
. తిసైపోయతుండే."

(తిరుత్తక్క తేవర్)

చెట్లనుండి టెంకాయలు రాలునట! అవి క్రముకములలోని తేనెతుట్టెలను గదలించిఁ మామిడిచెట్లపైఁ బడును. మామిడులు రాలుచు, పనసవృక్షములపైఁ బడి-వానిని జలజలరాల్చును. ఇది కేరళసౌభాగ్యము. ఈ ప్రకృతి యుత్తమసాహితీకారులను-జీవితమున రసికులను సృష్టించుటలో నాశ్చర్య మేమున్నది!

సాహిత్యమునందే గాక, శాస్త్రసంగ్రథనమునందును-'చేర'ము బ్రహ్మాండముగఁ బని చేసినది. 'శాస్త్రాభిమానము' ఆజనులలో నేటికిని పోలేదు. దానిని గన్న నెంతో సంతోష మగును.

'కేరళ' రాజవంశము - సాహితీనిర్మాణక్షమముగా చాల ప్రసిద్ధమైనది. వారు వ్రాసిన చిన్న పెద్ద కావ్యములకు లెక్క లేదు. 'మళయాళ'మునను వారు మహాకావ్యములు మొదలుకొని-ఖండకావ్యములవరకును వ్రాసినారు. వారి సాహిత్యమున మధ్యయుగమునకుఁ జెందిన 'ఉన్నీవల' సందేశము-ఒక రాజకుమారుఁడు వ్రాసినదే! ఆ కావ్యమా భాష కొక తొడవు. దాని రచన మంతయుఁ 'మణిప్రవాళ' శైలి. ఆ శయ్య 'మళయాళమున' కొక ప్రత్యేకము. కొంత యలవాటు పడినచో సుందరము గూడ.

'కులశేఖరాళ్వారు' 'ముకుందమాల'ను రచించినకవి. వారి పాశురములు 'హృదయద్రావకము' లై యుండును. 'ముకుందమాల' భక్తులకు

శిరోధార్య మైనది. ఆ ప్రాసాదికకవిత్వము తపస్సాధ్యము. వైష్ణవాళ్వారులలోఁ గులశేఖరు లొకరు. ఆకార్యశూరుఁడు కేవలము రచనమే గాక నాడు వైదిక మతోద్ధారమున కై యెంతయో శ్రమపడినవాఁడు. తల్లివచ్చు జైన బౌద్ధములను-దక్షిణమున నాపినవాఁ డీ మహనీయుఁడే! 'కులశేఖరప్పడి' యొకటి 'తిరుపతి' 'తిరువేంగడన్' సన్నిధానమున గలదు. అనేకులు-కులశేఖరుల నా 'దేవాశ్వవతారము'గా భావింతురు. ఆ మహనీయుఁ డీ రాజవంశపు వాఁడే!

టిప్పూకాలముననే యున్న 'బాలరామవర్మ' సాహిత్యసంగీతభరతములం దందె వేసినజాణ. వారు వ్రాసినగ్రంథము 'బాలరామభరతము.' పరిమాణమున చాల పెద్దది. 'భరత'మున నింత పెద్దగ్రంథము మఱియొకటి లేదు. వారు అనేక మంది శిష్యులను దయారుజేసి-తమ కొలువులో వాడించెడువారట! ఇట్టివారే 'స్వాతి తిరుణాళ్'మహారాజుగూడ. వీరు 'గర్భశ్రీమంతులు.' వీరు తమ తల్లికడుపున నున్నపుడే-రాజ్యమునకు వారసులెవ్వరును లేకుండుటచే-రాజ్యాధికారము సంక్రమించిన దన్నమాట. వీరి తల్లి లక్ష్మీరాణి గారు. కొడు కెదిగి వచ్చువరకును-రాజ్యవ్యవహారము లామెయే-చక్కఁబెట్టుచుండెను.

'స్వాతితిరుణాళ్' రాజ్యమునకు వచ్చినది-చాల పసితనమునందు. వారి కప్పటి వయసున పదునాలేండ్లు మాత్రమే. అంత చిన్నవయస్సుననే యాయన-యెంతయో జ్ఞానవృద్ధులు చేయఁదగినసంస్కారణములను జేసినాఁడు. 'మునిసిఫ్ కోర్టులను' ఆంగ్లపాఠశాలలను - కేరళమున దొలుత స్థాపించిన దీయనయే నట! కేరళుల జీవితమును-నేటి వాతావరణమునకుఁ దగినట్లుగా నితఁడు మార్చెను. 'స్వాతితిరుణాళ్' సాహితీపరుఁడే గాదు-సంఘసంస్కర్తయు—

వారు జీవించినది చాల యల్పకాలము మాత్రమే. ముప్పదినాలుగేండ్లకు - మృత్యువాసన్న మైనది. అంత చిన్నజీవితములో—ఆ మహారా జెంత పని చేసెను!

వారికి సంస్కృతాంగ్లములు బాగ వచ్చెడివి. సంస్కృత మీవంశమున కింటిభాష వంటిది. మళయాళమున నాతఁడు గవి. మహారాష్ట్రము బాగుగ వచ్చెడిదట! కన్నడమును వారు దఱచి చూచిరి. తమిళ మెంత బాగుగ వచ్చిన, మళయాళ మంత చక్కఁగ వచ్చును. ఇకఁ దెనుఁగున వారు వ్రాసినకృతులే యున్నవి. హిందూస్తానియు వారికి బాగుగ వచ్చెడిదట!

ఆ మహారాజుల యాస్థానము-అఖిలవిద్యల కాలవాలము. 'కిలిమామార్ విద్వాన్, కోయిలతంబురాన్' 'ఇరవి వర్మన్‌తంబి' మొదలైన-ప్రముఖకవులను-వారి త్యాగము పోషించినది. పై యిర్వురును మళయాళమున 'అర్థకథల'ను వ్రాసినవారు. అవి యా భాషలో నేడు ప్రసిద్ధములు. 'ఇరవివర్మ' గాయకుఁడును. కొన్ని కృతులను గూడ నాయన వ్రాసినాఁడు.

వీరి కొలువున ప్రసిద్ధులైనగాయకు లుండిరి. కోకిలకాంత, అనంత పద్మనాభ గోస్వామి యొకరు. కన్నయ్య భాగవతారు మరియొకరు. వీరు నాదబ్రహ్మ మైనత్యాగరాజులకు నేరుగా సేవ జేసినయదృష్టశాలి. చోళపురం రఘునాథ రావు పెద్దవైణికుఁడు. తంజావూరు చింతామణి 'సారంగీ' వాద్యమున-చతురుఁడు. వడివేలు గాయకుఁడుగా - వాయులీనవాదకుఁడుగా-నడిగన్నవాఁడు. ఇక 'రంగస్వామయ్యంగారు, సులేమాన్ సాహెబు' మొదలైనవారు 'హిందూస్తానీ' సంగీతములందుఁ గోవిదులు. మహారాజులుంగారు-స్వయముగ వైణికులు.

నిరంతర మైనయాసంగీతగోష్ఠులతో పక్వమైన యా జీవిత మెన్నియో కృతులను రచించినది. వాగ్గేయకారులలో, మహారాజుల స్థాన మెంతటి దనఁగా సంగీతత్రిమూర్తుల తర్వాత మనకు జ్ఞాపకమునకు వచ్చునది వీరి పేరే. 'కీర్తనములు' 'కృతులు' సంస్కృతాంధ్రములలోను, కర్ణాటభాషయందును గలవు. 'మళయాళ'మున లెక్కలేనన్ని యున్నవి. వారి రచనలు 'వర్ణములు' గలవు. 'పదము' లున్నవి. 'పదవర్ణము'లు గలవు. 'పదములు' నూటికి నూఱుపాళ్లు తెన్గువారివి. అతివిలంబకాలమున-ఆంధ్రులకుఁ బ్రాణ మైన 'త్రిపుట' 'చాపు' మొదలైనతాళములలో నవి నడచును. కాని లాభ మేమి! ఈ నడుమ తెన్గుదేశమం 'దాదర్శవాదము' తెగ బెరిగి - 'పదము'లను వినుట-పాడుట 'పరమాసహ్య' మైనది. అసలు సంగీతమునకే 'కూడు' తెన్గుదేశమున గఱవగుచున్నది. అది యట్లుండె.

'రసికు' లైన'స్వాతితిరుణాళ్' మహారాజు-'తిల్లానా'లు 'ప్రబంధము'లను గూ వ్రాసిద

వారు. 'హిందూస్థానీ' పద్ధతిలోగూడ, వారు వ్రాసిన 'ధ్రుపద' 'టప్పా' 'ఖయాల్' మొదలైనరచనములున్నవి.

'పాటల'ను వ్రాయుట యనగా, గ్రుడ్డెద్దు చేనిలోఁ బడినట్లు, తోఁచినపద మంతయు వాడి లయను కుదిరించి 'యిక బొమ్మ'నుట గాదు. అది సినిమాపాటల కథ! పద్యములకు ఛందస్సు వలె, గేయములకు నొక 'లక్షణ' మున్నది. అంత్యాదిప్రాసనియమ మున్నది. ఒక దృష్టిలోఁ జూచినపుడు-'పద్యమున' కంటెను, 'పదము'ను వ్రాయుట కష్టతరము. ఆ కష్టము-చక్కగా వ్రాసెడువానికే తెలియును. 'కీర్తనము'నకును 'కృతికి'ని భేదము గలదు. 'కీర్తనయం దను పల్లవి' యుండవలె ననునియమము లేదు.'కృతికి' ఉండి తీరవలెను. 'పల్లవి' చరణములకేకవాక్యత గూర్చునదియై, సుందరమై యుండవలెను. వాగ్గేయకారులైనమహారాజుగారు పై విషయములఁ దాము గీర్వాణమున రచించిన 'కృతిలక్షణ' మనెడుగ్రంథమునందు-విపులముగఁ జర్చించియున్నారు.

'సంస్కృతము' తర్వాత 'పదరచన'లో మహారాజు లాదరించినది-ముఖ్యముగ తెన్గునే. ఆంధ్రము స్వాభావికముగ 'సంగీతపుభాష! 'మధుర'ను తెన్గు లేలినపుడుఁ తంజావూరున తెన్గు విరిసినపుడు-'కేరళ'మునను తెన్గు తొంగి చూచినది. 'రామనాథ' పురము 'శుచీంద్రము' మొదలైనప్రదేశములం దున్న 'తెన్గు' శాసనములను చూచినపుడు-నాకు 'ప్రాణము లేచి'వచ్చును. 'తిరువాన్కూరు' 'ప్రాచ్యలిఖిత' పుస్తక భాండాగారమున నెన్నియో 'యాంధ్ర గ్రంథము' లున్నవి. వానిని దుమ్ము దులుపు మహనీయుఁ డేడీ! 'మన' 'యూనివర్శిటీ' కీ కథ కాఁబట్టదు. కాబట్టినను-వారి కంటికి కనుపించునది-యేడిగ్రీలనో వలచినమహనీయుఁడు. వానికి వా రనుకున్నంత తెలివుండదు. చేయవలసినంత చేయఁడు. మరి-మన 'మంత్రులు' మొదలైనయధికారులు స్వార్థపరులు, సాహితీ విమూఢులు. వీట్లను లెక్కించికొనుటలో నున్నంత మెలకువ 'తిక్కన భారతము'ను ఒకసారి చదువుటలో లేదు. ఇక నేపనియైనను-చేయించెడు - చేసెడునాథుఁ డేడీ! మన రసికతకు-నేటికిని యూనివర్సిటీలలో స్థానము లేక బాధపడుచుండెడుమల్లంపల్లి సోమశేఖరశర్మగారొక సాక్ష్యము.

'కేరళ' ప్రభువుల యింటిదేవుడు-అనంత పద్మనాభుఁడు. వారి రచన లన్నియు-నించుమించు-స్వామిని వర్ణించునవే. కొన్ని దేవీ పరమైనవియుఁ గలవు.

'స్వాతితిరునాళ్' సంస్కృతరచనలలో ముఖ్యమైనవి-మూఁడు. మొదటిది 'భక్తిమంజరి'. రెండవది 'పద్మనాభ శతకము! మూడవది స్యానందూరు పురవర్ణనము. 'తిరువాన్కూరు' నకే-గీర్వాణమున 'స్యానందూరు పుర'మని పేరు. ఈ కావ్య మాయూరియొక్క 'స్థల పురాణము'నకు సంబంధించినది. ఇంతే గాక వారు కొన్ని 'హరికథ'లను గూడ వ్రాసినారు. అవి 'కుచేలోపాఖ్యానము' 'అజామిళ చరిత్రము' మొదలైనవి. 'ఉత్సవప్రబంధ మొకటి వారి రచన గలదు. దీని భాష మళయాళము! సంగీతప్రధాన మైనకావ్యము. పద్మనాభుల యొక్క యుత్సవవిశేషముల నిది వర్ణించును.

భగవత్సంబంధ మైనయొక యావేశము-ప్రధానమై నడచుకవిత్వమును 'మహారాష్ట్రులు' 'ప్రాసాదిక' కవిత్వ మందురు. ఈ రచన యావాఙ్మయమున కొల్ల. ఈ దృష్టిలో-నా భాష చాల యదృష్టవంతము.

'ప్రాసాదిక' కవిత్వమునందును - రచయిత యెంత శరీరమును మఱచినను-వాని 'వ్యుత్పత్తి' విశేషము-సంస్కారములు - రాగద్వేషాదులు వానికిఁ దెలియకయే-రచనలోఁ జోటు జేసికొని యుండును. కనుక లౌకికకవిత్వమునువలెనే దీనిని గూడ-యనేకధా వింగడింపవచ్చును. అది శంకరుల 'సౌందర్యలహరి' మున్నగువానిలో-వ్యుత్పత్తి'నే మున్నా'నని-ముందు దూకును. వారి యీ ప్రదర్శనము - కొంత ప్రౌఢమై-కొంత కర్కశ మైనది. ఈ త్రోవలో నింకను ముదురుపాకము - వేదాంతదేశికుల రచన. 'మూకపంచాశతి' యందును-'వ్యుత్పత్తి' వాసన గలదు. అది యొకరీతిగా లలిత మైనది. జయదేవుని రచనలు-లలితములే యైనను, శబ్దసృష్టి యిది చాపల్యమా! యను మేరవర కెదిగినది. 'లీలాశుకుఁడు' కేవలలాలిత్యమూర్తి. అతని కృష్ణుఁడు పూవులపైననే నడచెను. స్త్రీల బాహూపధానకార్కశ్యమును గూడ సహింపని మూర్తిగా 'లీలాశుకుఁడు' కృష్ణుని సృష్టించెను. ఇంత లాలిత్య మైనను ప్రపంచమున

గర్వమే. కులశేఖరుల 'ముకుందమాల' యొక్క ధారాళమై-యుదారమైనశయ్య. వారిలో 'పిల్లాటలు'-చిలిపిచేతలు గనపడవు. ఆ మార్గమునకుఁ జెందినదే-'స్వాతితిరునాళ్' మహారాజుల రచన.

'భక్తిమంజరి' యొక్క వేయిశ్లోకముల గ్రంథము. ఈ కావ్యము 'నవవిధభక్తు'లను నిరూపించును. ఈ విషయమును - మహారాజులే 'సంకుచితముగ' నిట్లు వర్ణించి, తమ కావ్యమునకుఁ భూమిక వేసికొన్నారు.

"శ్రుతి ర్వరద! కీర్తనం,
స్మరణ మంఘ్రిసంసేవనం
రమావర! తథార్చనం
త్వయిచ వందనం దాసతా
త్వయైవ సహసఖ్య మచ్యుత!
నివేదనం చాత్మన
స్త్వయీతి నవధాస్మృతా
భవతి భక్తి రత్యుత్తమా."

ఈ భక్తిమార్గములలో మొదటి యెనిమిదింటిని 'పంచమాది నవమాంత' శతకములందును, తక్కినదానిని 'దశమము' నందును 'గ్రంథకర్త' విస్తరముగా నిరూపించెను. కర్మజ్ఞాన మార్గములు-'సాధారణులకు' బనికి రావనియు, భక్తియే శ్రేయస్కరమనియు నిరూపించుట యీ గ్రంథరచనలో నుద్దేశము. 'భక్తి' పరిపాకమే 'జ్ఞాన'మని వీరన్నమాట-చాల 'పండిన పలుకు[1].' పరమేశ్వరునియందలి భక్తి 'యిహసౌఖ్యము'లను గూడ- బ్రసాదింపవలె ననియు-బ్రసాదించుననియు-వీరి యూహయైనట్లున్నది[2].

ఈ గ్రంథమునందు భాగవతవాసన యెక్కువ. ఒక వేయిశ్లోకములలో-భాగవత కథ నంతయు నిమిడ్చి 'నారాయణీయ'మనెడు గ్రంథమును, 'నారాయణభట్టతిరి' వ్రాసెను. కేరళమున నిది చాల ప్రసిద్ధము. అనేకు లీ గ్రంథము నిచటఁ బారాయణము సేయుదురు! అతఁడు - 'ప్రక్రియాకౌముది'నివ్రాసి-'భట్టోజీ' మెప్పు గూడఁ బొందెనట!

తక్కినశాస్త్రములందును-ఆయన బ్రహ్మాండ వ్యక్తి. ఆధ్యాత్మికానుభవములు - గాంచిన సిద్ధుడు. 'నారాయణీయ' గ్రంథవాసన గూడ 'స్వాతితిరునాల్' మహారాజులలో కొంచెము దండియే.

ఈ మహారాజు-చాల వినయపరుఁడు. ఆ గుణము లేనిది 'ప్రాసాదిక' కవిత్వమే లేదు. అందువలన-నిష్కభక్తి కది మూలకంద మయ్యెను. 'భక్తిమంజరి' కావ్యాంతమున నీరీతిగా హృదయమును వెల్వరించి యావైష్ణవుడు-మానసీయుడైనాఁడు.

"ప్రస్ఫురసంగమవశాద్ధిమాత్రమ
ప్యుద్యతే శిరసి మానవై ర్యథా
విగ్రహై ర్భవవశా త్సతాం ముదే
స్యా త్తథేయ మపి భక్తిమంజరీ."

దాక్షిణాత్యకవులలో 'ఘనశ్యామ' నియంత జంభపు కత్వమును జెప్పినవాఁడు మఱి లేడు. పండితరాయ లీ విషయమున 'ఘనశ్యాము'న కోడినాఁడు.

వీరి రెండవగ్రంథము 'పద్మనాభశతక' మంటిమి. దీనియం దున్నది-పదిదశములు-వివిధ వృత్తములు. ఈ శైలి భక్తిమంజరికంటెను లలితమైనది. నా దృష్టిలో నిది చక్కని మనఃపరిపాకమైనమీదట వ్రాసినగ్రంథము. ఈనాటి కా 'కవిక' భాషాదృష్టి - బొత్తిగా పోయినది. చమత్కారములైనయర్థములను, వెల్లడింపవలె ననుదాహము తగ్గినది. కేవలము-హృదయము నే ముందుంచి- పద్మనాభునితోఁ బలుకుచున్నాడు.

తృతీయదశకమునందు-పద్మనాభుని పాదాదికేశాంతవర్ణనము - గావింపఁబడినది. కొంత బాగుగనే యున్నది.

'స్వాతీతిరునాల్' విష్ణుచిత్తుఁడు కాడు. కులశేఖరులు గాదు. త్యాగయ్య గాదు. లీలాశుకుడు గాదు.

అతఁడు మనవంటి పుణ్యపాపసమ్మిశ్రితుఁడు. అన్యవిషయములు వదలి-భగవంతుని గీర్తించుట-అతనినుండియే 'దేహాత్మసౌఖ్యము'లను బొంద యత్నించుట-ఆ సంస్కారములోని విశేషము. సకామభక్తి యైనను-భగవన్నిక్షిప్తము పవిత్రమే గదా!

చిన్నటివాడు అంత చిన్నివయస్సులో-గొప్పపని చేసినాఁడు. ఆయన జీవితము, రచన, మన మనోహృదయములను సంస్కరించికొనుటకు-కొంతవఱకు పనికివచ్చును.

---

1. 'తయా పున ర్జ్ఞాన ముదేతి తేన, ప్రాప్నోతి ముక్తిం చ చతుష్ప్రకారాం'
2. భోక్తుం చ కామాన్ భువనే వ్యభీష్టాన్, యా హేతుభూతా తవ పాదభక్తిః'

# అగుమంచికథ

(ప్రాచీనజానపదకావ్యము)

- శ్రీ వేటూరి ఆనందమూర్తి పరిష్కృతము

---

## కాటమరాజుప్రశస్తి

బ్రహ్మదయు వగు నీకు బడుగులరాజ !
ధర్మపట్టణ మేలు ధాత్రి వర్ధిల్లు !
మారాజవిభుడు సన్మార్గవర్తనుడు
బంధుసుతుండు భూపాలతిలకుండు
భావజాకారుండు భాగ్యవంతుండు
సరసుడు సుజనుడు సత్యవాక్యుండు
కరుణాంతరంగుండు ఘనధర్మవరుడు
కుజనగర్వహరుండు గురుభక్తియుతుడు
దానరాధేయుండు ధర్మవర్తనుడు
సత్కళాచంద్రుండు సాహసాంకుండు
గానలోలుడు రిపుగర్వహరుండు
మానవేశ్వరు డరిమదభంజనుండు
నిత్యకళ్యాణుండు నీతివర్తనుడు
సత్యచారిత్రుండు సమరవిజయుండు
బహుళప్రతాపుండు బంధుహితుండు
పరమవివేకి బ్రాహ్మణభక్తిపరుడు
బ్రహ్మాయు వగు నీకు బహుకుటుంబాధార !
రమణీయరూపకరాజచంద్ర !
జయమస్తురా నీకు సమరనిశ్శంక !
అసహాయశూర ! సాహసవిక్రమార్క !
జయము సద్గుణశాలి జయము సర్వజ్ఞ
జయ మగు పెద్దయ్యజనపాలతనయ
విజయీభవ ! కాటమరాజ! దిగ్విజయీభవ !

* * *

## కథాప్రారంభము

"మంచేది శివరాత్రిమాసంబు తనకు
ఏదిన మాయెనో యేర్పాటుగాను
శోధించి చూడరో సాంపుతో మీరు!"
అని వేడగా వాడు అగుమంచిమాట
తెలిసి పురోహితుల్ తిలకించి చూచి
చెప్పగా సాగిరి చెలగి మూర్తంబు.
"వినవమ్మ చెప్పేము వెలది యగుమంచి
సోమవారము నేడు సాంపుతో వినుము
వారము మాసము వరుసతో వినుము
ఆహూధిగా మీకు యాదవుల కెల్ల
శివరాత్రి సేయను శ్రీకరం బగును
అన్నల కందఱ కతిమోద మగును."
రవితేజు చెల్లెలు రమణి యగుమంచి
పన్నుగా బ్రాహ్మలపలుకులు వినెను
చెప్పెను శివరాత్రివ్రతము సేయంగ
"బందుగు లందఱు మంద నున్నారు
మందలోపలనుండి మరి వార్త నాకు
వివరంబుగా నేది వినగ రాదయ్యె
గడియలు వివరాలు ఘనముగా తెలిసి
మూర్త మేదయ్యెనో ముదముతో నాకు
సెలుక చెప్పరటయ్య యేర్పాటుగాను.'
అన విని బ్రాహ్మణు లతివ కిట్లనిరి.
"నేమముతో నీవు నిర్మలాకృతిని
గడకతో శంభులింగమును బూజించి
పాలించి బోనాలు భక్తుల కెల్ల
తాలిమితో నిడి తనరంగ నీవు
సురుచిరంబుగ భూమిసురులకు నెల్ల
దయతోడ నగుమంచి దానమ్ము లిమ్ము.
వలనొప్ప మంగళవారాన నీకు
బలము చాలదు గాన పతి యగుమంచి
గరిమ నిరువదైదు గడియల మీద
మంచి ముహూర్తాన మగువ యగుమంచి
పుణ్యాంగనల గూడి పూజింపు మీవు."
అని విన్నవింపంగ నగ్రజన్ములకు
ఘనవేగముగ నమస్కారంబు చేసి
భూనాథుచెల్లెలు భూసురోత్తముల
ననిపెను వేగంబె, యక్కన్న యంత
వారిని వీరిని వరుసతో బిలిచి
బంగారుపూతల పచ్చడాల్ గప్పి
యంగన పేర్వేర నందఱిఁ బిలిచి,
"మామలారా! జంగమార్చనల్ సేయ
వేవేగ పనులను గావింపవలెను
శ్రీమించు దొనకొండ చెరువుప్రక్కలను
తూర్పున గజనిమ్మతోటలోపలను
ప్రాకటంబుగ చల్వపందిళ్లు బెట్టి
మఠపతులకు నెల్ల మరుగులు గట్టి
యిటువలె సేయించు దీపను లెల్ల.
సన్నబియ్యము పప్పు చక్కెర తేనె
పన్నుగా బెల్లము పరమాన్నములను

గోధుమ శనగలు కొబ్బెర చెరకు
మంచియోగిరములు మధురఫలములు
తీరైనపోకలు తెల్లనాకులును
పాలును పెరుగును పచ్చడల్లమును
కలసిన వన్నియు వరుస దెప్పించి
చాలినట్టుగ వంటసరకు దెప్పించి
క్రొత్తకుండల దెచ్చి కొదువ లేకుండ
మల్లెలు విరజాజి మంచిచామంతి
మొల్లపువ్వులు మంచి మొగలిరేకులును
జవ్వాజి కస్తూరి జాళువాపసిడి
లింగవస్త్రములును లీలతో పత్రి
శ్రీగంధ మాదిగా చెలగుధూపములు
వరుసతో నిటువంటి వస్తువు లెల్ల
గడియలో నీవేళ గరిమ దెం''డనిన
అగుమంచి మాటల కంద లొప్పంగ
అక్కన్న వారల ననిపె వేగంబె
ఆవేళ నత్తకు హస్తంబు లెత్తి
చయ్యన నావీరజంగాల బిలిచి
''దానము లందను దగ పాత్రులైన
బ్రాహ్మణోత్తములను రప్పింపవలెను.''
అని చెప్ప నామాట లాజ్ఞగా గొనుచు
పంపినపనివారు పయనమై పోయి
సొంపుగా నందఱ సారిది రప్పించి
పందుముల యరణప్ప పాయక వెనుక
నందముగా వచ్చి రతివ లందరును
కదలిరి హనుమంతుగమిని జొచ్చుటకు
శరణార్థులై తాము శరణు సేయుచును
పొందుగా శంఖాల బూరించువారు
కంకణాల్ గంటలు ఘణఘణా యనుచు
నాదించి శివునిపై నమ్మినవారు
పాదుక బంగారుపావాలు తొడిగి
యురమున లింగాల నుంచినవారు
మఠపతులును మునుల్ మరి దొడ్డవారు
కూడిరి జంగాలు కొదువ లేకుండ
వేడుకతో చతుర్వేదముల్ చదువ
బ్రాహ్మణుల్ వరుసతో వచ్చి మ్రొక్కంగ
నతివేగ దీవించి రగుమంచి నపుడు.
అయలకు బ్రాహ్మల కతివ లందరకు
మాడలు రూకలు మరి వాయనములు
భూరిదానము లిచ్చె భూనాథుచెల్లి
ధారుణి షోడశదానంబు లొసగి
యక్కన్న వారల ననిపె వేగంబె.
అప్పుడు దీవించి యరిగి రందరును,

అప్పుడు జంగము లాశివరాత్రి
సంతోషముగ జేసి సముఖాన నిలువ
ప్రేమతో గూర్చుండి ప్రియము దీపింప
లింగవస్త్రము లిచ్చె జంగాల కెల్ల
నర్ఘ్యపాద్యము లిచ్చె నానందముగను
సరవితో నిచ్చిన సమయంబునందు
తిరముగా పశ్చిమదిక్కున నంత
గురుతుగా సూర్యుండు గ్రుంగె నాక్షణమె.
పరగ జముఖాళముల్ పరిపించి వేగ
నయగాండ్ల గూర్చుండు డని యానతిచ్చి
యయగాండ్ల ముందఱ నరటాకు లిడిరి.
పప్పును నేయును పాయసాన్నమును
పాయక తేనెయు పంచదారయును
మేలైన చలిమిళ్లు మించి వడ్డింప
చయ్యన భుజియింప సాగి రందరును
సారపప్పును మేలు సరి గసగసలు
చెరకులు మొదలైన సరకుల నెల్ల
నారగింపంగ వా రర్థించి రంత
నయ్యాలు కడుపార నారగింపంగ
నయ్యాన జలములు వడ్డించి రంత
కర్పూరగబాగాలు గరిమ నాకులను
సంతుష్టిగా నిచ్చె జంగాల కెల్ల
నందరి నటు బిల్చి యగుమంచి పలికె
శివరాత్రి స్వాములు సేయంగవలెను
వేవేగ మీరలు వేంచేయు రయ్య
హరహరా యని కదలి రయ్యగాం డ్లంత
హరిణాక్షి యక్కన్న యతివలు తాను
పక్కపొద్దులతోను వచ్చి రందరును
కంపింప యాదవకొంత లందరును
సొంపుతో నందఱు సారిది శంభుకడ
పందుముల యరణప్ప పాయక వెనుక
నందముగా వచ్చి రతివ లందరును
పదివేల దివిటీలు బాణవిద్యలతో
కదలిరి హనుమంతుగమిని చెంతకును
కూరిమి దేవునిగుడియొద్ద నిలచి
ద్వారము చేరిరి తరుణు లందరును
కామినీమణు లంత కళకంతు జూచి
సాష్టాంగదండంబు స్వామికర్పింపె
వార్త కెక్కినయట్టివసుధేశుచెల్లి
ప్రార్థన జేసెను భక్తవత్సలుని.

ప్రాకృతములు వ్యవహారరంగమునుండి యస్తమించెను. మఱి యిక సంస్కృత నాటకకర్తల కేమి గతి? వారు తొలుత గద్యములను సంస్కృతమున వ్రాసి వ్యాకరణ సహాయమున వానిని ప్రాకృతీకరింతురు. అప్పుడది- ప్రాకృతమో, సంస్కృతమో - వారికే తెలియదు. అందుకే చాలమట్టుకు గీర్వాణనాటకములలోని ప్రాకృతము మన కాభాషపై విరక్తిని గలిగించుటకే పనికి వచ్చును గాని- రక్తిఁ బుట్టించుటకు గాదు. ఈ ప్రాకృత మన్న నింతే' యని యపోహపడి - అప్పుడప్పుడు - సభలలో వానిని వెక్కిరించుటయు జరుగుచుండును. వారి దురదృష్టమునకు నేడ్వవలెనో, నవ్వవలెనో - నా కర్థము గాదు. 'వేణీసంహారము' నందు గొంత 'పైశాచి' యగపడును. గుణాఢ్యుఁడు దీనియందే 'బృహత్కథ' వ్రాసినది. బౌద్ధులలో 'స్థవిరు' లను ఒక తెగవారు గలరు, వారీ వాఙ్మయమును విరివిగా నుపయోగించిరి. 'హమ్మీర మదమర్దన' (1219-1229) మను నాటకమందును 'పైశాచి' దండిగా వాడఁబడినది. దీని స్వరూపమును గమనించుటకు లక్షణకారు లొసఁగినశ్లోకములు దప్ప వేఱు దిక్కు లేదు.

సంస్కృత నాటకములందు ప్రాకృతములను ఆ భాషాస్వరూపమును చెఱుపక వాడినవారు నలుగురు మాత్రమే. వారు-అశ్వఘోష, భాస, కాళిదాస, శూద్రకులు. అశ్వఘోషుని వని కొన్ని 'నాటక విశకలిత' ఖండిక లున్నవి. వానియందు సంస్కృతమును, ప్రాకృతమును గలదు అశ్వఘోష మహాకవి చక్కని ప్రాకృతము వ్రాయుటలో నాశ్చర్యము లేదు. అతఁడు వారి మధ్య బ్రదికెను. తాను బౌద్ధుఁడై వారి నభ్యసించెను. ఇట్టివాఁడే రెండవవాడు మహాకవి కాళిదాసు. వీరిద్దఱును తమ మితిని చక్కఁగా గమనించి ప్రాకృతములలోని యవాంతర భేదములకు చేయి వేయక 'శౌరసేన, మహారాష్ట్రుల'తో మాత్రమే తృప్తిపడిరి. అసలు భరతుఁడే-పక్షాంతరముగ-నీ నిర్ణయమును చేసినాఁడు[1]. కాళిదాసుని విక్రమోర్వశీయములో విరహావిధురుఁడైనపురూరవుడు కొన్ని 'అపభ్రంశ' గేయములను తన్ను తాను మఱచి పాడును. ఆ పాటలను నడుమ నెవరో చేర్చిరని యొక వాదము. కాళిదాసుని నాటకము లన్నియు 'నటి' పాత్రముతో నారంభ మగును గదా! అందులో గేయమును ఉండును. కాళిదాసుని స్త్రీ పాత్రలు పాడునది సాధారణముగ 'మహారాష్ట్రి'. దాని మఱియొక భేదమే యైన 'మాగధి' దాని కంటిదేయైన "అర్ధమాగధి" వీనితో నెక్కువ భేదము లేని 'సౌరశేని'! వీనిలోని యల్పాల్ప భేదములను గనుగొనుట చాల కష్టము. ఎవడో లక్షణకారుఁ 'డిట్లు చెప్పె' నని-దాని 'నది' యనుకొనుటలో లాభము లేదు గదా! అసలు లక్షణకారులే వీని స్వరూప నిర్ణయమునం దొక కొలికికి రాలేదు. అర్ధమాగధీ విషయమున వారి యభిప్రాయములు గమనింపుడు:—

'మహారాష్ట్రీ మిశ్రా'
అర్ధమాగధీ (సంక్షిప్తసార)
'శౌరసేన్యా అదూరత్వా
దియ మే వార్ధమాగధీ.'
(ప్రాకృతసర్వస్వ)

మాగధ భాషాలక్షణం కించిత్కించిచ్చ
ప్రాకృత భాషాలక్షణం
యస్యామస్తి సా 'అర్ధమాగధీ'
'ఇతివ్యుత్పత్త్యా అర్ధమాగధీ'
(భగవతీ సూత్రవృత్తి)

ఇక 'మాగధి' యనఁగా నేమి! ప్రాకృత భాషాలక్షణమును, కొంత 'మగధదేశ' వ్యావహారిక స్వభావమును గలది 'మాగధి' యట! ఇట్లంతయు గొడవ గొడవ! కాని ఒకటి మాత్రము స్పష్టము. కాళిదాసునిలో 'విశేష ము'గ గనపడునది 'మహారాష్ట్రి'. కొద్ది కొద్ది దాని భేదములు. 'కాళిదాసుని నాటకములు నటితో నారంభ మగుటయు దానియందు గేయము లుండుటయు చూచి యొక విమర్శకుఁడు— మూఁడు ప్రయోజనములను సాధించెను. (1) స్త్రీలు ప్రాకృతమునే మాటలాడెదరు.

1. అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి దేశభాషావికల్పనం
సౌరసేనం సమాశ్రిత్య భాషా కార్యా తు నాటకే-
అథవా చ్ఛందతః కార్యా దేశభాషాప్రయోక్తృభిః
నానాదేశ సముత్థం హి కావ్యం భవతి నాటకే (భరతముని)

(2) సంగీతము - పురుషులకంటెను - స్త్రీలకే యెక్కువ ప్రియమైనది. (3) గానమునకు పనికి వచ్చునది ప్రాకృతమే గాని గీర్వాణము కాదు-అని చెప్పలేము. ప్రాకృత కథావాఙ్మయములో నెందఱో పురుషులు ప్రాకృతభేదములను భాషించిరి. జైనబౌద్ధ ధర్మగ్రంథములు చాలమట్టుకు ప్రాకృతభాషలయందే యున్నవి. మరి వారంద ఱేమి కావలెను?

'కళాప్రేమ' చిత్తవృత్తికి సంబంధించినది. అందులో జాతిభేద మేమి చేయును? సంగీతమనఁగా సేవగించుకొను స్త్రీ లెందఱో యున్నారు. పురుషులకు సంగీతమం దెంత ప్రేమయో స్త్రీలనే యడుగవలెను.

గానమునకు పనికి వచ్చునది 'ప్రాకృతమే' యనుటయందును నాకు విశ్వాసము లేదు. ప్రతి భాషకు దాని దాని ప్రత్యేకమైన యోగ్యత యున్నది. పై సిద్ధాంతములవంటివి యొక తీవ్రమైన అభినివేశముతో తేల్చికొనెడు నూహలు. వానికి శాశ్వతమైన వెల యుండదు.

[1] 'భరతుఁడు' నాటకములలో 'చేటులు' రాజపుత్రులు, శ్రేష్ఠి, మొదలైనవారికి 'అర్ధమాగధి' వాడవలెనని కట్టడ చేసెను. దీని విషయమై పెద్ద పెద్ద వివాదములున్నవి. 'భద్రబాహువు' ఈ భాష నెక్కువ ప్రచారమునకు దెచ్చెను.

కాళిదాసు సాధారణముగ 'పాటలకు' 'మహారాష్ట్రి'ని వాడెను. గద్యమునకు 'శౌరసేని' నుపయోగించును. అప్పుడప్పుడు వచనమునకు 'మాగధి' వాడుటయు గలదు. కాని అతని 'మాగధి'—అంత శుద్ధమైనది గాదు. దానికి కాలమే కారణము.

కాళిదాసుని గేయములు 'చర్చరి' మొదలైనవాని పేరులనుబట్టి పాట లనుకొనుటయే గాని, వానినిగూడ మనము శ్లోకములవలెనే చదివికొందుము. మహాకవి గేయములను ఒక విమర్శకులు కాళిదాసుని ప్రాకృత రచనలన్నియు పాటలే గనుక, 'హాలుని' సప్తశతిలోని 'గ్రథనము' అన్నియు గేయములే యను నొక సిద్ధాంతమును లేవదీసిరి. కాళిదాసుని 'ప్రాకృతము' లన్నియు గేయములేనా! యనుట తొలుత స్థిరపడవలసిన విషయము. 'హాలు'ని సంకలనములలో అనేకములు 'ఆర్యావృత్తము'లు—ఆ ఛందస్సు వానియం దున్నదిగాదా! లేక—'ఆర్యావృత్తము'లకే నాకు 'గేయము'లని మాఱుపేరా! విమర్శకులు తేల్చిచెప్పవలెను. మరిప్రాచీనములైన చాటువులవంటి 'గాథలు'? అవియు పాటలేనా? వారినే యడుగవలెను.

ప్రాకృతములను సంస్కృత నాటకమున నెక్కువగ, మేలుగ వాడినవాడు శూద్రకుఁడు. ఇతని కాలమునను ప్రాకృతములు కొంత కొంత వ్యవహారమం దుండినవి. 'మృచ్ఛకటిక'లోని శకార, స్థావరక, కుంభీలక, వర్ధమానక, గోహసేన, చండాలురు 'మాగధి'ని వాడిరి. 'శాకుంతలము'లోను బెస్తవారు, సర్వదమనుఁడు మొదలగువారు పలికినవి 'మాగధ.' మృచ్ఛకటికలోని 'మాగధి' 'శకారి' 'చాండాలి' అనెడు అనేక భేదములను బొందినదట! వైయాకరణులు 'శౌరసేని' యందే రెండు భేదములను చీల్చిరి. ఒకటి 'అవంతి' రెండవది 'దాక్షిణాత్యము'! ఈరెండును గొంత 'మహారాష్ట్రి'ని చేర్చికొనును. మృచ్ఛకటికలోని విదూషకుఁడు వాడినది 'ప్రాచ్య' యని 'పృథ్వీధరు'ని యభిప్రాయము. అట్లే వీరకుఁడు 'అవంతి'ని, చందనకుఁడు 'దాక్షిణాత్యము'ను వాడుదురు. పై యభిప్రాయము - జర్మన్ పండితుఁడు 'పిషెల్' మహాశయుఁ డొసఁగినది. శకారుఁడు 'శకారి' యనెడు మాగధ భేదమును వాడెను. ఇది 'యపభ్రంశ' భేదమే యని పృథ్వీధరుఁ డనును. మృచ్ఛకటికయం దింకను అవాంతరములైన ప్రాకృతవిభేదము లెన్నియో చూపింపఁబడినట్లు విమర్శకుల యనేకుల యభిప్రాయము. ఈ నాటకమును ఈ దృష్టిలో ఇంకను అధ్యయనము చేయవలసిన యవసరము మావంటి జిజ్ఞాసువులపై నున్నది.

యాయావర రాజశేఖరుఁడు ఒక మహాసాహసమైనపనికిఁ బూనుకొనెను. అది యాతని 'కర్పూరమంజరీ' రచనము. దానికి ప్రేరకురాలు అవంతిసుందరియే నట! కాని అతని పంథకు కాలము కలసి రాలేదు. యథాప్రకారము వ్యాకరణముల తోడ్పాటే రాజశేఖరునకును గావలసి వచ్చినది.

ఇంతకును ఈ దృష్టిలో నెంతయో పరిశ్రమ జరుగవలసియున్నది. దానికి అర్హులైనవారు పూనుకొనవలెను.

1. చేటానాం రాజపుత్రాణాం శ్రేష్ఠినాం చార్ధమాగధీ (నాట్యశాస్త్రము)

# వెణుతుర్ల వడ్డికవి -
# తర్వాతి ఆలంకారికులు

శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు.

---

## ౧

శృంగారరససామగ్రిని వివరించుగ్రంథములలో శృంగారరసాలవాల మొకటి. దీనిని రచించినయాతఁడు వెణుతుర్ల వడ్డికవి. [1]వడ్డికవి కౌండిన్యగోత్రుఁడు; తండ్రి మంగళగిరి; తాత వెంగనార్యుఁడు.[2] వడ్డికవి శ్రీరామభక్తుఁడు, శుక్లయజుర్వేది, దేశికాచార్యుల శిష్యుఁడు.

వడ్డికవి కాలము, నివాసము నిర్ణయింపఁదగిన యాధారములు లేవు. ఇతఁడు తన గ్రంథమును పూర్వకవుల గ్రంథముల ననుసరించియే వ్రాసినట్లు చెప్పికొని యున్నాఁడు.[3] ఆ గ్రంథములు సంస్కృతగ్రంథము లయినను కావచ్చును. ఆంధ్రగ్రంథము లయినను కావచ్చును.

వడ్డికవి యెన్ని గ్రంథములను రచించెనో స్పష్టముగఁ దెలియదు. కాని శృంగారరసాలవాలము, బాలగోపాల విలాసము అను నితని కృతులు కన్పించుచున్నవి. బాలగోపాల విలాసము శ్రీ కృష్ణుని విలాసములను ప్రతిపాదించు ప్రబంధము.

## ౨

నామమునుబట్టియే 'శృంగారరసాలవాలము' శృంగారరసప్రతిపాదక గ్రంథముగఁ గన్పించుచున్నది. కాని యిది రసమంజరివలెఁ గేవల శృంగారరస సామగ్రీప్రతిపాదకము కాదు; ఇందుఁ దొలుతఁ గావ్యస్వరూప చర్చ కొంత కలదు. పిదపఁ గరుణాదు లగురసాంతరములు నుల్లేఖింపఁబడినవి. దీనికి మూలము రసమంజరిని బోలు రసవిషయ ప్రతిపాదకము లగు కొన్ని గ్రంథములు, కావ్యాలంకార సంగ్రహము మొదలగు గ్రంథములు ఆధారము గావచ్చును.

శృంగారరసాలవాలము మూఁడాశ్వాసముల గ్రంథము. ప్రథమాశ్వాసమునఁ గావ్య లక్షణము, రత్యాదిస్థాయి భావోదాహృతులు, ఆలంబనోద్దీపన విభావములు, అనుభావ, సాత్త్విక, సంచారిభావములు, శృంగారచేష్టలు, చక్షుఃప్రీత్యాది శృంగారావస్థలు, స్వప్న-చిత్ర-సాక్షాద్దర్శనములు కలవు. ద్వితీయోల్లాసమున స్వీయ-ముగ్ధ - మధ్య - ప్రౌఢ ధీరాదినాయికలు, పరకీయ, వృత్తాది సురతగోపన. వాగ్విదగ్ధ, ప్రియవిదగ్ధ, లక్షిత, కులట, ప్రథమాద్యనుశయాన, ముదిత మొదలగు నాయికాభేదములు వివరింపఁబడినవి. తృతీయాశ్వాసమునఁ బ్రోషితభర్తృకాద్యష్టవిధ నాయికల స్వరూపము, ముగ్ధాదులం దీ యష్టభేద నిరూపణము, జ్యోత్స్నాభిసారికా ప్రవత్స్యత్పతికల లక్షణము, నాయికల ఉత్తమ మధ్యమాధమ భేద వివృతి, మండనాది స్వరూపము, నాయకభేద

---

1. 'ఇది శ్రీరామభద్ర కరుణాకటాక్షలబ్ధ కవితాచమత్కార వెణుతుర్ల కులాలంకార, కౌండిన్యసగోత్ర పవిత్ర, వేంగనాచార్య పౌత్ర, సాధుచారిత్ర, మంగళగిరిపుత్ర, వినయగుణధుర్య వడ్డికవి ప్రణీతం బైన......'

2. ఉ. శ్రీరఘువీరభక్తిరససింధువిహారుఁడ శుక్లయాజుషా
చారుఁడ దేశికాంఘ్రిపరిచారుఁడ నే వెణుతుర్లవంశవి
స్తారుఁడ వడ్డినామకవిసత్తముఁడన్ రఘువర్యుపేర శృం
గారరసాలవాల మనుకావ్యము సేతు జగద్ధితంబుగన్.

3. గీ. అవధరింపుము పూర్వసత్కవినికాయ, కావ్యలక్షణలక్ష్యసంగతు లెఱింగి,
కృష్ణదేవుఁడు సల్పినక్రీడలాంధ్ర, భాష శృంగారరసము నేర్పఱతు నిటుల,

ములు, నాయిక సహాయ లగు పీఠమర్ద - విట - విదూషక స్వరూపము సోదాహరణముగ వివరింపఁబడినవి.

శృంగారరసాలవాలమును చెన్నపురిలోని 'దుండిగణపతి బుక్కుడిపో' వారు ప్రకటించి గ్రంథమును ప్రచారములోనికిఁ దెచ్చిరి. 'గ్రంథపరిచయ' మొనరించిన శ్రీ మంచళ్ల వేంకట పున్నయ్యశర్మ (బి. ఏ.) గారు గ్రంథమును గూర్చియు, గ్రంథకర్తను గూర్చియు సంగ్రహముగఁ బరిచయ మొనర్చిరి.

రసములలో శృంగార ముత్తమ మగుట, యందనేకభేదములు గలయుట నెఱిఁగి తత్ప్రతిపాదక మగుకావ్యమును వ్రాయ నడ్డికవి తలఁచినట్లు గ్రంథమునఁ గలదు. శ్రీ పున్నయ్య శర్మగారును ఇందుఁ బ్రాచీనప్రబంధములందువలెఁ గృత్యాది వర్ణనాదికములు, షష్ఠ్యంతములు, స్వప్నసాక్షాత్కారములు మున్నగునవి లేవని యిది యొక ప్రబంధమను నంశమునే వివరించిరి. ఇయ్యది కావ్య, ప్రబంధములకు లక్షణము చెప్పునది; కావ్యము కాని, ప్రబంధము కాని కాఁజాలదు.

సామాన్యముగ నాంధ్రాలంకారికులు నిరూపించు లక్షణములు సంస్కృతానుసారులు. అయినను ఇందు చాల స్వతంత్రత కనపడుచున్నది. లక్షణములు కొన్ని విలక్షణములుగ నున్నవి.

౧. 'ఆజి బలవంతుచేతఁ జీకాకు నొంది కోయుట' జుగుప్స యని యిందలి లక్షణము. (౪. పుట.) పయి లక్షణమున కనుగుణముగనే యుదాహృతియు 'శ్రీకృష్ణుని రథము నడ్డగించి పరాభూతుఁ డగురుక్మి వృత్తాంతము' కలదు. మాంస, మస్తిష్క, వసాది దర్శనమున మనసునకుఁ బట్టరాని యేవగింపు కల్గుట జుగుప్స. కావున నిందలి లక్ష్యలక్షణములు సంస్కృతానుసారులు కాకున్నవి.

౨. 'విరహవ్యథ శోక' మని యిందుఁ గలదు. (౮ పుట.) 'విరహవ్యథచే బాధపడు నొక గోపభామినికి, కృష్ణుడు దర్శన మొసఁగుట' దాని కుదాహరణము. పుత్త్రాది వియోగమునఁ గల్గువైక్లబ్యమే శోకము. ఇచట లక్ష్యమున సుఖాంతత యున్నది. ఇదియు విలక్షణము.

౩. 'ఆత్మవికాసమందుట' హాస మని యిందలి లక్షణము. ఇది వాగంగ వికారాదికములవలనఁ గల్గు మనోవికారము. 'కృష్ణుఁడు జలక్రీడలఁ దేలుస్త్రీల వలువల దొంగిలి, వారిని జేతు లెత్తి మ్రొక్కుమనఁగా, వారు అకలంక మనోహరాంగ శృంగారము లెల్ల దోఁపఁ గరకాండములఁ ముకుళించి మ్రొక్కఁ, దా, వనరుహాక్షుఁడు, ఆరసి హాస్య విలాస దక్షుఁడై నవ్వె' నని పయి హాసమున కుదాహృతి. కేవల హాసము హాస్యస్థాయి కాఁజాలదు; లక్ష్యము సరి గాదు.

౪ శమలక్షణ మిందు 'నెమ్మదిలోన నొప్పు సెలఁగ నిశ్చలపరిస్థితియ శమ'మని చెప్పఁబడినది.

దీని యుదాహరణము 'బోటు లనేక లోం డొకరి పొట్ట నసింపక నైకరీతులన్ మాటలు మందెమేలములు, మానము గానము లెంచి,... నిజమానసు కాంతునుఁ బూన... గౌరి యుపాస్తి టలగంధు లంద లోక వాటుగఁ దేర్చెఁ గ్రమక్రమంబుగన్' అని కలదు. ఇచట మొదటఁ బోట్లాడుకొనిన స్త్రీలు శాంతము వహించినట్లు వర్ణింపఁబడుటచే నిది శమోదాహరణ మని వివరింపఁబడినది. ఈ లక్ష్యము మీఁది లక్షణము కూడ సరి కావు.

శృంగార రసాలవాలము రచన చాల సరళము. లక్ష్యములు కొన్ని లక్షణములకు సరిపోకున్నను, సరసముగ నున్నవనుటకు సందేహము లేదు. ఇందు ముద్రణస్ఖాలిత్యములు మిక్కిలిగ దొరలినవి. తక్కిన యచ్చుతప్పులతోఁబాటు ఆకారాంత స్త్రీలింగశబ్దములు - స్వీయా, పరకీయా, సామాన్యా - మొదలగు శీర్షికా పదములు - ఇందు అకారాంతములుగనే విడువఁబడినవి.

## కటికినేని రామయకవి

౧

ఆంధ్రమునఁ గల యలంకార గ్రంథములలో సంస్కృత కువలయానందము నాంధ్రీకరణ మగుకువలయానందప్రకాశ మొకటి. దీనిని రచించిన యాతఁడు కటికినేని రామయకవి. ఇతనిది పద్మనాయకకులము; చెలికనూర్ల గోత్రము; రామయకవి ముత్తాత గోపరాజ మహీవల్లభుఁడు; తాత నరసరాయఁడు; తండ్రి నారశౌరి; తల్లి బుచ్చమ్మ; తమ్ముఁడు వేంకటరాయఁడు.

రామయకవి వైష్ణవమతావలంబి; కుల గురువు శ్రీ ప్రతివాది భయంకర వేదాంతాచార్యుఁడు. ఆదిగురువు తర్క వ్యాకరణ విద్వాంసుఁ డగుకనకాద్రి. ఇతఁడే కవికి విద్యా గురువు కావచ్చును. రామయ 'అతివిచిత్ర రసగుణాలంకార బంధురాతి ప్రబంధ నిర్మాణ చాతురీధురీణుఁడు.' తనకుఁ బరమాప్తు లగు పానుగంటి వేంకయ, కాశీ వేంకటనరసయ మొదలగువారు ప్రేరింప నీ 'కువలయానంద ప్రకాశ ప్రబంధంబును' లోకోపకారార్థంబుగా రచియించెను. రంగార్యవర్యుని సాహాయ్యమున నీకృతి రచింపఁబడినది.

రామయకవి కాలము కాని నివాసస్థానము కాని స్పష్టముగాఁ దెలియవు. తెలిసికొనుటకుఁ దగిన యాధారములును లేవు. కువలయానంద ప్రకాశము క్రీ. శ. ౧౮౯౩ వ సంవత్సరమున 'శ్రీ కాశీవిశ్వనాథ' ముద్రాక్షరశాలయందు వెంకటగిరిలో ముద్రింపఁబడినది. దీనిని శ్రీ వెలుగోటి ముద్దుకృష్ణ యాచేంద్ర బహదరువారు ముద్రింపించి ప్రకటించినారు. ఇతఁడు వెంకటగిరి ప్రభువుల బంధుకోటిలోనివాఁడు కావచ్చును.

రామయకవి యెన్ని గ్రంథములను రచించెనో తెలియదు. శ్రీ కృష్ణవిలాస మనుగ్రంథాంతరము నీతఁడు రచించినట్లు తెలియుచున్నది. [1] అది యొక శృంగారప్రబంధ మయి యుండవచ్చును.

౨

కువలయానంద ప్రకాశము సంస్కృతమున అప్పయదీక్షితులు రచించిన 'కువలయానందము' లోని తొలి నూఱలంకారములకును యథామూల మగు తెలుఁగుసేఁత. కొలఁది చోటుల మాత్రము మూలమున లేని యుదాహరణములు కొన్ని కలవు.

మూల మెచటను విడువఁబడినట్లు తోఁచదు. ఆంధ్రములో నంతగా సంబంధంప నివి, సంస్కృతసంబంధములు నగుచర్చలుఁ కూడ నిందు భాషాంతరీకరింపఁ బడినవి.

ఇది మూఁడాశ్వాసముల గ్రంథము. ఇందలి యాశ్వాసములకు ఘట్టము లని పేరు. ప్రథమాశ్వాసమున నుపమాలంకారము మొదలు ఆవృత్తి దీపకాలంకారము వఱకు, ద్వితీయాశ్వాసమునఁ బ్రతివస్తూపమాలంకారము మొదలుకొని విషమాలంకారాంతమువఱకును, తృతీయాశ్వాసమున సమాలంకారము మొదలుకొని హేత్వలంకారాంతము లక్ష్యలక్షణాదికము కలదు. మిగిలిన భాగము విడువఁ బడినది.

కువలయానందమున కిది తెలుఁగుసేఁత యైనను, 'తు, చ'లుఁ తప్పకుండనియాంధ్రీకరణ మగుట చేతను, చాలచోట్ల మూలమునందలి వాక్యముల కారీతిగనే తత్సమీకరించిన యనుకరణ మగుటచేతను, నిందలి విషయము కొంత దుర్గ్రాహ్యముగనే యున్నది. శాస్త్రీయచర్చలపట్టుల ననువాదము మూలమునే పోలుచున్నది. ఉదాహరణ శ్లోకములు స్వేచ్ఛాంధ్రీకరణము కాక యథామూలములు.

వచనానువాదమున కుదాహరణము :

౧. ప్రసిద్ధోపమానోపమేయ భావప్రాతిలోమ్యంబువలనఁ బ్రతీపం బనం బరఁగె. దీనికి మూలము 'ప్రసిద్ధోపమానోపమేయ భావప్రాతిలోమ్యాత్ప్రతీపమ్'

౨. వర్ణనీయం బైనవస్తువునందుఁ దత్సదృశధర్మాశ్రోపఫలకం బైన తదీయ ధర్మనిహ్నవంబును, మఱియుఁ గవిమతి వికాసోత్ప్రేక్షిత ధర్మాంతర నిహ్నవంబును శుద్ధాపహ్నవం బనం బరఁగు.

దీనికి మూలము—'వర్ణనీయే వస్తుని తత్సదృశ ధర్మారోపఫలక స్తదీయధర్మనిహ్నవః శుద్ధాపహ్నుతిః' అని యున్నది.

౩. ఈ యుదాహరణంబునందుఁ బ్రస్తుతాప్రస్తుతంబులకు యుగపద్ధర్మాన్వయంబు ప్రతిభాసింపు చున్నయది......మను లక్ష్యంబునందు నప్రస్తుతంబునకే ముందుగా ధర్మాన్వయంబు ప్రతిభాసింపుచున్నయది. ఐనను బ్రస్తుతోద్దేశంబుచేతఁ బ్రస్తుతం బైనవర్ణనంబునకే యప్రస్తుతంబు నంద్రైన నన్వయంబు సంభవించుం గావునఁ బ్రాసంగికత్వంబు పరిత్యక్తంబు గాదు. రథ్యాప్రాసాదంబులకు యుగపదుపకారకత్వంబు గలుగుటచే దీపంబులకును, నతిథుల కొఱకుఁ బ్రథమ పరివేషణంబు సేయుటచేత జామాత్రర్థంబు ప్రపితంబైన నూపంబునకును బ్రాసంగికత్వంబు రహితంబుగాదుగదా! తుల్యయోగితాలంకారంబునందు నొకటి ప్రస్తుతంబు వేఱొకటి యప్రస్తుతం బని విశేషగ్రహణంబు లే,

1. కువలయానందప్రకాశము, పుటలు, ౨౬, ౨౩.

దిందు సర్వోద్దేశంబుచేత నే ధర్మోక్తి గలుగుటం జేసి పరస్పరవిశేషంబు నిర్దేశింపంబడియె, నీ యలంకారద్వయంబునం దుపమాలంకారంబునకు గమ్యత్వావిశేషంబు గలిగినను నీ దీపకాలంకారంబునం దప్రస్తుతం బుపమానంబనియుఁ, ప్రస్తుత ముపమేయం బనియు, నుపమానోపమేయ భావంబు వ్యవస్థితంబై యున్నయది. యత్తుల్య యోగితాలంకారంబునందుఁ వద్భావంబునకు విశేషగ్రహణంబు లేకుండుటవలన నైచ్ఛికంబై యుండుటంజేసి నీ యలంకారంబులకు రెంటికి నిది మఱియొకవిశేషం బయ్యె.

దీని మూలము '......ఇత్యత్ర ప్రస్తుతానామప్రస్తుతానాం యుగపద్ధర్మాన్వయః స్త్యథాపి ప్రాసంగికత్వం న హీయతే, వస్తుగత్యాప్రస్తుతో ద్దేశేన ప్రస్తుతస్యైవ ధర్మనస్యాప్రస్తుతేఽన్వయాత్, నహి దీపస్య గత్యా ప్రాసాదయోర్యుగపదుపకారకత్వేన జామాత్రర్థం శ్రితస్యూపస్యాతిథిభ్యః ప్రథమ పరివేషణేన చ ప్రాసంగికత్వం హీయతే. తుల్యయోగితాయాం త్వేకం ప్రస్తుత మన్య దప్రస్తుత మితి విశేషాగ్రహణాత్సర్వోద్దేశేనైవ ధర్మాన్వయః ఇతి విశేషః, అయం చానయో రపరో విశేషః, ఉభయోరనయో రుపమాలంకారస్య గమ్యత్వావిశేషేఽపి అత్రాప్రస్తుత ముపమానం, ప్రస్తుత ముపమేయ మితి వ్యవస్థిత ఉపమానోపమేయ భావః, తత్రతు విశేషాగ్రహణా దైచ్ఛిక స్స ఇతి'. విషయవివరణ మంతయు నీరీతిగ నే యున్నది. మూలమందలి ఉపమోత్ప్రేక్షాసమాసోక్తికావ్యలింగార్థాంతరన్యాస లక్షణాదుల విషయవిమర్శన మింతకంటెను కఠినతర శైలిలో నున్నది.

భాషాంతరీకరణపద్ధతికి :

౧. గీ. రాజసేవ మనుష్యుల కీ జగతిని
ఖడ్గధారావలేహంబు కదిసి చూడఁ
బంచవక్త్రపరీరంభ మంచితముగ
నాగకన్యావదనచుంబనంబు తెలియ.
(పుట. ౫౫.)

దీనిమూలము.

రాజసేవా మనుష్యాణా మసిధారావలేహనమ్,
పంచాననపరిష్వంగో వ్యాళీవదనచుంబనమ్.

ఛందోయతిప్రాస సంసిద్ధికొఱకుఁ బయి పద్యమున 'ఈ జగతిని, కదిసి చూడ, అంచితముగ, తెలియ' అను పదములు తెచ్చి పెట్టుకొనినవి. మూలములోని 'వ్యాళికి' 'నాగకన్య' అని యాంధ్రకృతి. 'నాగకన్యా వదనచుంబనము' పంచానన పరిష్వంగమువంటిది కాకపో వచ్చునుగదా!

౨. గీ. మఱియుఁ గపికాపిశాయనమత్త మంత
వృశ్చికముచేత దష్టమై వెగడుపడియెఁ,
గడిమి మఱియుఁ పిశాచికాగ్రస్తమయ్యె
నహహా! దానివికార మేమనఁగ వచ్చు!
(పుట. ౨౪౦)

దీనికి మూలము ——

కపిరపి చ కాపిశాయన
మదమత్తో వృశ్చికేన సందష్టః,
అపిచ పిశాచగ్రస్తః కిం బ్రూమో
వైకృతం తస్య"

మూలములోని 'కపిః, అపిచ' పదము లనువాదమున 'మఱియుఁ గపి' అని తారుమారయినవి. 'కడిమి' పద్యము కుదురుబాటునకు వచ్చినది.

ఇందచ్చటచ్చట వివరణసందర్భమున గవితానువదించిన పద్యముల సంగతి నే మఱచి మూలము నే వివరింప దొరకొనెను.

౩. సమాసోక్తిని వివరించుచోట మూలము ననుసరించి 'అనేన సార్థం విహరాంబురాశేః' రిత్యాది స్థలంబుల యందు సమాసోక్త్యలంకారముగా నుండుటకై జనరంజనం బనువిశేషంబు సహభావంబునకు దత్తం బయ్యె నని యుందు వ్రాయఁబడినది. పయి సంస్కృత శ్లోకసాదానువాదము విడువఁబడినది. (పుట. ౯౩)

౪. అర్థాంతరన్యాస వివరణ సందర్భమున మూలమునఁగల 'యోయో నామవాన్ సహోఽగ్నిమా......యథామహోసః' అను సంస్కృత మనువాదమునందును తెలిఁగింపఁబడక యట్లే యుంచఁబడినది. (౨౮౯.)

౫. 'పుష్కలకారణంబు గలిగి కార్య సముత్పత్తి గాక యున్న...' విశేషోక్తి యని తాను లక్షణము నాంధ్రీకరించినను రామయకవి అతద్గుణాలంకార వివరణ సందర్భమున (పుట ౨౪౦.) విశేషోక్తి స్వరూపమును తెల్పుచు 'కార్యాజనిర్విశేషోక్తిః సతిపుష్కలకారణే' అను మూలమునే యుట్టంకించెను. కాని తన యనువాదమును పేర్కొనలేదు.

౬. విశ్వతోక్తి వివరణమున మూలమున నున్నట్టే 'చేతోనలం కామయతే మదీయం నాన్యత్ర కుత్రాపి చ సాభిలాష' మిత్యాకారక దమయంతీ వాక్యాదికంబు ఉదాహరింపఁబడినది.

౭. కొన్నిచోట్ల మూలమునందలి లక్ష్యము లనువాదమునందును మార్పు చెందక యట్లే నిలిచియున్నవి.

౧౭౩ వ పుటలో సమాలంకారవివరణమున

గీ. 'న ఖలు శస్త్రం ప్రకుర్వీత నందన'యని
తండ్రి చెప్పినవచనము తనయుఁడు విని
యదియె శస్త్రంబు గావించె నాత్మజనకు
నాజ్ఞ నుల్లంఘనము సేయఁ డయ్యె నపుడు.

దీనిమూలము.

శ్లో. శస్త్రం న ఖలు కర్తవ్య
మితి పిత్రా నియోజితః
తదేవ శస్త్రం కృతవాన్
పితురాజ్ఞా న లంఘితా.

తండ్రి కుమారునితో 'శస్త్రముచేయవలదు' అని చెప్పఁగా నతఁడు 'నఖలు శస్త్రము' (గోరుగుండు) నే చేసిన ట్లిచట శ్లేషంబట్టి సమాలంకారము సమర్థింపఁబడినది. ఇచట లక్ష్యముకూడ తెలుఁగుననుండుటయే యుక్తము.

మూలమునఁ గొన్నిచోటుల లక్ష్య శ్లోకము లందలి ప్రయోగములంగూర్చి చర్చలు పెరిగినవి. అనువాదమున నట్టి చర్చల కవకాశము లేదు. అట్లయినను ఆ యనువాదము క్రిందఁ దిరిగి మూలమును వ్రాసి దానిపయి చర్చలు సాగింపఁబడినవి. ఉత్ప్రేక్షోదాహరణమున [పుట. ౧౮.] 'అసకారసితిరీతి......కామినీ, నవనీలార్ద్రి నఖక్షత ప్రతతులో నా నెంతయున్ భాసిలెన్.' అనుచోటఁగల 'నాన్' ఉత్ప్రేక్షా వాచకమే కాని యుపమావాచకము కాదు. అయినను మూలమందలి చర్చనుగూడ వ్రాయఁ దలఁచి కవి పై పద్యమునకు మూల మగు 'బాలేందువక్రాణి......నఖక్షతా నీవ వనస్థలీ సామ్' అను చోటఁ గల 'ఇవ' శబ్దము సాదృశ్య వాచకమా? ఉత్ప్రేక్షావాచకమా? యని చర్చించి గ్రంథమును పెంచెను.

వివరణమునం దచ్చటచ్చట మూలములోని శ్లోకములే యనువాదమునఁ గలవు. అట్టివి సమాసోక్తియందును, నుత్ప్రేక్షయందును గలవు. వాని కనువాదము గాని వివరణము గాని లేదు. ఇది యథామూలానువాద మగుటచే లక్ష్య పద్యములకు మూలమున నున్నచో నిందును వివరణ ముండుటయు, అవి క్లిష్టములయ్యును మూలమున లేకుండుటచే నిందును వివరణము లేకుండుటయుఁ జాలచోట్లఁ గలదు. దృష్టాంత, ప్రతివస్తూపమా సంభవ విభావనా విశేషోక్త్యాదులం దీరీతి కన్పించును.

పయి విషయములంబట్టి చూడఁగా మూల గ్రంథమును బాగుగఁ జదివినవారే యనువాదమును నిస్సందేహముగ నెఱుఁగఁగల రని తేలుచున్నది

ఇట్లు ఆంధ్రీకరణము యథామూలముగా నున్నను, గొన్ని యెడలఁ గవి స్వాతంత్ర్యము నవలంబింపకపోలేదు - కొన్నిచోట్ల మూలకారికలలోని లక్ష్యభాగములు విడువఁబడినవి. ఉ. అధికతాద్రూప్యరూపకము. కొన్ని యెడల మూలమున లేని 'అలంకార సంకరోదాహరణములు' కవినిబద్ధములు కలవు. ఉ. నిదర్శన, ఉత్ప్రేక్ష.

ఈ కువలయానంద ప్రకాశమునఁ గొన్ని యెడల ననువాదమునఁ గొన్ని దోసఁగులు కన్పించుచున్నవి. మచ్చునకు - ముద్రాలంకారము లక్ష్యలక్షణములు మూలమున,

'శ్లో. సూచ్యార్థసూచనం ముద్రా
ప్రకృతార్థపరైః పదైః
నితంబగుర్వీ తరుణీ
దృగ్యుగ్మవిపులా చ సా'

అని యున్నవి. ప్రకృతార్థమును దెలియఁజేయు పదములచే సూచ్యార్థము సూచింపఁబడిన ముద్ర యగు నని యర్థము. ఇచట 'దృగ్యుగ్మవిపులా' లోని యుగ్మవిపులాపదము అనుష్టుప్ ఛందో విశేష మగు యుగ్మవిపుల యను భేదమును (మీఁది శ్లోకచ్ఛందమును) సూచించుచున్నది. అనువాదమునఁ గూడ-

గీ. 'ధరణిఁ బ్రకృతార్థపరపదోత్కరముచేత
నొనయు సూచ్యార్థసూచన ముద్ర యగును;
దరుణి నిర్వక్రచక్రనితంబగుర్వి
విపుల కమఠాభదృగ్యుగ్మవిపుల యగును'

అను మూల మందలి 'యుగ్మవిపుల'యే గ్రహింపఁబడి యది మూలమునకు సరిపెట్టఁబడినది. కాని యనువాద పద్యమున సూచ్యార్థ

సూచన లేనందునఁ బయి యలంకారమున కిది యుదాహరణము కాఁజాలకున్నది. ఇందు 'దృశ్యాగ్ర విపుల'కు బదులు 'తేఁటగీతి' యని యుండిన - అది ప్రకృతార్థమున సమన్వయించిన ఉదాహరణము కాఁగలదు.

[పుట. ౨౩౪.]

మూలములోఁ బరికరాలంకార వివరణ సందర్భమున - శ్లేష, యమకాది స్థలములలో నపుష్టార్థ దోషము పాటింపఁబడనందున నొక్క విశేషణ మభిప్రాయ గర్భిత మయినను పరికరాలంకార మగు నని చెప్పఁబడినది. అందు యమకమునకు-

'అతియజేత నిజాం యది దేవతా
ముభయ తశ్చ్యవతే జుహ్వతేఽప్యఘమ్.
క్షితిభృతైవ సదైవతకా వయం
వనవతానవతా కి మహీభుజా.'

అని యుదాహరణ మీయఁబడినది. ఇచట 'వనవతానవతా' యని యమకము.

చ. తెలియక నెవ్వఁడేని
నిజదేవతఁ గొల్వక నన్యదైవతం
బులను యజించు నాతఁ
డఘమున్ వెసఁ జెందు నిహోర్ధ్వలోకసు
స్థలనముఁ జెందుఁ గాన వన
సంపద గల్గిన యిన్నగేంద్రముం
గొలిచెదువార మింద్రు మఱిఁ
గొల్వఁగ నేల యరక్షణక్షమున్.'

అనునది మీఁదిశ్లోకమున కనువాదము. ఇందు మూలమునందువలె యమకము లేదు; అభిప్రాయ గర్భిత మగువిశేషణము యమకమునం దుండవలెను. వివరణములో 'వనసంపద గల్గిన' యనునది సాభిప్రాయ విశేషణముగఁ జెప్పఁబడినది. [పుటలు ౧౦౬, ౧౦౭.]

ఉత్తరాలంకారపు మొదటిభేద మిందు 'గూఢోత్తర'మను ప్రత్యేకాలంకారముగఁ జేర్కొనఁబడినది. మూలము—'కించిదాకూత సహితం స్యాద్గూఢోత్తరముత్తరం.' లక్షణానువాదము—'కించిదాకూత సహితమైన మించు నుత్తరంబు పరఁగును గూఢోత్తరం బటందు.' (ఇచట అలంకారనామ మగు 'ఉత్తర'ము 'గూఢోత్తరవిశేషణముగ గ్రహింపఁబడినది.)

(పుట. ౨౪౬)

పయి ఉత్తరాలంకారపు రెండవభేదము యొక్క లక్షణోదాహరణములు క్రింది రీతి నున్నవి—

'ప్రశ్నోత్తరాంతరాభిన్న
ముత్తరం చిత్ర ముచ్యతే
కేదారపోషణరతాః
కే ఖేటాః కించలం వయః.'

'ప్రశ్నోత్తరములకు భేదము లేకుండుట, రెండు ప్రశ్నముల కొక్కటే యుత్తర మగుట చిత్ర మగు నుత్తరాలంకారభేదము' అని పయి లక్షణము సగ్రము. పయి శ్లోకమున కనువాదము-

గీ. బెరసి ప్రశ్నోత్తరాంతరాభిన్న మైన
నుత్తరం బది చిత్రమై యొగి నెసంగు;
జగతిఁ 'గేదారపోషణ శాలినః క
కించలం హి వయః ఖగాః కేచ' యనఁగ.

ఇందలి లక్ష్యము మూలమే; అదియుఁ దారుమారుగ నున్నది. మఱియు నీ భేదము 'చిత్రము' అను ప్రత్యేకాలంకారముగఁ జేర్కొనఁబడినది. (పుట. ౨౪౭)

ఛేకోక్త్యుదాహరణము మూలమున

'మలయమరుతాం వ్రాతా యాతాః
వికాసితమల్లికా
పరిమలభరో భగ్నో గ్రీష్మ
స్త్వముత్సహసే యది
ఘన ఘటయ తం త్వం
నిఃస్నేహాం య ఏవ నివర్తనే
ప్రభవతి గవాం కిం నశ్ఛిన్నం
స ఏవ ధనంజయః.'

అని యున్నది; దీని యనువాదము—

గీ. మలయమరుదంకురస్ఫురన్మహిమ యణఁగె
మల్లికామోదభృద్గ్రీష్మ మెల్లసమసె
ఘన! ఘటింపుము ప్రియుఁ గూర్మి కలిగె నేని
యావుల మరల్చువాఁడె పో యర్జునుండు.

లోకోక్తి కర్థాంతరకల్పనము చేయఁబడిన ఛేకోక్తి యగు నని లక్షణము. మూలమందలి 'గవాం నివర్తనే యః ప్రభవతి స ఏవ ధనంజయః' అనునది 'అవులను మరల్చినవాఁడే అర్జునుఁడు' అను లోకోక్తిని తెలియఁజేయుచున్నో, ధనంజయ శబ్దశ్లేషవలన 'సౌందర్యవతి యగు నాయికను విడిచి ధనాశచే దూరదేశమునకుఁ బోయినవాఁ డరసికుఁ డగుట పకు ప్రాయుఁ డని, ధనములను (ధనాశను) జయిం

చినవాఁడే యట్టి పక్షుప్రాయు నింటికి మళ్లింపఁ గలవాఁ డని యర్థాంతరము వచ్చుచున్నది. అనువాదములోని అవు, అర్జునుడు, అనునది అర్థాంతరావగమనమున కనుకూలములు కావు.

[పుట. ౨౬౦]

వక్రోక్త్యుదాహరణముగ
'అహో! శ్లోకే నేదృశీ బుద్ధి
ర్దారుణా తవ నిర్మితా
త్రిగుణా శ్రూయతే బుద్ధి
ర్న తు దారుమయీ క్వచిత్.'

అను శ్లోకము కలదు; దాని తెనిఁగింపు —

గీ. రమణి! చక్కగ మరు దారురచిత మయ్యె;
నెవని చేతను నీమది యావనిఁ గాంచు,
బుద్ధి త్రిగుణాత్మకం బని పోలుఁపు మిగులు
దారుమయము గాంచు టెచ్చటఁ దనర వినము.

మూలమందలి 'దారుణా' అను దానికి సబంగునర్థము దారుణ మైనది (కఠిన మైనది) అని; అది తృతీయైక వచనముగా - వక్ర బుద్ధి తో గ్రహించి 'బుద్ధి యెచ్చటను కఱ్ఱతోఁ జేయఁబడ' దని జవాబీయఁబడినది. అనువాదమున 'ఉరు దారురచితము' అని కలదు. దీనికి రెండర్థములు లేవు; కఱ్ఱచేఁ జేయఁబడిన దనునర్థ మొక్కటియే వచ్చును. ఇచట నర్థాంతర ప్రతీతి కలుగదు; ఇది వక్రోక్తి కుదాహరణము కాఁజాలదు.

ఈ గ్రంథము చాల జాగ్రతగ అచ్చొత్తింపఁబడినది. అయినను అచ్చటచ్చట తప్పులు పడినవి. అందుఁ గొన్ని విపరీతార్థస్ఫోరకములు కలవు. ప్రాగుదాహృత గ్రంథభాగములందును, మఱి చాలచోట్లను కళలు గురుప్రకృతికములుగ నున్నవి. అవి ముద్రణస్ఖాలిత్యములు కావచ్చును.

## నవీనవాఙ్మయము

తక్కిన వాఙ్మయవిభాగములతోఁ బాటలంకార వాఙ్మయమును ఆంధ్రమున క్రమముగ నభివృద్ధిఁ బొందుచున్నది. పెక్కురు పండితు లీ వాఙ్మయము నాదరించుచున్నారు. నవీనులును తొలుతఁ జాలవఱకు కేవలము అర్థాలంకారములను వివరించు గ్రంథములనే వ్రాయఁ దొడఁగినను క్రమముగ సమగ్రాలంకార శాస్త్ర గ్రంథముల రచింపసాగిరి. అందు మూఁడువంతుల మువ్వాలు భాషాంతరీకరణములు. భాషాంతరీకృతు లయినను ఆంధ్రమునకుఁ జాలవఱకు నుపయోగించునవియే. ప్రాచీను లగు నాంధ్రలాక్షణికులు నవీన సంస్కృతాలంకార గ్రంథముల ననుసరించిరి; నవీనులలోఁ గొందఱు ప్రాచీనాలంకార గ్రంథములను కూడఁ దగిన రీతిని తెనిఁగించుచున్నారు. అట్టి గ్రంథములు, వానియందలి విషయపరిశీలనము అలంకార తత్త్వమును దెలిసికొనుట కెంతయు ననుగుణములు. ఇటు లీ వాఙ్మయము అభివృద్ధి పొందుచుండుట ముదావహము.

ఈ ప్రకరణమున అకారాదిక్రమముగ నీయఁబడిన గ్రంథములలోఁ దెలిసినంతవఱకు ముద్రితములు, అముద్రితములు నగు నవీనాలంకార గ్రంథములు చేర్పఁబడినవి. వానిలోని విషయము లేవియో సంగ్రహముగఁ జెప్పఁబడినవి. ఆ గ్రంథముల విషయ విమర్శనము, గ్రంథము మంచి చెడుగులు నిందుఁ జేర్పఁబడలేదు.

### అచ్చతెనుఁగు రసమంజరి

అముద్రితము.

కర్త: చింతలపిల్లి రామకృష్ణమూర్తిశాస్త్రి గారు; భానుదత్త మిశ్రుఁడు సంస్కృతమున రచించిన 'రసమంజరి' కిది యచ్చాంధ్రానువాదము; శృంగారరసానుగుణు లగు నాయికలయు, నాయకులయు లక్షణోదాహరణము లిందుఁ గలవు.

### అలంకారచంద్రిక

(ముద్రితము)

కర్త: వేలనూతుల శివరామ కృష్ణయ్య, నవీనగ్రంథములలో నిది ప్రాచీనము. ఇం దర్థాలంకారములు లక్షణోదాహరణములతో వివరింపఁబడినవి. దీనికి దీక్షితులవారి 'కువలయానందకారికలు' మూలము.

### అలంకారచంద్రోదయము

ముద్రితము. కర్త: ఇమ్మనేని శరభలింగ నాయుఁడు, ఇందును అర్థాలంకారములే వివరింపఁబడియున్నవి.

### అలంకారతత్త్వవిచారము

ముద్రితము. కర్త: కురుగంటి సీతారామయ్య, ఎం., ఏ. అలంకారములతత్త్వ మిందు విచారింపఁబడినది.

### అలంకారమంజరి

ముద్రితము. కర్త: కేట్లూరి రాఘవయ్య, ఎం., ఏ. సంపూర్ణముగ కావ్య, తదంగములను

సవిమర్శముగ వివరించు గ్రంథము. ఇందు కావ్యభేదములు, శబ్దభేదములు, వృత్తులు, వ్యంగ్యము, ధ్వనిభేదములు, రసస్వరూపము, గుణీభూత వ్యంగ్యములు, శబ్దాలంకారములు, గుణ, రీతులు, అర్థాలంకారములును వివరింపఁబడినవి. చివర ననుబంధమున శబ్ద, రసములకు సంబంధించిన విశేషములు - గ్రంథమున విడువఁబడినవి - కలవు. దీనికి మమ్మటాచార్యుని కావ్యప్రకాశము స్థూలమూలము.

### అలంకారసంగ్రహము

ముద్రితము. కర్త: తి. రంగాచార్యులు. కువలయానందకారికల ననుసరించి యర్థాలంకారములను వివరించు గ్రంథము.

### అలంకారసంగ్రహము

ముద్రితము. కర్త: కందుకూరి వీరేశలింగము. ఇదియు పయిరీతి గ్రంథమే.

### అలంకారసారసంగ్రహము

ముద్రితము. కర్త: వేదము వేంకటరాయశాస్త్రి. ఇదియుఁ బయిరీతిదే. ఇందు మూలమందు వలె లక్ష్యలక్షణములు పద్యములలోనే యున్నవి. వివరణము వచనమున నున్నది.

### ఆంధ్రకువలయానందము

అప్పయదీక్షితుల కృతి కాంధ్రానువాదము. శ్రీ కంభంపాటి సుబ్రహ్మణ్య శాస్త్రి విరచితము. తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయ ప్రచురణము.

### ఆంధ్రదశరూపకము

ముద్రితము. కర్త: మల్లాది సూర్యనారాయణ శాస్త్రి. సంస్కృతమున ధనంజయుఁడు వ్రాసిన దశరూపకము (మూలము) నకును, ధనికుని 'దశరూపకావలోకము' (వివరణము) నకును (మొత్తముపయి) ఇది యనువాదము. నాటక లక్షణములను వివరించు గ్రంథము. సంస్కృత వివృతియందలి చర్చావిషయము లిందు సంగ్రహముగ నీయఁబడినవి. మూలకారిక లిందు వచనమున - సూత్రరూపముగ తెలిఁగించఁబడినవి.

### ఆంధ్రధ్వన్యాలోకము

ముద్రితము. శ్రీ వేదాల - తిరువేంగళాచార్యులుగారు. ఆనందవర్ధనాచార్యుని ధ్వన్యాలోకమునకుఁ దెలుఁగు ఉదాహృతులు తెలుఁగు ప్రబంధములనుండి గ్రహింపఁబడినవి.

### ఆంధ్రధ్వన్యాలోకము

ముద్రితము. జొన్నపాటి కుటుంబరాయశర్మ. ఇదియు ఆనందవర్ధనుని మూలమున కనువాదము.

### ఆంధ్రధ్వన్యాలోకము

ముద్రితము. విజయనగర సంస్కృతకళాశాలా పండితులగు శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి రచితము.

### ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము

ముద్రితము. చలమచర్ల రంగాచార్యులు గారు. విద్యానాథుని ప్రతాపరుద్ర యశోభూషణమున కిది యాంధ్రానువాదము.

### ఆంధ్రప్రతాపరుద్రీయము

ముద్రితము. జమ్మలమడక మాధవరామ శర్మ గారు. ఇదియు ప్రతాపరుద్రీయమున కనువదమే. శ్రీ చల్లపల్లి రాజావారి కంకితము.

### ఆంధ్రదశరూపకవిమర్శనము

ముద్రితము. కర్త: వేల్లాల సదాశివశాస్త్రి. పయి దశరూపకమునందలి గుణదోషములను విమర్శించు గ్రంథ మిది.

### ఆంధ్రసాహిత్యదర్పణము

ముద్రితము. కర్త: వేదము వేంకటరాయ శాస్త్రి. సంస్కృతమున విశ్వనాథకవిరాజు వ్రాసిన సాహిత్యదర్పణమున కిది యథామూలానువాదము. ఇందు మూలకారికలు వచనమున సూత్రరూపముగ తెలిఁగింపఁబడినవి. ఉదాహరణశ్లోకములకు వచనరూపముగ అనువాదము కలదు. ఉదారణ శ్లోకములు అధస్సూచిక (Foot note) యందు ఈయఁబడినవి.

### ఆంధ్రధ్వని

ముద్రితము. కర్త: అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి. సంస్కృతమున ఆనంద వర్ధనాచార్యులు రచించిన ధ్వన్యాలోకమునందలి మూలమునకు (ధ్వనినామము కలదానికి) ఇది పద్యానువాదము.

### ఔచిత్యవిచారచర్చ

అసమగ్రము. ముద్రితము. అనువాదకులు రామకృష్ణకవులు. సంస్కృతమున క్షేమేం

గ్రుఁడు వ్రాసినగ్రంథము దీనికి మూలము. పిఠాపురమునందలి 'కవిత' పత్రికలో ప్రకటింపఁబడినది.

### కవికంఠాభరణము

ముద్రితము. కర్తలు: రామకృష్ణ కవులు. క్షేమేంద్రునికృతికిఁ దెలుఁగుసేత. ఇందు కవులవలంబింపఁ దగినపద్ధతులు వివరింపఁబడినవి. ఇట్టివానిని 'కవిశిక్షా' గ్రంథము లందురు. వీని నలంకార వాఙ్మయమునందే యందఱును లెక్కింతురు.

### కావ్యకల్పలతావివృతి

ముద్రితము. కర్త: కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులుగారు. సంస్కృతమున దేవేశ్వరుఁడు వ్రాసినగ్రంథమునకు తెలుఁగు వివృతి యిది. పయి దానివలె నిదియు కవిశిక్షాగ్రంథము.

### కావ్యకలాపము

ముద్రితము. కర్త: సాహిత్యం నారాయణశర్మగారు. కావ్యసామగ్రీవివరణ మొనరించు గ్రంథము.

### కావ్యభూషణనిరూపణము

ముద్రితము. కర్త: చిదలువాడ సుందరరామశాస్త్రి గారు. అర్థాలంకారవివరణ మిందుఁ గలదు.

### కావ్యమీమాంస

ముద్రితము. కర్త: పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి. ఇప్పటికి కావ్యమీమాంసయందలి ప్రథమాధ్యాయ మగు 'కవిరహస్య' మే ఉపలబ్ధము. దాని కిది యథామూలానువాదము. మూలమునందలి పద్యముల కింద వచనమున భావానువాదమే కలదు.

### కావ్యప్రకాశవివృతి

ముద్రితము. కర్త: కొండూరి నరసింహాచార్యులు. మమ్మటాచార్యులు సంస్కృతమున రచించిన కావ్యప్రకాశమున కిది యాంధ్రవివృతి. కావ్యాంగముల చర్చ యిందలి విషయము.

### కావ్యలక్షణము

ముద్రితము. కర్త: శ్రీ కందుకూరి వీరేశలింగము. విద్యార్థుల కుపయోగించు కావ్యస్వరూప సంగ్రహము, అలంకారములు కొన్ని యిందు వివృతములు.

### కావ్యలక్షణము

ముద్రితము. కర్త: శృంగారకవి సర్వారాయుఁడు. ఇదియు పయి గ్రంథమువంటిదే.

### కావ్యాలంకారసంగ్రహటీక

శ్రీ వి. కృష్ణమాచార్యులుగారును, శ్రీ బ. సీతారామాచార్యులుగారును కలిసి రచించినది. ముద్రితము.

### కావ్యాలంకారసంగ్రహము

శ్రీ సన్నిధానము-సూర్యనారాయణ శాస్త్రి గారి విపులటీకతోఁ గూడిఁది వెల రూపాయిలు.

### కావ్యాలంకారసంగ్రహటీక

ముద్రితము. కర్త: శ్రీ బులుసు వేంకటరమణయ్య. ఇందు - మీఁది టీక కూడ ఈయఁబడినది. వావిళ్లప్రచురణము - వెల రు 3 లు.

### కావ్యాత్మ

ముద్రితము. కర్త: కేట్లూరి రాఘవయ్యంగారు; ఎం.,ఏ. ఇందు సంస్కృతాలంకార వాఙ్మయములోని విషయములు ప్రాచీన, నవీన మత నిరూపణ పురస్సరముగ వివరింపఁబడినవి. ఆయా యాలంకారికుల మతమున కావ్యమున కాత్మ యేదియో యిందు చర్చింపఁబడినది. ఆంగ్లమున డాక్టర్ సుశీలకు మారదేగారు (ఎం.,ఏ) వ్రాసిన సంస్కృతాలంకార వాఙ్మయచరిత్ర ద్వితీయభాగము (History of Sanskrit Poetics, Volume ii) దీనికి మూలము.

### కావ్యాలంకారచూడామణివివృతి

అముద్రితము. కర్త: వేదము వేంకటరాయశాస్త్రి. ఆంధ్రమున విన్నకోట పెద్దయకవి రచించిన 'కావ్యాలంకార చూడామణి' కిది టిప్పణీగ్రంథము. పయి మూలగ్రంథమును ప్రకటించినవారును శ్రీ శాస్త్రులుగారే.

### కావ్యాలంకారసంగ్రహటీక

ముద్రితము. కర్త: వెల్లాల సదాశివశాస్త్రి. తెలుఁగున ప్రబంధాంకము మూర్తికవి నరసరాజున కంకితముగా రచియించిన 'కావ్యా

లంకార సంగ్రహమునందలి రసప్రకరణమునకు (తృతీయాశ్వాసమునకు) ఇది తెలుఁగుసేత. రసమునకు సంబంధించి యుండుటచే ద్వితీయాశ్వాసమునందలి నాయికా స్వరూప, విశేషములు నిందు సమూలముగ వివరింపఁబడినవి. ఈ టీకయందు మూర్తికవి గ్రంథములోని తప్పులు, వానికి సవరణలును కలవు.

## కావ్యాలంకారసూత్రవృత్తి

ముద్రితము. కర్త: శ్రీ వేదాల తిరువేంగళాచార్యులు. సంస్కృతమున వామనాచార్యుఁడు రచియించిన ప్రాచీనాలంకారగ్రంథ మగు కావ్యాలంకారసూత్రవృత్తి కిది యనువాదము. మూలమునందువలె నే యిందును సూత్రము, వివృతి వచనముగఁ గలవు. ఉదాహరణములు వివిధము లగు ప్రాచీనాధునాతనాంధ్రగ్రంథములనుండి యొసఁగఁబడినవి.

## కువలయానందసారము

ముద్రితము. కర్త: శ్రీ బులుసు వేంకటరమణయ్య. సంస్కృతమున అప్పయదీక్షితులు రచించిన కువలయానందమున కిది తెలుఁగుసేత. మూలమునందువలె నిందు లక్షణములు పద్యమునను, వివరణము గద్యమునను గలదు. ఉదాహరణములు చాలవఱకు ప్రాచీనాధునాతనాంధ్ర ప్రబంధములనుండి యీయఁబడినవి. కొన్ని చాటువులు, కొన్ని మూలమున కనువాదములు. ఇందు పయికువలయానందములోని నూఱలంకారములే వివరింపఁబడినవి. వానిలోని శాస్త్రచర్చలు-తెలుఁగునకు సంబంధించినంతవఱకు వివరింపఁబడినవి.

## గంధవహము

అముద్రితము. మంచెళ్ళ వాసుదేవకవి.

## నవరసగంగాధరము

ముద్రితము. జమ్మలమడక మాధవరామశర్మగారు రచించినది. జగన్నాథ పండితరాజు రచించిన సంస్కృతగ్రంథమునకు రూపాంతరముగు ననువాదము.

## చంద్రాలోకము

ముద్రితము. కర్త: తాడూరి లక్ష్మీనరసింహరావు. అప్పయదీక్షితుల కువలయానంద (మూల) కారికల కిది యాంధ్రానువాదము. (పద్యరూపము.) ఇందలి విషయ మర్థాలంకార వివేచనము.

## తెలుఁగు కావ్యాదర్శము

ముద్రితము. కర్త: అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి. దండి సంస్కృతమున రచించిన కావ్యాదర్శమున కనువాదము. మూలమువలె నిదియు పద్యరూపము. మూలమునందలి విషయము లన్నియు ననువాదమునఁ గలవు

## నంజరాజయశోభూషణము

## ప్రతాపరుద్రీయము

గుంటరఘు వేంకటకవి.

## రసమంజరి

గోపరాజు వెంకటకవి.

## నాటకలక్షణము

ముద్రితము. కర్త: శృంగారకవి సర్వారాయుఁడు. నాటకలక్షణమును వివరించు గ్రంథము.

## భరతరసప్రకరణము

ముద్రితము. కర్త: తిరువెంకటాచార్యులు. భరతగదిత మగు రసవిషయము ఇందుఁ గలదు.

## రసమంజరి

ముద్రితము. కర్త: తాడూరి లక్ష్మీనరసింహరావు. భానుదత్తుని కృతికి తెలిగింపు. ఇందు శృంగారరసమున కనుగుణు లగు నాయికానాయకుల స్వరూపము వివరింపఁబడినది.

## రసమంజరి

అముద్రితము. కర్త: వేదము వేంకటరాయశాస్త్రి. ఇదియు పయిభానుదత్తకృతికి తెనిఁగింపే.

## చంద్రాలోకవివృతి

ముద్రితము. కర్త: అక్కిరాజు ఉమాకాంతము. దీక్షితుల కువలయానంద (మూల) కారికల కాంధ్రానువాదము. వచనమున 'చంద్రాలోకము' తోను, అడిదము సూరకవి 'ఆంధ్ర చంద్రాలోకము' తోను కూడఁ జేర్చి ముద్రింపఁబడినది.

## రసభావనాయికాసంప్రదాయములు

ముద్రితము. కర్త: శ్రీ పుల్లేపు నాగభూషణము. రసము, భావము, నాయిక మొ. సంప్రదాయము లేవో యిందుఁ గలవు.

తెనుగు తోబుట్టువులు :

# తమిళ నాటకాలు

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారు.

తమిళలాక్షణికులు తమ భాషను ఇయల్, ఇశై, నాటకం అని మూడు తెఱంగుల విభజించి యున్నారు. ఇయల్ తమిళమును ఇయఱ్ఱమిழ் అనియు, ఇశైత్తమిழ் అనియు, నాటక తమిళమును నాటకత్తమిழ் అనియు వ్యవహరింతురు. గద్యపద్య (ఇయల్) కావ్యములందు వ్యవహృతమగు భాషకే ఇయఱ్ఱమిழ் అని పేరు. ఛందోలక్షణశాస్త్రములు, వ్యాఖ్యాన గ్రంథములు మున్నగునవి గద్యపద్యవర్గమున చేరును. రాగతాళలయాన్వితమై గానానుకూలమైన భాషను ఇశై (సంగీతము) త్తమిழ் అని పేర్కొనిరి. ఈ భాష కేవలము పాటలలోను పదములలోను వాడబడును. తేవారము, రామాయణ కీర్తనలు, కందపురాణ కీర్తనలు మున్నగునవి ఇశైత్తమిళములో పాడబడినవే. సంగకాలమున సంతరింపబడిన సంగీతగ్రంథములన్నియు-ఇశైనుణుక్కం, పెరునారై, పెరుంగురుగు, తాళవగై మొదలగునవి-కాలగర్భమునందు కలసిపోయెనని తమిళపండితులు నుడువుదురు. ఇయల్, ఇశై తమిళములు రెండును సమ్మిశ్రితములైనభాషకు నాటకత్తమిழ் అని పేరు. నాటక గ్రంథములందే యీ తమిళము వ్యవహృతమగుచుండును.

సంగయుగమునందే నాటకత్తమిళములో గ్రంథములనేకములు వెలసెననియు, కాని యవి యన్నియు దురదృష్టవశమున రూపుమాసెననియు తమిళపండితులు విశ్వసించుచున్నారు. భరతం, అగత్తియం, ముఱువల్, జయంతం, సెయిఱ్ఱియం, గుణనూల్, మదివాణర్ నాటకత్తమిழ்నూల్, కూత్తునూల్ — మున్నగునవి ప్రాచీన తమిళనాటక గ్రంథములు. అనఁగా నాటకలక్షణములను తెలియజేయు గ్రంథములు. ఇవి యన్నియు నేడలభ్యములు. కాని ఆయా గ్రంథములందలి కొన్ని సూత్రములు మాత్రముపలభ్యము లయినవి. ఈ విషయాదికమును సిలప్పదికారమునకు వ్యాఖ్యానగ్రంథమును వెల

(83 వ పుట తరువాయి)

### రసికజనానందము

ముద్రితము. కర్త: పో. నరసింహరావుగారు. రసవిషయ మిందుఁ బ్రతిపాదితము.

### సాహిత్యచింతామణి

ముద్రితము. కర్త: తి. ఈ. శ్రీనివాసాచార్యులు. వచనము. కువలయానంద (మూల) కారికలలోని విషయ మిందుఁ గలదు.

### సంస్కృతాలంకారచరిత్రము

ప్రథమభాగము. ముద్రితము. కర్త: మేడేపల్లి వేంకటరమణాచార్యులు. సంస్కృతమునందలి యాలంకారికుల యొక్కయు, అలంకారవాఙ్మయముయొక్కయుఁ జరిత్ర మిందుఁ గొంతవఱకుఁ గలదు.

కేవలము అలంకారశాస్త్రగ్రంథము కాదు. ఇది కాక సారస్వతమును విమర్శించుచు, సందర్భానుసారము కావ్యాంగములను వివరించు గ్రంథములు అనేకము లాంధ్రసారస్వతమున వెలసినవి. వాని యుత్పత్తికి పాశ్చాత్యభాషా వాఙ్మయ సంప్రదాయముల నాంధ్రభాషా వాఙ్మయముల సంప్రదాయములతో సరిపోల్చుట, సరిపోల్చి మంచిచెడుగులను వివరించుట ముఖ్యము లగు కారణములు. అట్టి విమర్శగ్రంథములలోఁ గొన్ని ప్రాచీన సంప్రదాయముల పైనే ఆధారపడినవి; కొన్ని ప్రాచీనసంప్రదాయములను పూర్తిగ నిరసించునవి. కొన్ని దేశ, కాల, పాత్రానుగుణముగ ప్రాచీనపద్ధతులను సంస్కరించి వాఙ్మయమునకు నవ్యతఁ గూర్పఁజాలినవి.

పయి విమర్శగ్రంథములు బహుముఖములు. వాని నన్నింటిని అలంకారవాఙ్మయచరిత్రమే ప్రధానముగఁ గల యీ గ్రంథమున వివరించుట యప్రస్తుతము.

యించిన అడియార్కు నల్లార్[1] అను నతడు తన గ్రంథమునందు వెల్లడి చేసెను. కనుక తమిళ పండితుల యభిప్రాయము ప్రకారము తమిళ నాటక వాఙ్మయము క్రీ. పూ. 3 వ శతాబ్ది యందే పరాకాష్ఠ నందియుండె నని నుడువ వలసి యున్నది.[2]

తమిళ నాటక వాఙ్మయ పరిణామమును పరిశీలించుటకు మున్ముందు వాదోపవాదములకు గురియైన నాటక శబ్దమును గురించి ప్రస్తావించుట సమంజసముగ నుండును. నాటక మనునది సంస్కృతశబ్దము. ఆర్యుల ప్రాబల్యము దక్షిణాపథమున విస్తృతమగుకొలది, సంస్కృత భాషావాఙ్మయములతో తమిళులకు పరిచయము కలుగజొచ్చెను. కనుక ఆర్యసంపర్కమునకు పిమ్మటనే నాటకములు తమిళ నాడులో ప్రచారమునకు రాదొడగెనను వాదమొకటి కలదు. ఈ వాదమున సామంజస్యము లేదని తమిళ భాషాభిమానులు నుడువుదురు. తమిళములో 'కూత్తు' అనుమాట కలదు. ఇదియే తొలుదొలుత నాటక మనునర్థమున ప్రయుక్త మగుచుండెను. ఇది రూపకమునకు సమానార్థకమైన తమిళశబ్దము. దశవిధరూపకములలో నాటకమొకటి అయినట్లుగా, పలువిధములైన కూత్తులలో నాటక మొకటి అని తమిళపండితుల యభిప్రాయము. నాటకవియల్[3] అను గ్రంథమున నాటకప్రకరణాదులగు దశవిధరూపకములే వివిధములగు కూత్తులుగా నుదాహరింపబడినవి. 'నాటక మనునది కథాశరీరము గల కూత్తు' అని శ్రీ వి. జి. సూర్యనారాయణ శాస్త్రిగారు పేర్కొనిరి.[4]

నాటక మనునది తమిళశబ్దమో కాదో యిత్థమిత్థమని తేల్చి చెప్పుట కొంత కష్టమే. కాని యొక్క విషయము మాత్రము నిస్సంశయముగ పేర్కొనదగును. తమిళకవులలో నాలుగు రకములవా రున్నట్లుగా ప్రాచీన తమిళ కావ్యములందు సూచింపబడినది. పాణర్, కూత్తార్, పొరునర్, విరలియార్-అని నాలుగు తెగలుగ కవులు విభజింపబడిరి. తమిళ రాజుల పరిపాలనాకాలములో తొలుత గాయకులుగ వ్యవహరింపబడుచుండిన పాణర్ విశేష గౌరవాభిమానములు పొందుచుండెడివారట. కాని తమిళ రాజుల యేలుబడి యంతమై పోయి ఆర్యుల ప్రాబల్య మెక్కువగుకొలది పాణర్ వర్గమునకు గౌరవము తగ్గజొచ్చెను. అంతే కాదు. పాణర్ వర్గము అంటరానిజాతిగా పరిగణింపబడసాగెను.[5] కావున వీరు గ్రామ పొలిమేరలయందు నివసింపజొచ్చిరి. నటకులైనవారికి కూత్తార్ అను వ్యవహారనామ మేర్పడెను. వీరుకూడ గాయకులే. కాని నాటకములు వేయుచుండెడివారు.[6] కనుకనే వీరికి కూత్తార్

1. ఇతడు క్రీ. శ. 12 వ శతాబ్ది యుత్తరార్ధమున జీవించినట్లు భావింపబడుచున్నది. ఇతని శిలప్పదిగారం వ్యాఖ్యానగ్రంథము చాల ప్రశస్తమైనది.

2. కీర్తిశేషులు శ్రీ వి. జి. సూర్యనారాయణ శాస్త్రిగారి 'నాటకవియల్' అను గ్రంథమునందలి యుపోద్ఘాతము చూడుడు. శ్రీ శాస్త్రిగారు చెన్నపురి క్రైస్తవ కళాశాలయందు తమిళ పండితులుగ నుండిరి. వీరు గొప్ప పండితులు. కళావతి, మాన విజయం, తమిళ్మొళి వరలాఱు - మున్నగునవి వీరి గ్రంథములలో ముఖ్యములు.

3. ఇది నాటకలక్షణములను తెలియజేయు తమిళపద్య గ్రంథము. సంస్కృతదశరూపకము ననుసరించి యిది వ్రాయబడినది. అనువాద మన్నను సాహసము కాదు. ఈ గ్రంథమును సంతరించినవారు శ్రీ. వి. జి. సూర్యనారాయణశాస్త్రిగారు. స. బలరామ అయ్యరుగారీ గ్రంథమునకు వివరణము వెలయించిరి.

4. చూడుడు. 'తమిళ్మొళి వరలాఱు' పుట. 56.

5. చూడుడు. శ్రీ పి. టి. శ్రీనివాస అయ్యంగారు గారి 'History of the Tamils' పుట. 16.

6. వివరములు కోరువారు శ్రీ వి. కనకసభై పిళ్లైగారి 'The Tamils : Eighteen Hundred years Ago' అను గ్రంథమును చూడగోరెదను.

అను పేరు కలిగెను. నేటి నాటకములవంటివి కాక వేషములు వేసికొని పెక్కువిధమైన యాటల నాడెడివారట. ఈ విషయము తమిళ నాడులో ప్రాచీనకాలమున గూడ నాటకము ప్రచారములో నున్నట్లు తెలివిడి చేయుచున్నది.

ఇక తమిళ నాటక ప్రాదుర్భావమును గమనింతము. దేవోత్సవాగులందు సంస్కృత నాటకములు ప్రదర్శితము లగుచుండెడి వని మనకు సువ్యక్తమే. అటులనే, దేవోత్సవసమయము లందు జరపబడెడి యాటపాటలే తుదకు నాటకమునకు దారితీసిన వని తమిళపండితులును తలచుచున్నారు. ఈ ఆటపాటల కలయికయే నాటకమున కావశ్యకమైనది. తొలుదొలుత నిట్టి నాటకములందు కథతోడి సంభాషణములు లేవనియు, అవి కాలక్రమముననే యేర్పడె ననియు వారు విశ్వసించుచున్నారు. ఆ సంభాషణలు కూడ తొలుత పద్యరూపముననే యుండెడివి. పిమ్మట నాటకతమిళమున వేత్తియల్, పొదువియల్ అని రెండు విభాగము లేర్పడెను. రాజులచే నాదరింపబడిన నాటకములు 'వేత్తియల్' అనియు, సామాన్యప్రజలచే నాదరింపబడిన నాటకములు 'పొదువియల్' అనియు వ్యవహృతములు కాదొడగెను.

ఇటుల సామాన్యులచే సైతము పోషింపబడుచుండిన తమిళ నాటక వాఙ్మయము జైన బౌద్ధుల సంపర్కముతో పతనావస్థకు పాల్పడెను. నాటకములవలన కామోద్రేకము కలుగు ననియు, తత్ఫలితముగ ధర్మహాని సంభవించి నను సంభవింపవచ్చు ననియు తలచి జైనమతాచార్యులు నాటకప్రదర్శనములను నిరసింపజొచ్చిరి. అప్పటి తమిళ రాజులు జైనుల యాదేశమును శిరసావహించి నాటకములను ప్రోత్సహించుట మానివైచిరి. ఈ హేతువులచే తమిళ నాటక వాఙ్మయము కుంటుపడె ననియు, జైన బౌద్ధుల ప్రాబల్యమునకు పిమ్మట సంతరింపబడిన కావ్యములు (సిలప్పదిగారం మణిమేకలై మున్నగునవి) తమిళనాడులో బహుళప్రచారము గడించిన వనియు శ్రీ సూర్యనారాయణ శాస్త్రిగారు పేర్కొనిరి.[1]

ఆర్యుల (జైనులు) సంపర్కమునకు పిమ్మట గూడ తమిళనాడులో నాటకము గౌరవాభిమానములు చూరగొనుచు ప్రచారములో నున్నట్లు చెప్పుట సత్యసంపూర్ణము గాకున్నను, అది నిజమునకు దగ్గరగానే యుండును. ఏలయన, జైనబౌద్ధాచార్యుల కాలమున వెలసిన గ్రంథములలో పేర్కొనదగినదియు, తమిళ పంచకావ్యములలో నొకటియు నైన సిలప్పదిగారమునకు [2]'ఇయల్, ఇసై, నాటక పొరుళ్ తొడర్నిలై సెయ్యుళ్' అనియు 'నాటక కాప్పియం' అనియు నామాంతరములు కలవు. కనుకనే యీ కావ్యము నాటకముగా సంతరింపబడిన పద్యగ్రంథ మని ప్రసిద్ధి కెక్కినది. నాటకకథనమే అనగా సరససంభాషణశైలియే సి ప్పదికారమునకు వన్నెలు చిన్నెలు సమకూర్చి యేతత్కావ్యశోభకు సాయపడినది. ఇట్టి యుద్గ్రంథమును తొలుదొలుత వెలుగులోనికి తెచ్చిన మహనీయులు పండిత ప్రభాకరులైన మహామహోపాధ్యాయ డాక్టర్ శ్రీ ఉ. వే. స్వామినాథ అయ్యరుగారు. సిలప్పదికారమున పుహార్ (కావేరీ పూంపట్టణము) ఖండములో 'అరంగేట్రుగాదై' అనునధ్యాయ మొకటి కలదు. ఇది యానాటి నాటకరంగస్థలమును కన్నులకు కట్టునట్లుగా నభివర్ణించుచున్నది. మాధవి యను వేశ్యాంగన చోళమహీపతి యాస్థానమునందలి సభామండపమునందు నిర్మితమైన వేదికపై నృత్యము సలుపును. తదవసరమున సిలప్పదిగార కర్తయైన ఇళంగో అడిగళ్ రంగస్థలమును వర్ణించుచున్నాడు. కవి, సంగీత నాట్యాచార్యులు, వైణికుడు—మున్నగువారిని గూడ ప్రశంసించియున్నాడు. ఆయా కథా సన్నివేశములందు సందర్భోచితమైన భావనుగూడ వాడియున్నాడు. అనగా వివిధము లగుఛందస్సుల నుపయోగించి శైలీవైవిధ్యమును కవి

---

1. చూడుడు 'తమిళ్ కొండ్రియిన్ వరలాఱు' పుటలు. 50-53.

2. సిలంబు+అదికారము = సిలప్పదికారం.

సిలంబు అనగా మంజీరము. దీనికి సంబంధించినగాథ కావున నీ గ్రంథమునకీ పేరు కలిగెను. ఈగ్రంథము ఇళంగో అడిగళ్ అను రాజకవిచే వ్రాయబడినది. ఈ కథావివరములు కోరువారు నా 'మణిమంజీరము'ను జూడఁగోరెదను.

ప్రదర్శించినాడు. కావుననే యీ గ్రంథము నాటకకావ్య మని పేర్కొనబడుట. నాడు నాటికిగూడ దీనికి బహుళప్రచారము గలదు. కనుక జైనబౌద్ధుల కాలములోగూడ నాటకము కొంతవఱకు ప్రచారములో నున్నట్లు తెలియుచున్నది.

నాటకధోరణిలో వ్రాయబడిన యీ సిలప్పదికారమును మినహాయించినచో తమిళములో 18 వ శతాబ్దము పూర్వార్ధమువఱకు నాటకగ్రంథములు లేవనియే నుడువుట లెస్సగ నుండును. చాలవఱకు గానప్రధానములును, కొంతవఱకు నభినయయోగ్యములు నైన యక్షగాన రచనలీ యుగమునుండి వ్యాప్తిలోనికి రాదొడగినవి. ఈ గాన ప్రధాన రచనలు నాటకములు కావు. కాని వీనిని నాటకమాత్రుక లనదగును. ఈ యక్షగాన రచనములలో పేర్కొనదగినవి శీర్కాళి అరుణాచలకవిరాయని[1] రామనాటకం, కుమరగురు పరస్వామి వారి మీనాక్షియమ్మైక్కుఱం, రాజప్ప కవిరాయని[2] కుట్రాలక్కుఱవంజి - మున్నగునవి: కుఱవంజి, పళ్లు (ముక్కూడర్ పళ్లు) అనునవి పరభాషా సంపర్కము గవ్వంతయు లేని తమిళ నాటక భేదములు. అనగా నివి నిక్కమైన దేశిరచనలు కుఱవంజి యనునది వీథినాటకము. దీనిని ప్రదర్శించుటకు ప్రత్యేకరంగస్థల మనవసరము. ఇందలి గాథ ప్రణయమునకు సంబంధించినదిగానే సాధారణముగ నుండును. జీవుడు పరమాత్మను కనుగొనువిధమును, ప్రియుడు తన ప్రేయసిని కనుగొనువిధమును నిందు మనోజ్ఞముగ చిత్రింపబడును. ఈ వీథీనాటకము నందలి శిల్పసామర్థ్య మంతయు కురత్తి పాత్రప్రవేశములోనే యుండును. ఈమె (సింగి) ప్రియుని (సింగుడు) వెదకికొనును. వీరి మాటలలో పవిత్రప్రేమ ద్యోతకమగుటయే గాక శాత్త్వికరహాస్యములు కూడ దొరలుచుండును.[3]

ఇక 'పళ్లు'ను గూడ గమనింతము. ఇందు సవతుల కయ్యము చిలువలు పలువలుగా చెప్పబడును ఇందలి కథ సర్వసాధారణముగ నీ క్రింది విధముగ నుండును ఒక పురుషుని (పళ్లన్)కి యిద్దరు భార్యలుందురు. ఒకామె శైవమతిస్థురాలు. మఱియొకతె వైష్ణవాంగన. వారిరువురి మధ్య పచ్చిగడ్డి వేసిన భగ్గున మండును. ఇద్దఱికి పొత్తు కుదురదు. భర్త చిన్నభార్య వలలో చిక్కియున్నాడని నిశ్చయించి పెద్దభార్య తన మగనిపై నేరములు మోపును. అందుల కతడు శిక్షింపబడును. అతని శిక్షితుడగుట జూచి సహింపజాలక పెద్దభార్య న్యాయనిర్ణేతను సమీపించి తన తప్పిదమును తేటజేసి భర్తను విడిచిపెట్టుడని కోరును. పిమ్మట న్యాయనిర్ణేత యభిమతము ననుసరించి సవతులిరువురు తాము కలహము లాడక తమ భర్తతో సఖ్యముగ కాపురము చేయుదు మని నుడువుదురు. అటుల వారు రాజీపడిన పిదప పళ్లన్ విముదల చేయబడును. అటుపిమ్మట భార్యలతో నతడు జీవితాంతము సౌఖ్యముగ నుండును. ఈ పళ్లు రచనములలో ముక్కూడల్ పళ్లు, శివశైలపళ్లు మున్నగునవి పేర్కొనదగినవి.

దేశినాటకము లనదగిన యీ కుఱవంజి, పళ్లు కూత్తులు నేటికిని తమిళనాడులో ప్రచారమున నున్నవి. ఇవి మన వీథినాటకముల వంటివి. కాగా, ఆధునిక ద్రావిడ నాటక ప్రాదుర్భావమునకు కారణము సంస్కృతాంగ్ల భాషా వాఙ్మయములతోడి పరిచయమే యని నిస్సంశయముగ నుడువదగును. షేక్స్పియర్ మహానాటకకర్తకు 'ప్లూటార్క్స్ లైవ్స్' (Plutarch's Lives) యెట్లు తోడ్పడెనో, అటులనే నాడు నాటికి గూడ మన భారతీయ నాటకకర్తలకు రామాయణ మహాభారతములు తోడ్పడినవి; తోడ్పడుచున్నవి. కనుకనే మన పెద్దలు సంస్కృతనాటకములను రామాయణ నాటకము లనియు, భారతనాటకము లనియు విభజించిరి. ఈ విభజన మెంతయు సమంజస

1. ఇతడు ప్రసిద్ధతమిళకవులలో నొకడు. సంస్కృతాంధ్ర తమిళములలోగూడ నితడు ప్రసిద్ధుడనియే తమిళపండితులు విశ్వసించుచున్నారు. అశోముఖి నాటకం, సీకాళి పురాణం, సీకాళిక్కోవై - అనునవి యీతని మఱికొన్ని రచనములు.

2. ఇతడు కుట్రాలం నివాసస్థుడు. ఇతని కుట్రాల కుఱవంజికి బహుళజనాదరణము గలదు. కుట్రాలతలపురాణం, కుట్రాలఉలా — మున్నగునవి యితని రచనములు:

3. వివరములకు చూడుడు. శ్రీ యం. యస్. పూర్ణలింగం పిళ్లై గారి తమిళవాఙ్మయచరిత్ర.

ముగ నున్నది. ఇటులనే తమిళమున తొలి నాళ్లలో వెలసిన నాటకములను గూడ రెండు భాగములుగ విభజింపనగును. స్వామినాథపిళ్ళె గారి రామనాటకం, కందయ్యాపిళ్ళె గారి రామవిలాసం, భవానందంపిళ్ళె గారి సీతాకళ్యాణం-మున్నగునవి యన్నియు రామాయణ నాటకములు. గణపతి అయ్యరుగారి అభిమన్యు నాటకం, నాగేశ అయ్యరుగారి అర్జున నాటకం, రామస్వామి అయ్యరుగారి అల్లినాటకం-మున్నగునవి భారతనాటకములు.

ఇటుల రామాయణభారతములనుండి పలు కథలను గ్రహించి పౌరాణిక నాటకములు పెక్కులు వ్రాయబడినవి. కాని నేడివి యన్నియు నామమాత్రములుగానే యున్నవి. అరుణాచల కవిరాయని రామనాటకము మాత్రము నేటికిని గూడ విశేషప్రచారములో నున్నదనియే చెప్పవలయును.

ఈ సందర్భమున నవాబ్ రాజమాణిక్యం పిళ్ళె గారిని గురించి నుడువుట సమంజసముగ నుండును. ఏలయన నేడును తమిళనాడులో పౌరాణికగాథలతోడి నాటకములు ప్రజాదరణము పొందుచున్నవని నుడివినచో నందులకు కారణభూతులు శ్రీ పిళ్ళెగారు. వీరి నాటకములు చలనచిత్రములను దలపించుచుండును. వీరు రంగాలంకరణమునకై సలుపు కృషి ప్రశంసనీయము. రంగస్థలముపై ప్రపంచమునే కన్నులకు కట్టునట్లుగా సృష్టింపగల సమర్థులు వీరు. వీరి నాటకములలో నన్నాకర్షించినది రామదాసు నాటకము. ఇందు వీరు నవాబు వేషము ధరింతురు. కావుననే వీరికి నవాబను వ్యవహారనామ మేర్పడెను.

తెనుగులోవలె తమిళమునందును కొన్ని సంస్కృతానువాద నాటకములు కలవు. వానిలో పేర్కొనదగినది 'మణ్ణియల్ సిరుతేర్' అనునది. ఇది మృచ్ఛకటికమునకు తమిళమున జేయబడిన యనువాద నాటకము. దీనిని పండితమణి శ్రీ కదిరేశన్ సెట్టిగారు సంతరించిరి. షేక్స్పియర్ నాటకములు కూడ కొన్ని తమిళము చేయబడినవి. శ్రీ యస్. వి. కళ్లప్పిరాన్ పిళ్ళె గారు Merchant of Venice ను తమిళము చేసి తరువాతివారికి మార్గదర్శకులయిరి. సింబలిన్ కూడ తమిళము చేయబడినది. ఇట్టి యనువాద నాటకములు వెలసినపిమ్మటనే తమిళములో స్వతంత్ర నాటకములు బయలుదేరినవి. కనుక తమిళ నాటక వాఙ్మయమున నూతనాధ్యాయము ప్రారంభ మగుటకు నీ సంస్కృతాంగ్ల నాటకములు చాల వఱకు సహాయపడినవని చెప్పనగును.

ఆంగ్ల నాటకముల ననుసరించి రచియింపబడిన నాటకములలో మనోన్మణీయము చాల ముఖ్యమయినది. దీనిని వ్రాసినవారు రావుబహదూరు శ్రీ పి. సుందరంపిళ్ళె గారు M. A. వీరు లార్డ్ లిట్టన్ కృతి యగు 'Lost Tales of Miletus' నుండి కథను గ్రహించి నాటకము సంతరించిరి. షేక్స్పియర్ అడుగుజాడలలో నడచిన శ్రీ పిళ్ళె గారు పద్యరూపముననే తమ నాటకమును వ్రాసిరి. ఈ నాటక మొక్కటే సాహిత్యదృక్పథముతో జూచినను మహోత్కృష్ట మని తమిళపండితులు నమ్ముచున్నారు. ఇది పెక్కు ముద్రణల నొందియున్నది. విశ్వవిద్యాలయ పరీక్షలకు గూడ నీ నాటకము నుండి కొన్ని భాగములు పాఠ్యములుగ నిర్ణయింపబడుచున్నవి. నేటివఱకు నాటకము లెన్నియో తమిళములో వెలసినవిగదా! అయినను మనోన్మణీయ మొక్కటియే సాహిత్యపు విలువగల నాటక మని పండితుల విశ్వాసము.

శ్రీ వి. జి. సూర్యనారాయణ శాస్త్రిగారు కూడ పేరు గడించిన నాటకకర్త. రూపావతి, కళావతి, మానవిజయం-అను నాటకములు వీరు రచియించిరి. విస్మృతసామ్రాజ్య మైన విజయనగరమునకు సంబంధించిన నాటకము నొకటి శ్రీ వరదరాజ అయ్యంగారు రచియించిరి. దీని పేరు 'మఱైన్దమానగరం.' చరిత్రాత్మక నాటకములందిది పేర్కొనదగినది. కాని యీ నాటకము లన్నియు నేడు ప్రదర్శింపబడుట లేదు.

ఈ సందర్భమున రావుబహదూరు శ్రీ పి. సంబంధ మదలియారుగారిని గురించి ప్రశంస సెలుపకున్నచో ఈ వ్యాస మసమగ్రముగనే యుండును. వీరు శ్రీ బళ్లారి రాఘవాచార్యులు గారి సమకాలికులు. శ్రీ మదలియారుగారు స్వయముగ నటకులును నాటక గ్రంథకర్తలును. వీరు చాల నాటకములు రచియించిరి. అందు కొన్ని పౌరాణికములు. మఱికొన్ని సాంఘికములు. సంఘమునందలి బాగోగులను సునిశితముగ విమర్శించుచు వీరు నాటకములు సంతరించిరి. అట్టి నాటకములందు సభాపతి

పేర్కొనదగినది. ఈ నాటకము పలుమారులు ప్రదర్శింపబడినది. ఇందు తమిళ పండితుల ఛాందసత్వము చక్కగ నిరూపింపబడినది. హాస్యరసపూరితము లైన యిట్టి నాటకములు వ్యావహారిక తమిళమున రచియించి వీరు తమిళ నాటకమునకు క్రొత్త పుటలు చేర్చిరి. ఆధునిక నాటకకర్తలలో శ్రీ ముదలియారుగారే పేర్కొనదగినవారు.

వీరికి పిమ్మట నుడువదగినవారు శ్రీ కె. ఎ.పి. విశ్వనాథన్ గారు. వీరి నాటకములు కూడ సాహిత్యదృష్ట్యా చూచినను మహోత్కృష్టము అని తమిళపండితులు నుడువుదురు. వీరి రేడియో నాటికలుకూడ ప్రశంసాపాత్రములే. శ్రీ శివ కుప్పుస్వామి పిళ్లై అనువారు కూడ పేరెన్నిక గన్న నాటకకర్తలలో నొకరు. వీరెల్లరు కొంతవఱకు ప్రాచీనసంస్కృతియందు గౌరవాభిమానములు కలవారు. వీరి రచనములందు భాషాసౌష్ఠవము గూడ గలదు. కాని తమిళ పండితులు మాత్రము 'మనోన్మణీయ' మొక్కటియే సాహిత్యప్రధాన మైననాటక మని (ఇలక్కియ నాటగం) భావించుచున్నారు.

ఇక అతినవ్యులు లేక విప్లవవాదు లనబడు శ్రీ అణ్ణాదురై ప్రభృతుల నాటకములను గూడ పరిశీలింతము. శ్రీ సి. యన్. అణ్ణాదురై రాజకీయవాది యగుటచే తన నాటకములను రాజకీయ ప్రయోజనములను సాధించుటకు వినియోగించు కొనుచున్నాడు. కళ యొక యాయుధ మనువాదమునందు ప్రగాఢవిశ్వాస మున్నవాడీయన. కావున నీతని నాటకములందు పూర్వాచారఖండన, నాస్తికతాభావములు మున్నగునవి ప్రస్ఫుటముగ కనబడుచుండును. అయినను శ్రీ అణ్ణాదురై ప్రభృతు లుపయోగించు భాష మాత్రము విలక్షణ మైనది. శబ్దాలంకారముల తోడను, అనుప్రాసలతోడను వీరి నాటకము లందు సంభాషణలు సాగిపోవుచుండును. శబ్ద ప్రధాన మైన యీసంభాషణరచనావిధానమే కొంతవఱకు నీ నాటకముల బహుళప్రచారమునకు హేతుభూత మైనది.

ఉపసంహారమున తమిళనాటక వాఙ్మయమునుగుఱించి రెండుమాటలు నుడువవలసి యున్నది. నాటకవాఙ్మయము బహుప్రాచీన కాలముననే తమిళనాడులో ప్రచారమునందెను. కాని యప్పటి గ్రంథము లన్నియునేడుపలభ్యములు కాకపోవుటచే మన కప్పటి నాటకములనుగుఱించి తెలిసికొనుటకు వీలు కలుగుట లేదు. మన దురదృష్టవశమున భాషాపోషకు లైన మన రాజులుకూడ నాటకములకు తగినంత ప్రోత్సాహ మొసగలేదు. జైనబౌద్ధాచార్యుల కాలమున నాటకములకు ప్రోత్సాహము లేకుండుటకు గలకారణమును మన మూహింపవచ్చును గాని తరువాతి కాలమున గూడ నాటకమునకు రాజాశ్రయము లభింపకపోవుట మిక్కిలి శోచనీయము కనుక నే నాటకము ప్రజల నాశ్రయించినది. ఆటపాటలు, జానపదులు దేశినాటకములను నేటివఱకు సంరక్షించి రనియే నుడువదగును. వారి యాదరణము గూడ లేకపోయినచో మనకు యక్షగానములు (కురవంజులు) వీథినాటకములు (కూత్తులు) లభించియుండెడివి కావు.

ఇక ఆంగ్లభాషావాఙ్మయముల పరిచయ భాగ్యము లభించిన పిమ్మటనే తమిళవాఙ్మయమున నిజమైన నాటకములు బయల్వెడలినవి. తెనుగులో కూడ యక్షగానములను మినహాయించినచో ప్రాచీనకాలమున నాటకములు లేవనియే చెప్పవలయును. మనకు సంస్కృత వాఙ్మయ మున్నది కావున, అనువాద నాటకము లైనను గలవు. అవియైనను ప్రాచీనులచే తెలుగు చేయబడలేదుగదా! కాని నేటి తెనుగు నాటక వాఙ్మయమును, తమిళ నాటకవాఙ్మయముతో పోల్చి చూచినచో, మన నాటకవాఙ్మయమందలి వైశిష్ట్యము తప్పక గోచరింపగలదు. ఇపుడిపుడు తమిళమున పేర్కొనదగిన నాటకములు ప్రచారమునకు వచ్చుచున్నవి. మొత్తముమీద తమిళులను, తెనుగువార మైన మనమును నాటక వాఙ్మయమున నింకను వెనుక పడియున్నామనియే నా విశ్వాసము.

———

# భరతవాక్యము

శ్రీ పోణంగి శ్రీరామఅప్పారావుగారు.



సంస్కృతనాటకపరిచయము కలవారం దఱికిని 'భరతవాక్యము' అనునది పరిచితమైనదే. పెక్కు నాటకములందు నాయకుడే [1] ఈ భరతవాక్యమును (నాటకము చివర నుండెడి మంగళశ్లోకము) [2] పఠించుచున్నాడు. [3] కొన్నింటియందు మఱియొక ఉత్తమపాత్ర [4] పఠించుచుండును, మఱికొన్నింటియందు భరతవాక్యమే కన్పట్టుట లేదు. [5] భరతవాక్యము గల నాటకములందు (ముద్రితగ్రంథములు) 'భరతవాక్యము' అనుపదము నాటకాంతమున గల మంగళశ్లోకమునకు వెనుక నుండెడి 'తథాపీద మస్తు' అను వాక్యములో కలసిపోయి కాని, ఆ వాక్యమునకు క్రింది శ్లోకమునకు మధ్య విడిగా గాని, కుండలీకరణమందు గాని కనబడుచుండును. భరతవాక్యమే లేని నాటకముల సంఖ్య అత్యల్పము. ఈ మంగళశ్లోకము అంతమం దున్నను కొన్ని నాటకములందు 'భరతవాక్యము' అనుపదము ఉండుట లేదు. [6] ఇంక తక్కిన వానియందు అధస్సూచికలలో (కొన్ని వ్రాతప్రతులయందు మాత్రమే కనిపించుచు, తక్కిన వానియందు లేకపోవుటచేత [7] ప్రక్షిప్తమను నభిప్రాయముతో) పాఠాంతరముగా మాత్రమే ఈయబడుచున్నది. ఇట్లు నాటకములందు 'భరతవాక్య' స్వభావము, ప్రయోజనము అనిర్దిష్టముగా నున్నవి.

శాస్త్రగ్రంథములు కూడ దీని స్వరూపమును వివరించుట లేదు. 6000 శ్లోకప్రమాణము గలదై, సమస్తనాటకవిషయములను సవిస్తరముగా నిర్దేశించుచు, క్రీస్తుశకారంభమున వెలసిన ప్రథమప్రామాణికగ్రంథ మగు నాట్యశాస్త్రమునందు 'భరతవాక్యము' అనుపదమే లేదు. 11 వ శతాబ్ది ప్రారంభమున శ్రీమదభినవగుప్త పాదాచార్య విరచిత మగు నాట్యశాస్త్ర వ్యాఖ్యాన మగు 'అభినవభారతి' యందు కూడ ఈ పదము లేదు. అంతియే కాక నాట్యవిషయములపై ప్రామాణిక గ్రంథములైన-దశరూపము (క్రీ. శ. 10 వ శతాబ్ది చివరిభాగము); భావప్రకాశము (12 వ శతాబ్ది); ప్రతాపరుద్రీయము (14 వ శతాబ్ది ప్రారంభము) సాహిత్యదర్పణము (14 వ శతాబ్ది మధ్యభాగము) మొదలగువానియందు కూడ 'భరతవాక్యము'

---

1. భరతవాక్యమును నాయకుడు పఠించుట ప్రచుర మగుటచేతనే 'భరతవాక్యమును పలికిన వాడే నాయకుడు' అనులోకోక్తి వ్యాప్తిలోనికి వచ్చినది.

2. ఈ మంగళశ్లోకమునకు 'ప్రశస్తి' యని పేరు. దీని స్వరూపమును ముందు వివరింతును.

3. 'భరతవాక్యమును పఠించుట' యనగా చివర నుండెడుమంగళ శ్లోకమును (ప్రశస్తిని) పఠించుట యని అర్థము-ఈ విషయమును - దీనిని నిజముగా ఎవ్వరు పఠింపవలయును అనెడివిషయమును-నిరూపించుటయే ఈ వ్యాసముయొక్క ఆశయము.

4. అశ్వఘోషుని 'శారిపుత్ర' ప్రకరణమందు నాయకుడు కానిబుద్ధుడు పఠించుచున్నాడు.

5. బోధాయనవిరచిత మగు 'భగవదజ్జుక' ప్రహసనమునందును, రామచంద్రవిరచిత మగు 'సత్యహరిశ్చంద్ర' యందును భరతవాక్యములు లేవు. సత్యహరిశ్చంద్రలో భరతవాక్యమును చదువుటకు నాయకుడు నిరాకరించుట యింకొక విశేషము.

6. ఇందులకు భాసుని నాటకములు కొన్ని ఉదాహరణములు (స్వప్నవాసవదత్తము॥).

7. ఇప్పుడు 'భరతవాక్యము'తో ముద్రింపబడిన నాటకములయొక్క కొన్ని ప్రాచీన ప్రతులయందుకూడ ఈ పదము కన్పించుట లేదు. క్రీ. శ. 1494 నాటి 'శాకుంతల' వ్రాతప్రతిలో (బెంగాలు దేశమునందలిది) ఈ పదము లేదని శ్రీ చింతాహరన్ చక్రవర్తి తెలుపుచున్నాడు. Indian Historical Quarterly Vol. V. P. 549.

అనుపదము కానరాక పోవుట ఆశ్చర్యమును కలిగింపక పోదు.

పైవిధముగా లక్షణగ్రంథములు భరతవాక్య విషయమున మౌనము వహించుటచేతను, [1]ఇంక లక్ష్యములు (నాటకములందు) భిన్నవిధములుగా నుండుటచేతను దీని నాజస్వరూపము ఇదమిత్థమని స్పష్టపడుట లేదు. ఇప్పుడీ వ్యాసములో దీని స్వరూప, స్వభావ, ప్రయోజనములను వివరించుటకు ప్రయత్నించుచున్నాను. ఈ వివరణమందీ క్రింది విషయములు చర్చనీయాంశములగును. (1) భరతవాక్యము నాటకమునకు సంబంధించినభాగమేనా? (2) ఈ పదము ఎట్లు, ఎప్పుడు ప్రచారములోనికి వచ్చినది? (3) దీని ప్రయోజన మేమి? (4) దీనిని ఎవ్వరు పఠింతురు? (5) ప్రశస్తితో దీనికి గలసంబంధ మెట్టిది?

ప్రతినాటకమును మంగళశ్లోకముతో ప్రారంభ మగునట్లే మంగళశ్లోకముతో అంత మగుటయు [2]సమీచీన మైనసంప్రదాయము. ప్రారంభమందలి శ్లోకమునకు 'నాంది' [3]యనియు, అంతమందలి శ్లోకమునకు 'ప్రశస్తి' యనియు పేరులు. నాందిని భరతుడీ క్రింది విధముగా నిర్వచించియున్నాడు.—

"ఆశీర్వచనసంయుక్తా
నిత్యం యస్మాత్ప్రయుజ్యతే
దేవద్విజనృపాదీనాం తస్మా
న్నాందీతి సంజ్ఞితా"

నిత్యమును దేవ, ద్విజ, నృపాద్యాశీర్వచన సంయుక్తముగా ప్రయుక్త మగును గాన దీనికి నాంది యను పేరు వచ్చినది. ఏవంగుణవిశిష్ట మైన నాంది తెరలో జరిగిపోవును. దీనిని సూత్రధారుడు పఠించుచుండును. నాట్యశాస్త్రమును బట్టి పూర్వరంగవిధిలోని భాగ మగు ఈ నాంది నాటకమునకు చెందినభాగము కాదు. దీనిని నాటకకర్త రచింపడు. ఆయాసందర్భముల ననుసరించి, తన నాటకసంఘమును దృష్టిలో పెట్టుకొని, సూత్రధారుడు స్వయముగా కల్పించుకొనుచుండును. [4]ప్రదర్శనప్రారంభమున నిర్విఘ్నపరిసమాప్తికై సూత్రధారుడు నాందిని పఠించునట్లే, నాటకకర్త కూడ గ్రంథనిర్విఘ్నపరిసమాప్తికై, తన నాటకమును మంగళవాక్యములతో ప్రారంభించును. అట్లు నాటకకర్తచేత రచింపబడినవే ఇప్పుడు ముద్రితనాటకములందు ఆరంభమున కనిపించెడి మంగళశ్లోకములు. [5]'నాద్యంతే తతః ప్రవిశతి సూత్రధారః' అని ఉండెడి నాటకములందు సూత్రధారుడు నాందిని తెరలో పఠించిన

1. రాఘవభట్టు శాకుంతల వ్యాఖ్యానములో ప్రతి వివరణమునకును ప్రమాణమును పేర్కొనుచుండును. (ఆదిభరతుని, భరతుని పెక్కుసార్లు పేర్కొనియున్నాడు.) భరతవాక్యమును గూర్చి కూడ ఏదేని ప్రమాణము ఉండియున్నచో తప్పక పేర్కొనియుండెడివాడే. అట్లు ప్రమాణ మేదియును లేదు. కావుననే తాను స్వయముగా వివరింపవలసి వచ్చినది. పెక్కురు వ్యాఖ్యాతలిట్లే చేసియున్నారు.

2. సాధారణముగా అశుభాంతము లైననాటకముల చివర ఇట్టి మంగళశ్లోకమునకు తావుండదు. కాని సమీచీన మైనసంప్రదాయము ననుసరించి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తమ 'నర్తనశాల' యందు ఆది అశుభాంత మైనను, సమాజ్ఞుని ప్రవేశపెట్టి, అతడు 'భరతవాక్యము'ను (చివరి శుభాశంసనపద్యము) పఠించునట్లు కల్పించుట గమనార్హము.

3. "నాద్యంతే తతః ప్రవిశతి సూత్రధారః" అనునప్పుడు కూడ అనగా నాందీపఠనము తెరలోనే జరిగిపోయినప్పటికిని, నాటకప్రారంభమందు ఏదో ఒక మంగళశ్లోకము (నాందివంటిదే) విధిగా ఉండును. అట్లే భరతవాక్యము అను పదము చివర లేకపోయినను మంగళశ్లోకము విధిగా ఉండును. మంగళశ్లోకములు లేనినాటకముల సంఖ్య అత్యల్ప మగుటచేత ఇది 'విధి' యనియే చెప్పవచ్చును.

4. ఇట్లు ప్రతినాటకసంఘమునకును ప్రత్యేకముగా నాందీశ్లోకము లుండును.

5. ఇవి కావ్యార్థసంసూచనాత్మకములుగా కూడ నుండుట మఱియొక విశేషము. సూత్రధారుడే నాందిని పఠించినతరువాత ఈ శ్లోకములను గూడ పఠించును. ఈ మంగళశ్లోకములు 'నాంది' కాదు. కావుననే వానియందు నాందీలక్షణము లన్నియును కన్పించుచుండవు.

పిమ్మట రంగస్థలముపైకి వచ్చి ఈ శ్లోకములను పఠించును. ఇంక 'నాంది' అను శీర్షికతో ప్రారంభ మయ్యెడి నాటకములందు సూత్రధారుడు తెరలోపల ప్రత్యేకముగా నాందిని పఠింప నక్కఱలేదు. [1] నాటకకర్త విరచితము లైనమంగళశ్లోకముల నే పఠించి అతడు ప్రస్తావన ప్రారంభించును. ఇట్లు తాను స్వయముగా కూర్చుకొనెడి నాందిని విడిచివేసి నాటకకర్త రచించినశ్లోకముల ను మాత్రమే పఠించుటకు కారణము రెండును ఏకప్రయోజనము-శుభాశంసనము-కలవి యగుటయే.

ఇంక ప్రశస్తి—నాటకము పంచసంధియుతము (ముఖ, ప్రతిముఖ, గర్భ, అవమర్శ, నిర్వహణములు.) ఒక్కొక్క సంధియందు మరల కొన్ని అంగము లుండును. చివరి దగు నిర్వహణసంధ్యంగములలో కడపటి అంగమునకు 'ప్రశస్తి' అని పేరు. ఇదియే నాటకాంతమున గలమంగళశ్లోకము. భరతుడు దీనిని ఈ క్రిందివిధముగా నిర్వచించియున్నాడు.--

"నృపదేశ [2] ప్రశాంతి శ్చ
ప్రశస్తి రభిధీయతే."

నృపునకు, దేశమునకు ప్రశాంతి నాశంసించుట ప్రశస్తి యని చెప్పబడును. నాందిని సూత్రధారుడు పఠించు ననియు, అది నాటకాంతర్భాగము కా దనియు వివరించియున్నాము. అయినచో ప్రశస్తి నెవ్వరు పఠింతురు? అది నాటకాంతర్భాగ మగును కాదా? అను ప్రశ్నలకు సమాధానము వెదకినచో భరతవాక్య స్వరూపముగూడ స్పష్టము కాగలదు. ఈ ప్రయత్నమునకు ముందు సంస్కృతనాటకములంత మగువిధమును పరిశీలింపవలసియున్నది. శాకుంతలమునుండి ఉదాహరించుచున్నాను.

భార్యాపుత్రులు లభించుటచేత దుష్యంతుని యీప్సితార్థ మీడేరినది. అప్పుడు మరీచమహర్షి "ఇంద్రుడు నీ ప్రజలకు సమృద్ధిగా వర్షము లిచ్చుగాక! నీవు నిత్యమును దేవతలను యజ్ఞములతో తనుపుచుండుము. ఇట్లు దేవతలును, నీవును సఖ్యముతో నుండి స్వర్గమర్త్యములకు సంతోషమును గూర్పుడు." అని దుష్యంతుని ఆశీర్వదించినాడు; ఆదేశించినాడు. అంతట దుష్యంతుడు:—దేవా! శ్రేయమును గూర్చుటకు యథాశక్తిని యత్నింతును.

మహర్షి :—వత్సా! నీ కింకను ఏమి అధిక ప్రియము చేయుదును?

దుష్యంతుడు :— ఇంతకంటెను అధికప్రియము మున్నదా? అయినను, తాము ప్రసన్నులైతిరి గాన, ఇది జరుగును గాక!

(భరతవాక్యము)[3]

రాజులు ప్రకృతి (ప్రజల) హితమునకై పాటుపడుచుందురుగాక! నిగమార్థకోవిదుల వాక్కు పూజ్యతను గాంచునుగాక! శక్తిసహితుడగుశివుడు నాకు మోక్షము నొసంగు గాక!

(అందఱును నిష్క్రమింతురు.)

ఇచ్చట దుష్యంతునకు భార్యాపుత్రులు లభించినారు. మరీచమహర్షి అనుగ్రహమున వాని కంతకంటె అధికప్రియ మింకేమున్నది? కాని దయాసముద్రు డైనమహర్షి ప్రసన్ను డైనాడు. సరే 'ఇది జరుగుగాక' అని తరువాతి శ్లోకములో తన అభిలాషను ప్రధానముగా

1. నాందిని తెరలోపల పఠించినను తప్పు లేదు. 'అధికస్య అధికం ఫలం'

2. "నృపదేశ" అనునది బరోడా ముద్రణపాఠము. కాశీ, బొంబాయి ముద్రణములందు "నృప, దేవ" అని యున్నది. వీనిలో "దేశ" అనునదియే యుక్తము. నాందీ, ప్రశస్తులు రెండును మంగళశ్లోకములే, శుభాశంసనములే. అయినను రెండింటికిని కొంచెము భేద మున్నది. నాంది దేవ ద్విజ నృపాదులకు సంబంధించినది కాగా ప్రశస్తి నృపదేశములకు సంబంధించి యుండును. రెండును సారాంశములో నొకటియే యన్నను నాందిలో దేశమునుగూర్చి యుండదు. ప్రశస్తిలో దేశమునుగూర్చినదే ప్రధానము - దేశ మనగా ప్రజ లని యర్థము.

3. ఈ మాటలకు సంస్కృతమూల మీ క్రిందివిధముగా నున్నది—

మరీచః—వత్స! కిం తే భూయః ప్రియ ముపకరోమి?

రాజా—అతః పర మపి ప్రియ మస్తి? యది భగవాన్ ప్రసన్నః కర్తు మిచ్ఛతి

తథా పీద మస్తు—(భరతవాక్యమ్)

(ప్రకృతిహితము) తెలుపుకొనినాడు. ఇది పై సంభాషణల సారాంశము. దీనినిబట్టి ప్రశస్తి నాటకకథకు చెందినదికాదని చెప్పుట కవకాశ మున్నది. [1]'నీకు ఇంకను ఏమి అధికప్రియము కావింపవలెను' అని అడిగిన ప్రశ్నను బట్టి నాయకునకు అభిలషితార్థ మిదివఱకే సిద్ధించిన దని అర్థము. ఆ ఫలాగమ ప్రాప్తితో కథ ముగిసినది. ఇదే 'కావ్యసంహార' మనబడును. ఇది నిర్వహణసంధిలో ప్రశస్తికి పూర్వాంగము. కావ్యసంహార మైనపిమ్మట వచ్చెడి భాగము ప్రశస్తి కాన ఇది నాటకమునకు చెందినసహజ భాగము కాజాలదు. ఇందులకు బలముగా ఈ క్రింది విషయములను పేర్కొనవచ్చును.

(1) పెక్కు భాసనాటకములందు (ప్రతిమ, స్వప్నవాసవదత్త, దూతవాక్యము మొ.) ప్రశస్తిని నాటకముతో కలిపెడి వాక్యములు (వత్సా! నీ కింకను ఏమి అధిక......ఇంత కంటెను అధిక......ఇది అగుగాక) కూడ లేక పోవుట అది నాటకభాగము కాదనువిషయ మును ఋజువు చేయుచున్నది. అంతేకాక వాని అర్థము నాటకకథ కేమాత్రమును సంబంధించి లేదు.

(2) బోధాయనవిరచిత మగు 'భగవదజ్జుక' మనెడి ప్రహసనమునందు (ఇది నాట్యశాస్త్రము నకు పూర్వమే రచింపబడె నన వాదము కలదు.) ప్రశస్తి లేనే లేదు. సూర్యాస్తమయ వర్ణనముతో నాటకము అంత మగుచున్నది. [2](ప్రశస్తి నాటకకథకు సంబంధించినది కాకపోవుట చేతనే నాటకకర్త దానిని రచింపలేదు.)

(3) ఇంతకును [illegible] [3]నాటకములందో తప్ప, ప్రశస్తి శ్లోకములందలి అర్థము, తక్కినవానియందు వలెనే నాటక కథతో సంబంధించి యుండలేదు.

ఇట్లీపై విషయము లన్నియు 'ప్రశస్తి' నాట కాంతర్భాగము కాదనుటకు బలము నొసంగు చున్నవి. అయినచో దీనిని రచించువా రెవ్వరు? పఠించువా రెవ్వరు? ఆదికాలములో నాంది శ్లోకములను సూత్రధారుడు స్వయముగా కూర్చు కొనినట్లే ప్రశస్తి శ్లోకములనుగూడ సూత్ర ధారుడే (లేదా నటుడే) కూర్చుకొనుచుండెనని యూహించుటకు పైన పేర్కొన్న 'భగవ దజ్జుకము' సహాయపడుచున్నది. తరువాత నాటకకర్తలే వీనిని వ్రాయుటకు మొదలు పెట్టియుందురు. ఇట్లూహించుటకు ప్రబల మైన ఆధారము ఇంచుమించుగా భాస నాటక ప్రశస్తు లన్నియు (రాజసింహ) ప్రశంసతో కూడుకొని యుండుటయే. ఈ ప్రశస్తులు ఆయా సూత్రధారులు కూర్చుకొన్నవైనచో అన్నింటను ఒకేరాజు ప్రశంస యుండుట సంభవింపదు. ఆరాజున కాశ్రితు డైన ఒక్క కవిచేతిమీదు గానే నాటకములతోబాటు ఇవికూడ రచింప బడి యుండునని యూహించుట సమంజసము. (కావుననే శాకుంతలమందు నాటకకర్త కభి మానపాత్ర మైన నాయకుని గూర్చిన విష యముకూడ ప్రశస్తియందు చేరిన దనవచ్చును.)

ఇట్లు ప్రశస్తి కవి కర్తృక మైనను బఠించు వాడు సూత్రధారుడు మాత్రమే. ఇట్లు పేర్కొనుటకు కారణములను క్రింద వివరించు చున్నాను.

చార్యశాస్త్రమందు ప్రశస్తి [illegible] ములో

1. [illegible] [illegible] గోచరించు [illegible] ప్రశస్తికి నా[illegible]ములో సంబంధ మున్నట్లు గోచరించు చున్నది. కాని ఈ విషయము, రెండింటికిని సంబంధ మున్న దనుట కంటె ప్రశస్తికు [illegible] కర్త [illegible] చనుట కెక్కువ యుపయోగపడును.

2. D. R Mankad—Indian Historical Quarterly Vol. VII. P. 157 'భగవ దజ్జుకము' నాట్యశాస్త్రమునకు పూర్వ[illegible]రచన [illegible] [illegible] [illegible].

3. శాకుంతల, మృచ్ఛకటిక[illegible]లందలి ప్రశస్తులు [illegible] యున్నవి. ఇచ్చట 'సంబంధ' మనగా నాటక కథాంశముల, పాత్రముల [illegible] ముల[illegible]యే. ఆరంభ శ్లోకములు కథా[illegible] [illegible] [illegible] అంతమందలి శ్లోకములు [illegible] ప్రశస్తు లతోబాటు కథాసంస్మరణాత్మకములు కావచ్చు నను [illegible] విప్రతిపత్తియుండ [illegible] [illegible]క వేణీ సంహారమందు యుధిష్ఠిరుడు 'ప్రశస్తిని' పఠించిన తరువాత, 'ఏవమస్తు' (అట్లే యగుగాక) అని కృష్ణుడు చెప్పినాడు. దీనితో నాటక [illegible] మగును ప్రశస్తి నాటకాంతర్భాగము కాదనుట కీ ఘట్టము ప్రబల ప్రతిబంధకముగా నున్నది. కాని నాకు తెలిసినంతవరకు ఇంక ఏ నాటకాం తమునందును ఇట్టి పఠము లేదు.

నిర్వచింపబడుట తప్ప తత్ప్రయోగాది వివరము లింకేమియు నందు లేవు. కాని భరతమతానుసారియే యైనసింగభూపాలుడు (14వ శతాబ్ది) మాత్రము తత్ప్రయోగములను గూర్చిన వివరణము చేసియున్నాడు.—

"భరతైః చరాచరాణామ్
ఆశీరాశంసనం ప్రశస్తిః స్యాత్"

భరతులు చరాచరములకు ఆశీస్సు నాశంసించుట ప్రశస్తి యగును. భరతుడనగా నటుడు.[1] నాటకాంతమున భరతులు (నటులు) అందఱును కలిసి ప్రశస్తిని పఠింతు రని సింగభూపాలుని వివరణమున కర్థము. ఇట్టి ప్రశస్తిని నటులందఱును కలిసి పఠింపవలయు నను రంగనిర్వహణ సూచనయే భరతవాక్య మనెడిపదము. భరతవాక్య మనగా భరతుల (నటుల) వాక్య మని సారాంశము. భరతవాక్యము కేవల రంగనిర్వహణసూచక మగుటచేత నే శాస్త్రకారులు దాని పేర్కొనలేదు.

భరతవాక్య మనగా నటులవాక్య మనెడి అర్థమును శాకుంతల వ్యాఖ్యానమునందు రాఘవభట్టుకూడ నిరూపించియున్నాడు. వాని వాక్యము లివి —"నాటకాభినయసమాప్తౌ సామాజికేభ్యో నటేనాశీర్దీయతే... ప్రస్తావనానంతరం నటవాక్యాభావాత్ అత్ర భరతవాక్య మిత్యుక్తమ్... అనేన ప్రశస్తి నామకమంగ ముపక్షిప్తమ్."—"నాటకాభినయము సమాప్తము కాగా నటుడు [2]సామాజికుల కాశీస్సు పలుకును. ప్రస్తావనానంతరము నాటకమందు నటవాక్య మనునది ఉండదు. కాన దీనికి 'భరతవాక్యము'[3] అను పేరు వచ్చినది... దీనివలన ప్రశస్తి యనునంగము నిర్వహింపబడినది.[4]" ఈ నటుడు (లేదా నటులు) ఎట్లు, ఎప్పుడు భరతవాక్యమును పఠించు ననెడివిషయమును మృచ్ఛకటిక వ్యాఖ్యాత యైనపృథ్వీధరుడు బాగుగా వివరించియున్నాడు.—"నాటకాభినయసమాప్తౌ గృహీతాం భూమికాం విహాయ, భరతతాం ప్రతిపన్నేన నటేన యా ఆశీర్దీయతే సా భరతవాక్య మిత్యుచ్యతే."—నాటకాభినయము సమాప్తము కాగా, ధరించినవేషమును విడిచివేసి భరతత్వమును పొందిన (తిరిగి నటునిగా అయిన) నటునిచేత ఏ ఆశీస్సు ఈయబడుచున్నదో ఆఆశీస్సు భరతవాక్య మని చెప్పబడుచున్నది."

ఇట్టి ప్రశస్తి భరతవాక్యము కాగా (భరతులు పఠింపవలసినది కాగా) ముద్రిత నాటకములందు నాయకుడు మాత్రమే పఠించుచుండటకును, అంతే కాక ఈ ప్రశస్తిని నాటకములోని భాగముగా చేర్చివేయుటకును గల కారణములు ఇంక ఆలోచింపవలయును.

ఇప్పటి మన సభలను, సినీమాదులను ఒకసారి జ్ఞప్తికి తెచ్చుకొనవలసియున్నది - సినీమా చివర 'జనగణమన' రికార్డు వేసినప్పుడు లేచి, నిలిచి, జాతీయగీతమునెడ గౌరవము చూపుటకు బదులుగా ప్రజలు కోలాహలముగా లేచిపోవుచుందురు ఇంక సభలయందు అధ్యక్షుని 'అంత్యోపన్యాసము' అయిన వెంటనే కార్యదర్శి వచ్చి వందనసమర్పణము (వాస్తవమునకిది ఉపన్యాసములలోని భాగము కాదు- నాటకములందలి భరతవాక్యమువంటిది.) చేయుచుండును కాని ఆ'వందనములు' పూర్తిగా స్వీకరింపకుండగనే సభ్యులు గందరగోళముగా లేచిపోవుచుందురు. మానవప్రకృతి ఎల్లప్పుడును ఒక్క విధముగానే ఉండును గాన, ఆనాడును భరతులు పఠించెడి ప్రశస్తికి ఇట్టి గతియే పట్టెడి దనినులువుగా ఊహింపవచ్చును. అందున పృథ్వీధరుడు వివరించినట్లు, నటులు నేపథ్య గృహములోనికి బోయి, తమ వేషములు మార్చుకొని భరతవాక్యము పలుకుటకై తిరిగి

1. ఈ 'భరత' పదమునకు నాట్యశాస్త్ర ప్రణేతగా ప్రసిద్ధుడైన 'భరతముని' అర్థము కాదు. భరతు లనగా నటులు—"భరతుడు - నాట్యశాస్త్రము" అను నా వ్యాసమును జూడవలయును; "సంస్కృతి", ఆగష్టు, 1954.

2. ఏకవచనమునకు కారణము ముందు వివరింతును.

3. సంస్కృతనాట్యశాస్త్ర పితామహుడైన 'భరతముని' సంస్మరణార్థముగా కూడ ఈ పేరు ప్రచారములోనికి వచ్చియుండును—

4. "దీనివలన ప్రశస్తి యనునంగము నిర్వహింపబడినది" - ఈ వాక్యము ప్రశస్తి, భరతవాక్యములు రెండును ఒకటియే యనుటకు పరమప్రమాణముగా నున్నది.

రంగస్థలముమీదికి వచ్చునప్పటికి రంగమండల మంతయు నిర్మానుష్యమై కుర్చీలు, బెంచీలు మాత్రమే మిగిలెడివి కాబోలు. ఇంక ప్రశాంతి నాశించుట ఎవరికొఱకు?... ఈ పద్ధతి బాగుండ లే దని అనుభవముమీద తెలిసికొన్నవారై, వేషములు మార్చకుండగనే ప్రశస్తిని పఠించుట కారంభించి యుందురు.[1] అది రెండవదశ. కాని నాటకమునకు సంబంధింపని భాగమును పాత్ర లందఱును కలసి పఠించుట మాత్ర మేమి సమంజసముగా నుండును? ఇదియును నసంతృప్తి కర మగుటచేత ఈ పద్ధతికిని స్వస్తి చెప్పి, పిమ్మట ప్రశస్తిని నాటకభాగము చేయుటకు ప్రయత్నించి యుందురు. ఇట్టిది నాటకాంతర్భాగ మగుటయే మూడవదశ. అప్పటినుండియే నాయకపాత్రను ధరించిన సూత్రధారు డొక్కడు మాత్రమే[2] దీనిని పఠించుచున్నట్లున్నను, ఆ వేషములో నున్నసూత్రధారుడే దీనిని పఠించుచున్నా డని గ్రహింపవలెను.

భాసనాటకములు, భగవదజ్జుకము మొద లగుప్రాచీననాటకములందు నాటకాంతర్భాగము కానిప్రశస్తి, పైన పేర్కొన్నవిధముగా, తరువాతి కాలములో నాటకాంతర్భాగముగా కూర్పబడియుండును. కాని నాటకమందలి ప్రతి వాక్యమును సాకాంక్షము కావలసి యున్నది. ఊరికే శ్లోకమును అందులో కలిపి వేసి నాయకుడు పఠించునట్లు చేసినంతమాత్రమున ఆకాంక్ష పూర్తియై, అది నాటకమందలి సహజభాగము కాజాలదు. అందువలన ఆకాంక్షాపూర్తికై సంభాషణ పూర్వకముగా కొన్ని వాక్యములనుగూడ కూర్చుకొనవలసి యున్నది. అట్లు ఏర్పడినవే "వత్స, కిం తే భూయః ప్రియ ముపకరోమి?...... తథా పీద మస్తు" అనెడి వాక్యములు. ఈ వాక్యములను ఆదికాలములో భరతులే కూర్చుకొనెడివారేమో? కాని తరువాత క్రమముగా కవులే వానినికూడ వ్రాయుటకు మొదలుపెట్టి యుందురు.[3]

ఇంతవరకును చేసినవివరణమునుబట్టి 'తథా పీద మస్తు' అనినతరువాతి శ్లోకమును మాత్రమే పఠింపవలసియున్నది. కావున 'తథా పీద మస్తు భరతవాక్యమ్' అని రంగనిర్వహణ సూచనను కూడ కలిపివేసి ఏకవాక్యముగా కూర్చి చదువుటయు[4], ముద్రించుటయు[5]ను పైకి చదివినచో ఎంత బాగుండునో, 'భరతవాక్య' మను సూచనను గూడ పైకి చదువుట అంతియే. అందువలన స్వగతాదులను కుండలీకరణమునం దుంచునట్లే భరతవాక్యమునుగూడ కుండలీకరణమం దుంపవలెను. దానిని పైకి చదువ నక్కఱ లేదు. అది ప్రశస్తిపఠనమునకు సూచన మాత్రమే.

ప్రశస్తి, భరతవాక్యములు రెండును అభిన్నము లని పై వివరణసారాంశము. ఇట్టి యర్వాచీనకాలములో అభిన్నము లైనను ఆది కాలములో నాందీ మంగళశ్లోకములవలెనే ఈరెండును గూడ భిన్నముగా నుండి యుండు

(97వ పుట చూడుడు.)

1. ఈ పద్ధతిని ఇప్పటికిని వీథిభాగవతాదులందు మనము చూచుచున్నాము.

2. 'భరతస్య నటాధ్యక్షస్య, వాక్యం వచనం భరతవాక్యం' అని శాకుంతలమున కింకొక వ్యాఖ్యాత యైనశ్రీనివాసాచార్యుడు వివరించి యున్నాడు.

3. కవులే వ్రాయుటకు మొదలుపెట్టినను ఇందు వారు చూపింపవలసిన ప్రత్యేకత యేమియును లేదు. అన్ని నాటకములందును ఈ వాక్యము లొక్కవిధముగానే యున్నవి.

4. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ శాకుంతలాంధ్రీకరణమందు "ఈ భరతవాక్యము సిద్ధించునుగాక !" అని అనువదించి యున్నారు. ఇట్లు చేయుట సరి కాదు. శాకుంతలము నాంధ్రీకరించిన తక్కినవా రందఱును భరతవాక్యమును విడిగా, రంగనిర్వహణ సూచనగానే చూపించి యున్నారు.

5. లెఫ్టినెంట్ కలనల్ ఎ. బి. గజేంద్రగడ్కర్ తన శాకుంతల ఆంగ్ల వ్యాఖ్యానములో "It is wrong to print it (భరతవాక్యమ్) as a part of the king's speech." అని పేర్కొని యున్నాడు.

(56 వ పుట తరువాయి)

చక్కని ఖండకృతులు గూడ కూర్చినారు. శ్రీ చిల్లర భావనారాయణరావుగారు "కళాభిమాని, దేశద్రోహం, ఉప్పెన, కామందు, పరిణామం, కొత్తమనిషి" అను నాటకములను, ఇతర ఖండకావ్యములను వ్రాసినారు. వీరును రచనలో భాగికి ఈడగువారు. శ్రీ ఎ. ఆర్. కృష్ణగారు "అరగంటలో అదృష్టం, ఎక్కడికి, కల్లోలం, దేశంకోసం, చేసిన నేరం" మున్నగు నాటకములను వ్యావహారికాంధ్రమున రచియించినారు. వీరు చక్కని కథానికా రచయితలు గూడా. వీరి శైలి మృదుమధురమై సర్వజనానురంజకము గా నుండును. ఆ తరువాత పేర్కొనదగిన యువకవి శేఖరుడు శ్రీ సి. నారాయణరెడ్డి. ఈయనకు ఉగ్గుపాలతోనే కవిత్వ మబ్బినదా యనునంత కవితాప్రతిభ రచనలో వెల్లివిరియుచుండును. రసికు లైన విద్వత్కవులు మెచ్చునట్లు కవితాధార, భావనాశక్తి, రచనా పాటవము, నారాయణరెడ్డి కవితలో ప్రతిపదమునందును వెల్లివిరియుచుండును. ఈత డనేకపద్య గేయ ఖండకృతులే కాక "ఋతువులరాణి, నవ్వని పువ్వు, వలపు రేడు, అజంతాసుందరి, సుగాత్రి" అను నాటికలు గూడ రచియించినాడు. ఇతం డింకను నభివృద్ధి నంది తెలంగాణమునకు మణిపూస కాదగు కవితాబీజము లితనిలో గలవు. శ్రీ గిడుతూరి సూర్యం గేయకవిత్వ రచనలో నిపుణుడు. ఈయన "ఆహుతి, మానవుడు," అను నాటికలను రచియించి రసికుల మన్నన నందినాడు. ఇటీవల జరిగిన ఆల్ ఇండియా రేడియో నాటికల పోటీలో నీతని "కన్నబిడ్డలు" అను నాటికకు తృతీయబహుమతి లభించినది. శ్రీ పోతుకూచి సాంబశివరావుగారు "ఏడు సున్నలు, రెండు నాలుకలు, ఇదీతంతు, ప్రతిధ్వనులు" అను నాటికలను రచియించినారు. వీరు సుప్రసిద్ధ కథకులు. శ్రీ భట్టిప్రోలు జయరామారావు "త్యాగయ్య, అప్పాజీ, అవసానం, పన్నా, ఆంధ్రప్రతిభ," అను నాటకములను వ్రాసి చారిత్రక నాటకకర్తలలో పేరొందిన ప్రతిభావంతుడు. శ్రీ సురమౌళి "తులంనిసా," శ్రీ కవిరాజమూర్తి "మార్పు,"

శ్రీ వట్టికోట ఆళ్వారుస్వామి "మేధావి," అను నాటకములను రచియించినారు. "చిరుగజ్జెలు" అను పుస్తకములో శ్రీమతి యశోద, శ్రీ వట్టికోట, శ్రీ సురమౌళి, శ్రీ నారాయణరెడ్డి గారల కృతులు వెలసినవి. వట్టికోట కథానికా రచనమున గూడ అందె వేసినచేయి. ఆ తరువాత ముఖ్యముగా పేర్కొనదగిన యువరచయిత శ్రీ కె. ఎల్. నరసింహారావు. ఈయన వచన శైలి చాల హృదయంగమముగా నుండును. ఈయన "గాలిపునీడే, ఆ దగ్గర లోకాలు, ఒకరోజు, కాలప్రవాహం" అను నాటికలను రచియించి చిఱుతవయసు ననే చక్కని నైపుణ్యము సంపాదించియి దను యశము గడించినాడు.

౧. ఇండియన్ నేషనల్ థియేటర్, ౨ విజయ కళాసమితి, ౩. నవ్యకళాసమితి, ౪. సన్మిత్ర నాట్యమండలి, ౫. విస్తృత నాట్యమండలి, ౬. జయహింది నాట్యమండలి, ౭. కాకతీయ కళాసమితి, ౮. జనతాకళామండలి, ౯. ఆంధ్ర విజ్ఞాన సమితి, ౧౦. ఆర్. టి. డి. ఎంప్లాయీస్ యూనియన్, ౧౧. ఇన్‌కంటాక్స్ ఎంప్లాయీస్ యూనియన్, ౧౨ వివిధ కళాశాలల ఆంధ్రవిద్యార్థి సమాజము, ౧౩. దుర్గా ఎమెచ్యూర్సు, ౧౪ చిక్కడ్‌పల్లి ఎమెచ్యూర్సు, ౧౫. వెంకటేశ్వర కళాసమితి, ౧౬. ఆంధ్రాభ్యుదయ కళాసమితి మున్నగు నాటకసంఘములు తెలంగాణములో వివిధ నాటకములను ప్రదర్శించుచు నాట్యకళాపోషణమును చేయుచు రచయితల నుత్సాహపఱుచుచున్నవి.

ఇంకను ననేకులు రేడియో నాటకములను రచియించి ప్రసారము చేసినవారు, శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి మున్నగువారున్నారు. వీరే కాక ప్రతిభావంతులైన రచయితలెందఱో వెలుగులకు రానివారు తెలంగాణములో కలరు. రచయితలకు ప్రోత్సాహము కలిగించుచు "ఆంధ్రసారస్వతపరిషత్తు, సాధన సమితి తెలంగాణా రచయితల సంఘము" మున్నగు సారస్వతసంస్థలు కృతులను రచియింపజేసి తెలంగాణా సాహిత్యరంగమున నొక నూత్న తేజమును కలిగించుచు సారస్వతసేవ సలుపుచున్నవి.

Edited and Published by T. Ramachandra, 2/583, Pycrofts Road, Madras 5,
Printed by G. Bhavanarayana at the Weldun Press, 146, T. H. Road, Madras-2

# నటులు - నాట్యకళ

శ్రీ గిడుగు వెంకటసీతాపతిగారు.

ప్రస్తుతకాలములో (సినీమా) చిత్రకళ దినదినప్రవర్ధమానముగా విజృంభిస్తున్నది. దీనివలన వెనుకబడిన దన్న నాటకకళ కూడా మరల వృద్ధిలోనికి వస్తూ ఉన్నది. మొదట నాటకములలో పేరు పొందిననటులు సినీమాలలో ప్రవేశించి, నాటకములనుండి విడిపోయిన వారు మరల నాటకములలో పాల్గొంటున్నారు. కొందరు రెండింట సుప్రసిద్ధి కెక్కియున్నారు. కొందరు ఏదో ఒకదానికే తమ కళాకౌశలమును అంకితము చేసికొంటున్నారు. ఇట్టి పరివర్తనములు ఎందుకు కలుగుతున్న వని ప్రశ్నించుకొని, ఆలోచించి చూడగా నాకు తోచిన అంశములు ఈ చిన్న వ్యాసములో తెలియజేస్తున్నాను. నా అనుభవముబట్టిన్ని, నా పరిశీలనమునుబట్టిన్ని నేను తెలిసికొన్న అంశములు సరియైనవి అవునో కాదో పాఠకుల నిర్ణయమునకే విడిచిపెడుతున్నాను.

లాభసాటి విషయములోను, నటనాచాతుర్యవిషయములోను, ప్రేక్షకులను రంజింపచేయుటకు కావలసిన అవకాశవిషయములోను సినీమా చిత్రములకును, నాటక ప్రదర్శనములకున్ను చాలా వ్యత్యాస మున్నది. పెట్టుబడి, లాభము అనేవి చిత్రములవిషయములో లక్షల చొప్పున నడుస్తూ ఉంటే, నాటకముల విషయములో వందలచొప్పున నడుస్తూ ఉంటుంది. లాభనష్టాలు భరించేవారు కార్యకర్తలు. వారి లాభనష్టాలపై నటుల బాగోగులు ఆధారపడి ఉంటవి అనుమాట నిజమే కాని అవి ఎప్పటికప్పుడు రాబోవు కాలానికే కాని జరిగిన కాలానికి వర్తించవు. కార్యకర్తలు తాము నష్టపడినా నటులకు ఈయవలసినది ఇచ్చివేసి ఉంటారు; లేదా ఇచ్చి తీరాలి. వాయిదాలు వేస్తూ నటులప్రాణాలు విసిగించినవారుండవచ్చును. అట్టి సంఘటనలు తరుచుగా జరిగేవి కావు. చిత్రకళ జీవనోపాధిగా పెట్టుకొన్నవారు ఎన్ని బాధలు పడియైనా దానిని అంటిపెట్టుకొని ఉండక తప్పదు. అంతే కాక, నాటకములలో ప్రవేశించి ఎక్కువగా ఆర్జించుకోగల అవకాశము లేదు. చిత్రములో ప్రవేశించిననటులు సగటున నెలకు వంద మొదలు మూడు నాలుగు వేలవరకున్ను వారివారి సమర్థత కొద్దీ ఆర్జించుకోడానికి అవకాశ మున్నది. అట్టి అవకాశము నాటకములలో కలుగదు అందుచేతనే సినీమాలు రాగానే నటులు అందరున్ను సినీమాలలో ప్రవేశించుటకు మొదలుపెట్టినారు. అందులో వేలకొలదీ - లక్షలకొలదీ అని కూడా అనవచ్చునేమో - ఆర్జించుకొన్నవారుకూడా ఉన్నారు. అంతే కాక మరియొక కారణంవల్లకూడా సినీమాలో ఉన్నవారు నాటకాలలోనికి రావడము మానివేసినారు. చిత్రములు తీసేసారథులు కొందరు తమ అనుజ్ఞ లేనిదే తమ చిత్రములలో నుండిననటులు నాటకములలో పాల్గొనకూడ దని శాసించినారు. అందుకు తగినకారణము లేకపోలేదు. చిత్రములకు కావలసిననటనకున్ను నాటకములకు కావలసిననటనకున్ను గల తారతమ్యము ఆ సారథులకు లెస్సగా తెలుసును. సహజమైన వ్యక్తిస్వరూపము - కన్నూ, ముక్కూ, పెదవులూ, పలువరుసా మొదలయిన లక్షణములు అమరియున్నవారిని ఎంచుకొని చిత్రసారథి వారికి తగిన శిక్షణ ఇస్తూ ఉంటాడు. వారు చిత్రములలో నటించగలవారే అయినా అందులో కొందరు నాటకములలో నటించడానికి పనికిరా రన్న విషయము గ్రహించగలడు. అట్టివారు నాటకములలో వేషాలు వేసి చెడ్డపేరు పొందిన తర్వాత వారియెడల అనిష్టత లోకములో వ్యాపిస్తుంది. అట్టివారు చిత్రములో ఉన్నారంటే ఆ చిత్రము బాగుండ దన్న అభిప్రాయము ముందుగానే ఏర్పడుతుంది. అందుచేత అట్టివారిని చిత్రములో వారు పనిచేస్తూ ఉన్నంత కాలము నాటకములలో పాల్గొననీయకుండా చేయవలసి వస్తుంది. ఎవరైతే నాటకాలలో ఇదివరకే పేరు పొందియున్నారో, లేదా పేరు పొందగల రని నమ్మకము కుదురుతుందో వారిని నాటకములలో పాల్గొననీయగలరు.

ఇంతకూ నటనవిషయములో ఈ వ్యత్యాసము ఎందుకు ఎట్లు కలుగుచున్నదో తెలిసికోవలెను. సహజవ్యక్తి స్వరూపము, ఆహార్యము,

వాచికము, అభినయము-ఈ నాలుగు ప్రధాన లక్షణాలు సినిమా నటులకూ కావలెను; నాటకములలోని నటులకూ కావలెను. ఇందులో మొదటిది సహజసిద్ధమైనది కనుక ఉన్నదిపోదు; లేనిది కొంత సవరింపవచ్చును. రెండవది కార్యకర్తలు చేకూర్చినపరికరములనుబట్టి ఉంటుంది. వాచికవిషయములోను అభినయవిషయములోను చాలా వ్యత్యాసమున్నది. సినిమాలోగల "మైక్" సౌకర్యము నాటకాలలో ఉండదు. చెవిలో ఊది చెప్పవలసిన రహస్యములయినా సహజమైనఉచ్చారణతో సినిమాలో చెప్పవచ్చును. నాటకములలో ప్రక్కనున్న ఒక పాత్రధారునకు వినబడకుండా మరియొక పాత్రధారునితో చెప్పవలసినమాటలు ప్రేక్షకులకందరికీ వినబడేటట్టు అరచి చెప్పవలసి వస్తుంది. అందుచేతనే మైక్ ముందు నిలబడి చెప్పడానికి అలవాటుపడ్డనటులు నాటకములలో బిగ్గరగా మాటలాడలేక పోతున్నారు. నాటకాలలో బిగ్గరగా మాటలాడడానికి అలవాటు పడ్డవారు సినిమాలలో సహజమైనగొంతుతో మాటలాడలేకుండా ఉన్నారు. అయితే, వీరి విషయములో అట్టే బాధ లేదు. సహజమైనఉచ్చారణతో పలికేవరకు సినిమాలో పలికిస్తూ ఉండవచ్చును. నాటకరంగముమీద ఒక్కసారి మాత్రమే పలుకుటకు అవకాశముంటుంది. అది తిన్నగా రాలేదని మరియొకసారి పలుకుటకు అవకాశముండదు. నటనవిషయములోను అంతే. అందుచేత సినిమాలో ఉద్దిష్టమైనఉచ్చారణ, నటన రావడానికి ఉండే అవకాశము నాటకరంగస్థలముందు కలుగదు. అందుచేతనే సమర్థత లేని నటుడు గాని నటి గాని నాటకరంగస్థలమున బయలుపడినా సినిమాలో బయలుపడుట జరుగదు. సరియైనఉచ్చారణ గాని నటన గాని తృప్తికరముగా లేకపోతే సినిమాలో మరియొకసారి షూటింగ్ జరుపుతారు. నాటకాలలో నటులు తమ అభినయము సహజలక్షణానికి మితిమీరి చేయవలసి ఉంటుంది. ఆవిధముగా చేయకపోతే ప్రేక్షకులలో చివర నున్నవారికి కనబడదు. కేమరా అతిసూక్ష్మమైనవస్తువులైనను చిత్రించగలదు గనుక సుకుమారమైన అభినయము చాలును. మితిమీరి చేసిన అభినయము చిత్రములో వికారముగా ఉంటుంది. కొందరు తమ ముఖముల యెదుట చేతులు ఎత్తిప్పి అభినయమునకు అలవాటు పడినవారు. నాటకాలలో ఈ అభినయమువల్ల కీడు లేదు కాని సినిమాలలో వీరి చేతులు సహజవిరుద్ధమైన లావుగా కనబడతవి. ఈ అంశములు చిత్రసారథులకు-వారు నటులు కాకపోయినా లెస్సగా తెలియగలవు. నాటకాలలో పెద్ద పేరు పొందిననటులకైనా కొంత అనుభవము కలిగిన తర్వాత గాని తెలియవు. అభినయములోను ఉచ్చారణలోను చిత్రసారథులు ఆదేశాలు ఇస్తూఉన్నప్పుడు నాటకాలలో పెద్ద పేరు పొందిననటులకు "మాకు వీరు అభినయమూ, ఉచ్చారణ బోధించడమేమి? అయ్యో! గ్రహచారమా?" అన్నట్లు తోస్తుంది. మరియొక ముఖ్యవిషయములో సినిమాలోని నటనకున్ను నాటకాలలోని నటనకున్ను చాలా వ్యత్యాసమున్నది. సినిమాలో ఒక్కొక్కవాక్యము సరిగా షూటింగ్ జరిగేలోపల నాలుగైదుసార్లు నటులచేత పలికించవలసి వస్తుంది. పరిచయముకోసము రెండుసార్లు సరియైనఉచ్చారణము రావడమే కాకుండా నిలవడంకోసము రెండుసార్లు, శబ్దగ్రాహియంత్రము నడిపేవానికోసము రెండుసార్లు చెప్పిస్తూ ఉంటారు. ఆనందమో, దుఃఖమో, కోపమో ఏదో ఒకటి భావోద్రేకంతో చెప్పవలసినవాక్యము ఆయా సన్నివేశాలలో, సంభాషణలలో ఒక్కసారిగా సహజధర్మాన్ని అనుసరించి వస్తుంది. అంతే కాని ముందూ వెనుకా ఆధారమేమీ లేక చిత్రసారథి, శబ్దగ్రాహినియంత కోరినన్నిసారులు రమ్మంటే ఎటు రాగలదు? చివరకు వారు కోరినట్లు వచ్చినా నిర్జీవంగా వస్తుంది. అంతకంటెను ఎక్కువ విపరీతమైనవిషయము మరియొకటి ఉన్నది. ఇరువురికి జరిగినసంభాషణము చిత్రములోనికి తీసినప్పుడు చిత్రనిర్మాణసౌకర్యముకోసము ఒకసారి ఒకరికెదురుగా కేమరా పెట్టి వారు చెప్పవలసినభాగము లన్నీ రికార్డు చేసి మరియొకసారి రెండవవారికి ఎదురుగా కేమరా పెట్టి వారి వాక్యము లన్నీ రికార్డు చేసి ఫిల్ముతునకలు చేసి యథాక్రమంగా అతుకుతారు. చివరికి చిత్రం చూచినప్పుడు ఆ సంభాషణము సరిగా తృప్తికరముగా ఉండవచ్చును గాని నటుల సంభాషణము యంత్రమువలె నిర్జీవంగా నడిచినదే కాని సహజముగా నిండుజీవముతో నడిచినది కాదు

నాటకాలలో సంభాషణము జరుగుతూ ఉన్నప్పుడు నటులకు కలిగేసహజావేశము సినీమాలో కలుగదు. ఎవరిపాఠము వారు ప్రత్యేకించి అప్పజెప్పినట్లే అవుతుంది. నాటకాల అనుభవము లేనివారికీ, యంత్రములవలె వ్యవహరింపగల శక్తిసామర్థ్యములు గలవారికీ ఈ విధానము బాధింపదు కాని నాటకరంగమందు చాలాకాలము పని చేసి తాత్కాలికపు సహజావేశమును తెచ్చుకొనుటకు అలవాటు పడిన వారికి ఇది రోతగానే ఉంటుంది. అందుచేతనే బళ్లారి రాఘవాచారి, డి. సుబ్బారావువంటి ప్రసిద్ధనటులు నాటకాలలో పేరు పొందినట్లు సినీమాలలో పేరు పొందలేక పోయినారు. అట్టివారికి నాటకాలలో కలిగే ఆనందము సినీమాలలోనటించినప్పుడు కలుగలేదు. అయితే, రెంటను గొప్ప నటు లనిపించుకొన్నవారు లేక పోలేదు. కాని వీరిలో చాలామంది సినిమా నటులుగా పేరు పొందినతర్వాతనే నాటకాలలో పేరు పొందినవారు. సినీమాచిత్రాలలో వీరి బొమ్మలను చూచినప్రేక్షకులకు వీరు రంగస్థలముమీదను కనబడగానే గొప్ప ఆనందము కలుగుతుంది. ప్రేక్షకుల ఆనందమువలన ఆ నటులకు గొప్ప ఉత్సాహం కలుగుతుంది. వారికి సినీమాలలో గలిగిన నటనాచాతుర్యము సహజమైనరస్థాలో మరింత ఎక్కువగా వికసిస్తుంది. ప్రేక్షకుల సౌహార్ద్దము వారి లోపములను కనబడనీయదు.

చిత్రములో చూచేది ఛాయాపటము — నటుల బొమ్మలు; నాటకములో చూచేది నటుల వ్యక్తిగత స్వరూపము. అందుచేత చిత్రము చూచినప్పుడు కలిగేఆనందముకంటే ఎక్కువ ఆనందము ప్రేక్షకులకు కలుగుతుంది. అయితే చిత్రములో చూచేదృశ్యములు నాటకములో కనబడవు. నటులకుకూడా నాటకములలో నటించినప్పుడు కలిగేఆనందము సినీమాలలో నటించినప్పుడు కలుగదు. అందుచేతనే, సినీమాలలో ఎక్కువ ఆర్జనకు అవకాశమున్నా కొందరు నటులు నాటకములలో పాల్గొనుటకు కుతూహలపడుతూ ఉంటారు. అందుచేతనే నాటకకళ ఇంకా నిలిచియున్నది. దానిని నిలబెట్టవలసినఆవశ్యకత కూడా కలదు.

సినీమాలు రాకమునుపు నాటకాలుమాత్రమే ఉండెను కనుక నటుల నటనాకౌశలము నాటకాలకే అంకితమై ఉండేది. 50 సంవత్సరాల క్రిందటి ముచ్చట్లు నాకు కన్నులకు కట్టినట్లు జ్ఞప్తికి వస్తూ ఉంటవి.

1904 లోనో 1905 లోనో ధర్మవరము కృష్ణమాచార్యులు గారు దశరథుని పాత్ర నటిస్తూ ఉండగా చూచినాను. అతని నటన ఎంత సహజముగాను, ఆకర్షణీయముగాను ఉండెనో ఒక ముచ్చటవలన గ్రహింపవచ్చును. ప్రేక్షకులలో వారి మిత్రుడొకడు కూర్చుండియుండెను. అది నాటకము అనిన్ని, అందు కృష్ణమాచార్యులు నటుడుగా దశరథునిమరణావస్థ నటిస్తున్నాడనిన్ని ఎరిగియుండిన్నీ అతని నటనవల్ల ముగ్ధుడై "అయ్యో! కృష్ణమాచారీ!" అని బిగ్గరగా విలపించినాడు. వాస్తవముగా అతడు చనిపోతూ వున్నట్లుగానే భావించుకొన్నాడు.

ఆ కృష్ణమాచార్యుల శిక్షణములో తన నాట్యకళ నభివృద్ధి చేసికొన్న తాడిపత్రి రాఘవాచార్యులు గురువును మించినశిష్యుడై ప్రసిద్ధనటుడుగా మనదేశములోనే కాక ఇంగ్లండులో కూడా ప్రఖ్యాతి పొందెను. అతనితో కలిసి చంద్రగుప్త, రామదాసు, దుర్గాదాసు, తీరనికోరిక -- ఆతర్వాత అనే నాటకాలలో పాల్గొన్న భాగ్యము పొందినవాడను కనుక, అతని నటనాచాతుర్యము లెస్సగా తెలిసికొగలిగాను. రంగస్థలమునకు వచ్చి నిలబడుటలోనే అతని ప్రత్యేకత గోచరమయ్యేది. నటునకుండవలసినలక్షణము లన్నీ అతనికి ఉండెనని చెప్పగలను. చిన్నచిన్న సవరణలతో నటనాచాతురిని పెంపొందించే రహస్యాలు అతడు చెప్తూ ఉండెను. అందుకు నిదర్శనముగా ఒకటి రెండు తెలియజేస్తాను. "లేదు" "కాదు" అనే విషయము చెప్పవలసినప్పుడు ముందుగా ఆ మాట చెప్పి తలత్రిప్పుతూ అభినయము చేయుట కంటె ముందుగానే ఆ అభినయం చేస్తూ ఆ మాట పలుకుటవల్లను మనభావము ప్రేక్షకులకు ఎక్కువ ఆకర్షణీయముగా ఉంటుందని ప్రదర్శించి బోధించేవాడు. అభినయము తాను మాటలాడుతూ ఉన్నప్పుడే కాక ఇతరులు ప్రసంగిస్తూ ఉన్నప్పుడు సైతము నటుడు కనబరచవలెనని చెప్తూఉండేవాడు. నాటకములో పాల్గొనునటీనటు లందరును తమ పాత్రపోషణమును చూచుకొనుటలో తృప్తి పొందక నాటక

# ఇంగ్లీషు హరిశ్చంద్ర : చిత్రనళీయం

శ్రీ తాపీ ధర్మారావుగారు.

---

యాభై మూడేళ్ళనాటి ముచ్చట! నేను విజయనగరంలో రిపన్ హైస్కూలులో నాలుగో ఫారమో అయిదో ఫారమో చదువుకుంటున్నాను. మా ఉపాధ్యాయులలో మండపాక కొండలరావుగారూ, ఒంగోలు పట్టాభిరామమూర్తిగారూ, ఇద్దరు మహోత్సాహులూ, నాటకప్రియులూ ఉండేవారు. ఒకసారి వారు హరిశ్చంద్ర నాటకం ఇంగ్లీషున ప్రదర్శించారు. నామట్టుకు నాకా నాటకమెంతో మనోహరంగా ఉంది.

ఆ నాటకంలో పట్టాభిరామమూర్తి మేష్టరుగారు "యీ, ది సిటిజెన్స్ ఆఫ్ వరాణసీ" అని హరిశ్చంద్రుడు సంబోధించినట్టు అన్నారు. వరాణసీ యేమిటి? వారణాసి కాదా అని మేము తరువాత వారిని దుయ్యబట్టాము. మేష్టరుగారు తాము స్వయముగా ధర్మవరం కృష్ణమాచారిగారు నటించిన నాటకం చూచామనీ, దానిలో వారు వరాణసీ అనే ఉచ్చరించారనీ, అది రిథమ్ కోసం అలా అని ఉండవచ్చుననీ తెలియజేశారు.

ఆ సందర్భంలోనే ఆచారిగారి ఇంగ్లీషు హరిశ్చంద్ర నాటకం పుస్తకం మేష్టరుగారి నడిగి ఇంటికి తీసుకుపోయాను. ఆరంభించినది మొదలు నాటకం ముగిసినంతవరకు ఇతర ప్రపంచాన్ని మరచిపోయాను. ఆరోజులలో తెలిసీ తెలియని చదువుగా నేను చూస్తూ ఉండిన ఇంగ్లీషు శకుంతలకు ఈ హరిశ్చంద్ర ఏవిధంగానూ తీసిపోదని అనుకునేవాడను. అలాంటిదే ఏదయినా నాటకం వ్రాయాలని అనుకొనేవాడను.

తరువాత కొన్నిరోజులకే సురభికంపెనీ ఒకటి విజయనగరం వచ్చింది. వారి చిత్రనళీయ నాటకం చూచాను. నాటకం చూస్తూ ప్రబంధం చదువుతూ ఉన్నట్టు, ఆ ప్రదర్శన ద్విగుణంగా సంతోషపరిచింది. మరునాడే ఊరంతా గాలించి కృష్ణమాచారిగారి చిత్రనళీయ నాటకం సంపాదించాను; ఆత్రుతతో ఆమూలాగ్రం చదివాను. ఓహో! ఏమీ ఆనందము! ఓహో! సమ్మేళనము! ఇంగ్లీషు నాటకాల రంగవిభజన; సంస్కృత నాటకాల లాగ మధ్యమధ్య పద్యాలు; పాత్రోచిత మయిన భాష; షేక్స్పియరు నాటకాలలాగ ఆస్వగతాలు; ప్రబంధఫక్కిని కవనము; అంతా పంచభక్ష్యపరమాన్నాలతో భోజనం చేసినట్టు తృప్తి నిచ్చాయి. నన్నయభారతంలోని నలోపాఖ్యానమూ, శ్రీనాథుడి నైషధమూ, భట్టుమూర్తి హరిశ్చంద్రనలోపాఖ్యానమూ ఆంధ్ర సాహిత్యములో ఉండడం వ్యర్థం కాలేదనిపించింది. ఇన్నిగుణాలొక్కచోట కూడి ఉండడమే చిత్ర మనిపించింది. కాబట్టే గాబోలు చిత్రనళీయ మని పేరుపెట్టారు. ఈ పేరు పెట్టడంలో వీరికి చిత్రభారతం మార్గదర్శి అయి ఉంటే, వీరి గ్రంథం చిత్రహరిశ్చంద్రకూ విచిత్ర బిల్హణీయానికీ దారిచూపించా యనాలి.

అంత చక్కని నాటకాన్ని మాచిన్న సమాజం ప్రదర్శించక పోతే ఎలాగ? ఆ రోజులలో మా యింట్లోనే ఒక చిన్న నాటక సమాజమూ, డిబేటింగ్ సొసైటీ ఉండేవి. మా అన్నదమ్ములమూ, బంధువులము కలిసి ఒక అరడజనుమంది విద్యార్థుల ముండేవారము. మా స్కూలులోని విద్యార్థులు ఒక అరడజనుమంది కూడా మాలో ఉండేవారు, "దేనికైనా సయ్" అంటూ. ఎలాగయితే నేమి; ప్రదర్శన జరిపించా మని అనిపించుకున్నాము. చూచిన మావీథి అమ్మలక్కలుపదిమందీ బాగుం దన్నారు. చిత్ర

---

(99 వ పుట తరువాయి)

కథావస్తువు లెస్సగా గ్రహించి నాటకములో తాము ధరించే పాత్రను గలస్థానము చక్కగా గుర్తించి పరస్పర సహాకారముతో నాటక ప్రదర్శనము పూర్తిగా ప్రేక్షకుల ఆమోదమును బడయునట్లు చేయవలె నన్న ఉపదేశము అతడు విశదపరచినట్లు మరి యెవ్వరున్ను చేయలేదని చెప్పగలను.

పేరు పొందిన నటులు మన తెలుగువారిలో ఇంకా అనేకు లున్నారు. వారిని క్రొత్తని వారి నటనాచాతుర్యమును విశదీకరించుటకు ఇక్కడ అవకాశము లేదు. అది మరియొక వ్యాసములో తెలియజేస్తాను.

— —

# విషాదసారంగధర

తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు.

---

"మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని కావ్యాని ప్రథంతే" యని మన భారతీయులు మంగళాంతములుగనే కావ్యములను గాని, నాటకములను గాని రచియించుచుండుట సంప్రదాయము. విషాదాంతరచనలు భారతీయులకుఁ బరిచయమైనవి కావు. పాశ్చాత్య నాటకములలో మోదాంతము లగునాటకములకన్న విషాదాంతము లైననాటకములే ప్రేక్షకుల హృదయములను గదల్పఁజాలు ననువిషయమును పాశ్చాత్యవిద్యాసంపర్కమువలనఁ జక్క నెఱిఁగిన శ్రీ ఆచార్యులుగారు తెలుఁగునఁ గూడ నట్టి విషాదాంతనాటకముల నేల రచింపరా దని యెంచి "విషాదసారంగధర" నాటకమును రచించిరి. అందుచేతనే కేవలము సారంగధరనాటక మని పేర్కొనక వారు దానికి "విషాదసారంగధర" నాటక మని పేరు పెట్టిరి. తమ సారంగధరనాటకము సారంగధరచరిత్రకావ్యమువలె మోదాంతము కా దని తెలుపుటకే వా రట్లు చేసియుందురు. వారి విషాదాంతనాటకములలో నెల్ల వారి "విషాదసారంగధర" పేర్కొనఁదగినది; తెలుఁగున విషాదాంతనాటకములో నిదియే మొదటిది.

శ్రీ ఆచార్యులవారు తమ విషాదసారంగధర నాటకమును తెలుఁగునాటఁ బ్రసిద్ధమైన సారంగధరునికథను బట్టియే రచియించి యుందు రని తోఁచుచున్నది. నిజమునకు నిది తెనుఁగుదేశమునకును, తెనుఁగురాజగు రాజరాజనరేంద్రునికిని సంబంధించినకథ కాకపోయినను చిత్రముగ నిది తెలుఁగుదేశమునకు సంబంధించిన తెలుఁగుకథగా రూపొంది తెలుఁగువారి హృదయములను జూఱగొనినది. గోరన నవనాథచరిత్రమున నీకథ మాళవదేశమున మాంధాతపురమున జరిగినట్లును, ఆపురమున కధిపతి రాజమహేంద్రుఁ డైనట్లును నున్నను చేమకూర వేంకటకవి తన సారంగధరచరిత్రమున మాళవదేశమును మాళవదేశముగా నేయుంచి మాంధాతపురమును రాజమహేంద్రముగను, రాజమహేంద్రుని రాజనరేంద్రునిగను మార్చినాడు. కాలక్రమమున మాళవదేశ మనుమాట మఱుఁగు పడిపోయి యాకథ యాంధ్రదేశమున రాజ

---

(100 వ పుట తరువాయి)

నళీయంలాంటినాటకాన్ని 'బాగా' ప్రదర్శించామనే సంతోషించాము.

తరువాత పరీక్షలు ప్యాసయి మా సమాజంవారము ఎవరికివారమయి చెదిరిపోయాము. నాటకప్రదర్శన లాగిపోయాయి. చిత్రనళీయంమీద తెర పడిపోయింది. కాని ఆనాడు చదువుకున్న చిత్రనళీయంలోని పద్యాలూ, పాటలూ ఇప్పటికీ ముప్ఫయి నలభైవరకు నాకు కంఠగతంగా ఉన్నాయంటే, ఆ నాటకం ఆనాడు ఎంతగా మనసుకు నచ్చిందో తేటపడుతుంది. అది నాకు నాటకమూ ప్రబంధమూ అయింది.

మరి పదేళ్లు జరిగిననాటికి నేను బరంపురం కల్లికోట కాలేజీలో ఉపాధ్యాయుడుగా ఉండేవాడను. అప్పు డక్కడ "ధర్మప్రదర్శనీ" (అనే గాబోలు?) ఒక నాటక సమాజముండేది. చిత్రనళీయం ప్రదర్శిస్తామని ప్రకటించారు. రెక్కలు కట్టుకొని హాలులో పడ్డాను. 'బూర్ల బ్రదర్స్' అని ఇద్ద రన్నదమ్ములు: సూర్యనారాయణగారూ నరసింహంగారూను. ఒకరు నలుడుగానూ, ఇంకొకరు బాహుకుడుగానూ నటిస్తారు. చక్కగ పాడ గలిగి అర్థయుక్తంగా నటించగలవారు.

ప్రదర్శన నామట్టుకు మహాద్భుతంగా కనిపించింది. కృష్ణమాచారిగారి పద్యాలకు వారి నటన వ్యాఖ్యానంలాగా నాకు తోచింది. "మీ పేరు లడుగదే మెలఁత తారకలార ఘన మధుమాసయామినులయందు" అన్న రంగంలో ఉన్న సుమారు 20 పద్యాలు, కేవలం ప్రబంధ ధోరణి, బూర్లవారు స్టేజిమీద చదువుతూంటే విసుగన్నది ఎవ్వరికీ తోచలే దంటే అతిశయోక్తి కాదు. వారిలాగా ఆపద్యా లన్నీ ఆ రంగంలో చదవడానికి సాహసించిననటకులు ఎక్కువమంది ఉండ రనే నా నమ్మకము.

మహేంద్రవరమున రాజరాజనరేంద్రుని యింట జరిగినట్లు సిద్ధాంతమయిపోయినది. క్రీ. శ. 1560 ప్రాంతమున బాలభాగవత మనుద్విపదకావ్యము రచించిన దోనేరు కోనేరునాథకవి కూడ విమలాదిత్యు డనురాజు భానుమతియందు రాజరాజనరేంద్రునిఁ గనె ననియు, నాతఁడు రాజమహేంద్రవర మను పేరి రాజధానిని గట్టించి వేఁగిదేశ మేలె ననియు, నాతని పెద్దకొడుకగు సారంగధరుఁడు తన పినతల్లి యైనచిత్రాంగి మూలమున శిక్షితుఁడై యెట్లో యా యాపదఁ గడచి చౌరంగి యనుసిద్ధుఁ డయ్యె ననియు వ్రాసియున్నాఁడు. దీనినిబట్టి వెంకటకవి కింకను పూర్వమే సారంగధరుని కథ రాజమహేంద్రవరమునకు సంబంధించినదిగఁ బ్రచారములో నున్నట్లు తెలియుచున్నది. తర్వాతివారైన బాణాలశంభుదాసుఁడును, కూచిమంచి తిమ్మకవియును నీ కథ రాజమహేంద్రవరములోనే జరిగినట్లు వ్రాసిరి. ఈ కథనుబట్టియే రాజమహేంద్రవరమున సారంగధరుని మెట్టయు, చిత్రాంగిమేడ రత్నాంగిమేడలును వెలసినవి. ఇంతటితో నిది యాగలేదు. గుంటూరుజిల్లా పలనాడు తాలూకాలో సారంగధరగుట్ట యను కొండ కల దనియును, నా కొండమీఁదనే సారంగధరుని కాళ్లుచేతులు ఖండింపఁ బడె ననియును నొక యైతిహ్యము కూడఁ జెప్పఁబడుచున్నది. కన్నడదేశములోఁ గూడ హంపీసమీపమున కంపిలినగరప్రాంతమున రత్నాంగిమేడ, చిత్రాంగి మేడ కలస్థలములు కలవు. నేఁటికంపిలియే నాఁటికాంపిల్యనగరము. ఇట్లు సారంగధరుని కథ కాలక్రమమున స్థలములు మారి తెలుఁగుదేశమునకుసొంతమై పోయినది.[1]

ఇట్టి కథ ఒక తెలుఁగుదేశమునందు మాత్రమే కాక భారతదేశమున నితరస్థలములఁ గూడ జరిగిన ట్లుండుట చిత్రము. పంజాబీభాషలో 'పూరణ్ భగత్' అను ప్రాచీన మయినజానపదగాథ యొకటి కలదు! అందలి కథ యంతయు మన సారంగధరుని కథను బోలి యుండునని తద్‌జ్ఞులు చెప్పుదురు.

సారంగధరుని కథను చెప్పుగ్రంథములలో గౌరన నవనాథచరిత్రము మొదటిది. గౌరన తానాగ్రంథమును శ్రీగిరికవి కృత పద్యప్రబంధమునుబట్టి రచించినట్లు చెప్పుకొనినాఁడు. కాని యాగ్రంథము నేఁడు మనకు లభ్యమగుట లేదు. గౌరనకుఁ దర్వాత బాణాల శంభుదాసుఁడు, కూచిమంచి తిమ్మకవి, చేమకూర వేంకటకవి, పరశురామకవి యను వారు సారంగధరునికథను పద్యకావ్యములుగ రచించిరి. వీరితోఁబాటు సిద్ధనగౌడు అనులింగధారి వ్రాసిన యక్షగానమును, స్త్రీలపాటలును సారంగధరకథాత్మకములు కలవు, కాని వానిలో నెల్ల చేమకూర సారంగధరయే ప్రసిద్ధము.

శ్రీ ఆచార్యులవారు తమ విషాదసారంగధరకు చేమకూర సారంగధర చరిత్రమునే మూలముగాఁ గొనినట్లు స్థూలదృష్టికిఁ దోఁచును. కాని వారు చేమకూర సారంగధరను మాత్రమే కాక బాణాల శంభుదాసుని సారంగధర చరిత్రమును, నింకను దెలుఁగునాఁటఁ బ్రసిద్ధమై ప్రచారములో నున్న సారంగధరునికథను గూడ ననుసరించి యచ్చటచ్చట "అన్యథా వా ప్రకల్పయేత్" అను న్యాయముచొప్పున స్వతంత్రముగఁ గల్పనములను గల్పించి తమ విషాద సారంగధరను రచించినారు. ఇట్లు మూగతాయిగా సారంగధరుని కథను పై గ్రంథముల నుండి స్వీకరించినను ఆచార్యులవారు దానిని స్వతంత్రనాటకముగానే తీర్చి దిద్దినారు.

గౌరన నవనాథచరిత్రములోను, చేమకూర సారంగధరలోను చిత్రాంగి రాజరాజనరేంద్రుని భోగస్త్రీగా చెప్పఁబడియున్నది.

కం॥ "కల రా యిలరాజునికిం
గులసతి రత్నాంగి భోగకుటిలశిరోజా
తిలకము చిత్రాంగియు నవ
నెలజవ్వను లిరువు రంబుజేందునిభాస్యల్॥"

అని చేమకూర చిత్రాంగిని 'భోగకుటిలశిరోజాతిలక' మని పేర్కొనినాఁడు. అతఁడే మఱొక చోట "వారకాంతల కెంతైన వావి గలదె" యనినాఁడు. బాణాలశంభుదాసుఁడు మాత్రము చిత్రాంగిని భోగస్త్రీగాఁ బేర్కొనక యొక చిత్రకథను గల్పించినాఁడు. సారంగధరుని కొఱకై తెచ్చినచిత్రాంగిపటము తన చేతికి రాఁగా రాజరాజనరేంద్రుఁడు దానిని జూచి

1. గురువర్యులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము తొలిసంచికలలో వ్రాసినవ్యాసమును జూడుఁడు. తక్కిన వివరములకుఁ జూడుఁడు: సారంగధర చరిత్రము, సవ్యాఖ్యానము. దీపాల పిచ్చయ్యశాస్త్రి ప్రణీతము.

మోహించి యచటికిఁ దన కత్తెని బంపి వివాహకార్యము ముగించుకొని చిత్రాంగిని దనభార్యగఁ జేసికొనెనఁట. పిమ్మటఁ జిత్రాంగి తన చెలికత్తెలతో "పటములో వ్రాసినబాలుండు గాడు, ఎటువంటి దీ సుద్ది యెఱిగింపుఁ డనెనఁట!" అపు డా చెలికత్తెలు పటములో లిఖింపఁబడినవాఁడు పట్టపుదేవియగురత్నాంగి కొడు కనియు, నతని పేరు సారంగధరుఁ డనియు, నవమన్మథుఁ డనియుఁ దెలిపిరఁట! అంతఁ జిత్రాంగి తన దురదృష్టమునకుఁ జింతించి సారంగధరు నెట్లైనను జూడవలయు నని సమయముకొఱకు వేచియుండెనఁట! ఆ తర్వాతి కథ యంతయు చేమకూరకథవలెనే సాగినది. కూచిమంచి తిమ్మకవికూడఁ జిత్రాంగిని రాజకన్యగను, రాజు రెండవభార్యగను జిత్రించినాఁడు. ఇట్లు శంభుదాసుఁడు సారంగధరుని కథలో ఒక సవరణ చేయఁగా తిమ్మకవి దాని ననుసరించినాఁడు. ఆచార్యులవారును పై కల్పనమునకుఁ దమకల్పనము కొంత చేర్చి మెఱుఁగులు దిద్దినారు. వారి కల్పన మిట్లు కలదు. చిత్రాంగి భోజరాజపుత్రి. రాజరాజనరేంద్రుఁడు తన కుమారుఁడైన సారంగధరునికై కన్యల నన్వేషించుకొఱకు దేశదేశములకు బ్రాహ్మణుల నంపెను. వారిలో హిరణ్యుఁడు విదర్భరాజపుత్రిక యగు చంద్రకళాదేవి పటమును, విభావసుఁడు భోజరాజపుత్రిక యగుచిత్రాంగిదేవి పటమును దెచ్చిరి. విభావసుఁడు తీసికొనిపోయిన సారంగధరుని చిత్రపటమును జూచినదిమొదలు చిత్రాంగి సారంగధరునే వలచి యాతని రహస్యముగాఁ బిలిపించి తన మనవిని సారంగధరుని కెంతెంతో చెప్పు మన్నది. అతనిని గాక యింకొక్కరిని బతిగాఁ బడయ నని విన్నవింపు మన్నది. కాని చిత్రాంగిపటమును జూచి రాజరాజనరేంద్రుఁ డామెను దానే వివాహము చేసికొనఁ దలఁచెను. తదనుగుణముగా రాజరాజు విభావసునకు మఱొక వేయివరహాల నిచ్చి యామెను దనకు నిశ్చయము చేసికొని రమ్మని చెప్పి పంపెను. అతఁడును జిత్రాంగిదేవి చెప్పి పంపినవిషయమును సారంగధరునితోఁ జెప్పినయెడల నేమి కొంప మునుఁగునో యని యాతనితో నా విషయము చెప్పనే లేదు. విభావసునిమూలమున రాజరాజుకోరిక నెఱిఁగినభోజరాజు తా నాతని కొంతరితుఁడగుటచే నెటుచేయుటకును దోఁచక తనకిష్టము లేకున్నను— బలవంతముగాఁ జిత్రాంగిని రాజరాజున కిచ్చి వివాహము గావించెను. చిత్రాంగియు గత్యంతరము లేక రాజరాజును వివాహ మాడెను. కాని యామె మనస్సంతయు సారంగధరునిమీఁదనే యున్నది. అందుచే నామె సారంగధరుని చిత్రపటము నెప్పుడును దన హృత్సీమలో దాఁచుకొని రాజరాజుతో 'నిష్టము లేని కౌపుగము' సేయుచుండెను.

ఈ కల్పనము నిష్ప్రతిబంధకముగా, నిరాబాధముగా నున్న దనుటలో సందేహము లేదు. బాణాల శంభుదాసుని కల్పనమును గూర్చి వ్రాయుచు శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు "చిత్రాంగి రాజకన్యయు నిల్లాలును నైనచో అట్టి కనువేదురును, అంతటి గయ్యాళితనమును ఆమెయెడ కలుగఁజెప్పుట యొప్పదు సరిగదా, బుద్ధిమంతుఁడైనసుబుద్ధి యాయిల్లాలి శీలమును ముందుగ - అకారణముగ - అంత గా శంకించి 'అక్కడి కేఁగినచో కీడు తప్పక కలుగు నని చెప్పుటయు — సారంగధరుని యత్నమున కంతగా అడ్డగాళ్ళు వేయుటయు అనుచిత ప్రసంగ మనిపించుకొనును. కాబట్టి శంభుదాసుఁడు చేసినసవరణ సరస మైనది కాదు. తదనుసారి తిమ్మకవి రచన రుచిర మైనది కాదు.' అని వ్రాసిరి. కాని యాచార్యులవారి యీ కల్పనమువలన నా దోషము తొలఁగిపోవుచున్నది. విషాదసారంగధరలో సుబుద్ధి చిత్రాంగి శీలమును నకారణముగా శంకించినట్లు గాక సకారణముగనే శంకించినట్లు వారు కల్పించిరి. సారంగధరుఁడు పావురములాటకై యిల్లు వెడలిన కొంతసేపటికిఁ జిత్రాంగియింటి దాసి సారంగధరునింటికి వచ్చి యుండె నని సుబుద్ధి తొలుతనే వినియుండెను. అది గాక సారంగధరాదులు పావురము లాడించుకాలమున చిత్రాంగి మేడపై నుండె ననియు, సారంగధరుని పావురము చిత్రాంగిమేడపై వ్రాలినంతనే దాని నామె కావలయు ననియే దాఁచియుంచిన దనియు సుబుద్ధి యభిప్రాయము. అందుచేతనే యాతడు చిత్రాంగి యింటికిఁ బోవల దని సారంగధరుని గట్టిగా మందలించినాఁడు. తమ యీ కల్పనమువలన శ్రీ ఆచార్యులవారు శంభుదాసాదుల లోపమును సవరించినారు,

తమ సారంగధర నాటకమును విషాదాంతముగ రచింపఁదలఁచిన శ్రీ ఆచార్యులవారికి మఱొకకల్పనము గూడ నందావశ్యకమైనది. మూలకథలో సారంగధరుని నిర్దోషిత్వము రాజరాజునకుఁ దలవరుల మూలమునఁ దెలిసినట్లు రచింపఁబడినది. తలవరులకు నాకాశవాణి తెలిపినది. మత్స్యేంద్రనాథుని యనుగ్రహమునఁ దిరిగి కాళ్లుచేతులను బొంది సారంగధరుఁడు చౌరంగి యైనవృత్తాంతమును విషాదాంతముగ రచింపఁదలఁచిన శ్రీ ఆచార్యులవారు విడువవలసివచ్చినది. భారతకథలో నున్న యాకాశవాణి వృత్తాంతమును బరిహరించి దుష్యంతుని ధీరోదాత్తతను స్థాపింపఁదలచిన కాళిదాసు తన శాకుంతలనాటకములో దూర్వాసశ్శాపవృత్తాంతమును, నభిజ్ఞానవృత్తాంతమును బ్రవేశపెట్టినట్లుగానే శ్రీ ఆచార్యులవారును మూలములోని యాకాశవాణివృత్తాంతమును బరిహరించి సారంగధరుని నిర్దోషిత్వమును స్థాపింపఁదలఁచినవారై చిత్రాంగి సారంగధరునికి వ్రాసినట్లుగ నొక యుత్తరమును, సుబుద్ధి యున్మాదమును సృష్టింపవలసినవారయినారు. చిత్రాంగి యుత్తరమువిషయమును సుబుద్ధి మొదటనే తెలిపియుండినచో సారంగధరునికి శిక్ష తప్పియుండును. అందుచే కథావగతియే మారియుండెడిది. సుబుద్ధి యా యుత్తరమువిషయమును వెల్లడింపకుండుటకు దూర్వాసశ్శాపమువలె సారంగధరుఁడు సుబుద్ధికడఁ బ్రమాణము గైకొనుట యడ్డము వచ్చుచున్నది. తన్మూలమున పినతల్లి ద్వేషమును వెల్లడిపఱుపఁదలఁపని సారంగధరుని శీలమునకును, సారంగధరునికిఁ బ్రమాణము చేయుటచే నేమియుఁ జేయఁజాలనిస్థితిలో నున్మాదమునకుఁ బాల్పడిన సుబుద్ధి శీలమునకును మఱింత వన్నె చేకూరుచున్నది. మూలమున నీ సౌభాగ్యము కానరాదు. కాని సుబుద్ధి మూలముననే సారంగధరుని నిర్దోషిత్వము స్థాపింపఁబడవలసి యున్నది కదా! అందుల కున్మాదస్థితిలో నున్న సుబుద్ధి పలికిన వెడపలుకులఁ బేర్కొనుచు నున్మాదవైద్యశాలలోని వైద్యుఁడు రాజరాజునకు వ్రాసి పంపిన లేఖ తోడ్పడుచున్నది. తుద కాయుత్తరము మూలముననే రాజరాజు చిత్రాంగిని బ్రశ్నించి నిజము తెలిసికొని పశ్చాత్తాపముఁ జెందెను. కాని సారంగధరునిశిక్ష నుపసంహరించుచు నాజ్ఞాపించి యాతడు రత్నాంగితోఁ గలిసి యరణ్యమునకుఁ బోఁదలఁచునప్పటికే తలవరులు రాజాజ్ఞను నిర్వర్తించివైచిరి. ఇట్లు మూలకథలోని యాకాశవాణివృత్తాంతముమూలమున నసహజముగా నున్న సారంగధరుని నిర్దోషిత్వస్థాపనవిషయమునకు నాచార్యులవారి కల్పనల మూలమున సహజత్వము చేకూడినది.

సారంగధరనాటకరచనమున ఆచార్యులవారు చూపిన మెలఁకువలు ప్రజ్ఞామహితములు, ప్రతిభావిలసితములును. మూలకథలో రాజరాజు వేఁటకు వెడలినపిదప సారంగధరుఁడు పావురము లాడఁబోయినట్లున్నది గాని యంతకు ముందు సారంగధరుని గుణవర్ణనఘట్టమున నాతనికిఁ బావురములయాటపై మక్కువ కలిగినట్లెచ్చటను జెప్పఁబడి యుండలేదు. ఆచార్యులవా రీవిషయమును గమనించి రాజరాజు వేఁటకు వెడలుటకు మునుపే నయార్ణవుఁ డనుమంత్రిచే "ఇది యొక పిచ్చి. ఇతని కిది. సారంగధరునకుఁ బావురముల పిచ్చి" యనిపించును. దీనిచే దర్వాతి సారంగధరుని ప్రవర్తనమునకు నొక విధముగా సమర్థన మేర్పడినది. అట్లు లేకున్న "సారంగధరుఁడు పావురముల యాటయే యేల యాడఁబోవలయును? వేఱేయాటనైన నేల యాడరాదు?" అను ప్రశ్న లుదయించును.

మూలకథలో సారంగధరుఁడు మంజువాణి యనుకన్యను వివాహ మాడినట్లు కలదు. గౌరనకథలో నామె మంగళాంగి యని పేర్కొనఁబడినది. కాని యా తరువాత మూలకథలో నెచ్చటఁ గాని యామె ప్రస్తావము గానరాదు. సారంగధరునికి శిక్షవిధింపఁబడినపుడు రత్నాంగి దుఃఖించినట్లుగ మూలకథలోఁ గలదు గాని-మంజువాణియో, మంగళాంగియో -- సారంగధరుని భార్యవిషయమే కానరాదు. ఆమె రాజధానిలోనే యుండి భర్తపై నింద మోపఁబడినపుడును, దతలితముగ నాతనికి ఘోరశిక్ష విధింపఁబడినట్లు విన్నప్పుడును నెట్టి సంచలనమును లేకయూరకేయుండెనని భావింపవలెనా? ఈ యనౌచిత్యమును బరిహరించుటకై యాచార్యులవారు మిక్కిలి మెలఁకువతో మూలకథయం దొక మార్పు చేసిరి. సారంగధరుని భార్యయైనచంద్రకళాదేవి యా సమయమున విదర్భదేశమునఁ బుట్టినింటఁ గొంతకాలముగ నుండినట్లును బదునైదు దినములకుఁ బూర్వము సారంగధరుఁడే

చంద్రకళయొద్దకు విదర్భుఁడు బోయెదనని రాజరాజు నడిగినట్లును జిత్రించి యాచార్యులవారు మూలకథలోని యనౌచిత్యమును దొలఁగించిరి.

మఱియు మూలకథలో రాజరాజు సారంగధరుని దోషమును నిర్ధరించుటకై తన మంత్రులతోఁ గలిసి చిత్రాంగి యంతఃపురమునకుఁ బోఁగా నచటఁ జిత్రాంగి రాజునెదుట మంత్రులతో స్వయముగ సారంగధరుఁడు తనకుఁ గావించిన మానభంగవిషయమును జెప్పి వారికి నమ్మకము కలుగుటకై "ఊచక యాఁచక పయ్యెద గొబ్బున బటాన బయలుగఁ" జేసినది. "అపగిడిఁ ద్రపారహిత గై కుచరేఖలు" చూపినది. అపు డందఱును 'హాపరమేశ్వరా' యనుచుఁ దలవంచిరి. ఎంత జంతయైనను దన మగనియెదుట — మంత్రులే కానిండు — పరపురుషులకుఁ గుచరేఖలు చూపుట యుచితము కాదుగదా. ఈయనౌచిత్యమును బరిహరించుటకై యాచార్యులవారు రాజరాజు తనతోఁ దనమంత్రులను జిత్రాంగి యంతఃపురమునకుఁ దీసికొనిపోయినను వారిని గొంతదూరమున నలాంతరమున నుంచి వారు వినునట్లు గా నామెతో సంభాషించును. ఆమె నూఱడించి పిదప వారియొద్దకు వచ్చి యామె యొసఁగిన సారంగధరుని యుత్తరీయమును వారికి నానవాలుగఁ జూపును. ఇట్లంతఃపురమర్యాదను, గొంతవఱకుఁ జిత్రాంగి శీలమును గూడ నాచార్యులవారు కాపాడినారు.

పావురముకొఱకై సారంగధరుఁడు చిత్రాంగి యంతఃపురమును బ్రవేశించినపు డంతఃపురములోని దాసీజన మంతయును నచటనే యుండినట్లు మూలకథలోఁ గలదు. వారు చిత్రాంగి వింతప్రవర్తనముఁ గాంచి "యెటుపో యెటు వచ్చునోగదా! మన కెందుల" కని యూరకుండినట్లందు వ్రాయఁబడినది. పావురమునకై పోయిన సారంగధరుఁడు పావురమును దీసికొని రమ్మని యే పరిచారికతోనైనఁ జెప్పి తెప్పించుకొనవచ్చును. యౌవరాజ్యపట్టాభిషిక్తుఁ డయిన యాతనిమాట కెదురాడువారును, గాదనువారును నచట నెవరును నుండరు గదా! ఇట్టిచో నాతఁడే యేల లోనికిఁ బోవలెను - అను ప్రశ్న యుదయింపక మానదు. ఈ యసందర్భమును దొలఁగించుటకై శ్రీ యాచార్యులవారు చిత్రాంగియే బుద్ధిపూర్వకముగఁ బరిచారికాగణము నెల్లను దల కొక పనిమీఁదఁ బంపినట్లును, గమలయనుదానిని మాత్రము సారంగధరునికడకు త్తరమిచ్చి పంపినట్లును గల్పించి రచించినారు. దీనిమూలమున సారంగధరుఁ డంతిపురములోనికిఁ బోవుటకును జిత్రాంగి నిర్భయముగా నాతనితో నిచ్చవచ్చిన రీతిని నర్మగర్భముగా—శ్లేషాది చతురోక్తులతో-సంభాషించుటకునువకాశము చేకూడుట మాత్రమే గాక తరువాత సారంగధరునిపక్షమున వాదించుసదయునికిఁ గొంత వాదబలము చేకూడినట్లు నయినది.

ఇఁకఁ దృతీయాంకములోని సారంగధరుని విచారణఘట్ట మంతయును శ్రీ యాచార్యులవారి యుపజ్ఞకును, గల్పనాసామర్థ్యమునకును నిదర్శన మని చెప్పవచ్చును. వృత్తిచే న్యాయవాదు లైన శ్రీ యాచార్యులవా రీ విచారణఘట్టమును గడు సమర్థతతో నిర్వహించి రని ఘంటాపథముగాఁ జెప్పవచ్చును. తమకాలపు న్యాయవిచారణపద్ధతుల ను సారంగధరుని నాఁటికాలమున జరిగినట్లుగ రచించుట యెంతవఱకు సమంజస మగునో తెలియదు కాని యా విచారణమంతయును దర్కసహము లైనయుక్తిప్రయుక్తులతో, వాదోపవాదములతోఁ గూడి యుండి మిక్కిలి మనోజ్ఞముగా నున్నది. ఆ ఘట్టములోని యుద్దండుఁడు నేఁటి Public Prosecutor వలె నపరాధస్థాపకుఁడు. సదయుఁడు నిందితునిపక్షమున న్యాయవాది. సుకలుఁడు ఆస్థాన విలేఖకుఁడు. అతఁడు నేఁటి న్యాయస్థానమునందు వలెనే సాక్షులచేతను, నిందితులచేతను బ్రమాణములు చేయించును. నేఁటి కాలమునందువలె సదయునికి సాక్షులను బరీక్షించు (Cross Examination) నవకాశము కూడ నీయఁబడినది. నేఁడు పురప్రముఖుల (Gentlemen of the Jury) యభిప్రాయమును న్యాయాధిపుఁడు గైకొనునటే రాజరాజును దన మంత్రివరేణ్యుల యభిప్రాయమును గైకొనినట్లు విషాదసారంగధరలో రచింపఁబడినది. ఇట్టి ఘట్ట మంతయు నేఁటి న్యాయవిచారణమునకుఁ బ్రతిబింబముగా నుండి యాచార్యులవారి యసాధారణ మేధాసంపదను జాటుచున్నదనుటలో సందేహము లేదు.

నాటకరచనమున నాచార్యులవారి యుద్దేశమొక్క యానందసంధాయకత్వము మాత్రమే కాదు. నీత్యుపదేశము కూడ వారు నాటకరచ

# బయలు నాటకాలు

శ్రీ గుత్తి రామకృష్ణగారు.

ఇప్పుడు ఆడుతున్న స్టేజి నాటకాలు వచ్చి సుమారు 70 సంవత్సరాలు అవుతుంది. 1885 లో జమ్‌ఖండి నాటకం కంపెనీ వచ్చి బళ్లారిలో ప్రదర్శనాలు జరిపింది. ఆంధ్ర నాటక పితామహుడు వారి నాటకాలను చూచి మొదట కన్నడములో ఉషా పరిణయ నాటకము (స్వప్నానిరుద్ధ నాటకం) వ్రాయడము, తర్వాత తెలుగులో చిత్రనళీయం వ్రాయడము జరిగింది. అదే నేటి తెలుగు నాటక రంగానికి పునాది.

కాని ఇప్పటికిన్నీ పాతకాలపు నాటకాలను పల్లెప్రాంతాలలో ఆడుతూ ఉండడం చూడగలం. వీటి నేయక్షగానాలని, వీధినాటకాలని, రాయలసీమలో 1బయలు నాటకాలని, బయలాటలనీ అంటారు. ఎంత కాలదోషం పట్టినా ఈ బయలు నాటకాలు పూర్వుల సంస్కృతీ వికాసాన్ని తెలుసుకొనుటకు ఉపకరిస్తాయి. వృద్ధులైనమన పెద్దలు వారి కాలము నాటి నాటకదృశ్యాలను వర్ణించగా విని, తప్పుడు తడకలగా అచ్చయినయక్షగానాల పుస్తకా

(108 వ పుట తరువాయి)

నమున సాధింపఁదలచిన పరమప్రయోజనములలో నొకటి. 'సారంగధర'ను వాసుసంఘసంస్కారోద్దేశముతోనే రచించిరి. నాఁడు తెలుఁగునాట విరివిగ సాగుచుండిన వృద్ధవివాహముల నరికట్టుటయే వారి పరమలక్ష్యము. దానికయియే వారు సారంగధర కథావస్తువును స్వీకరించిరి. ఉత్తరరంగమున రాజరాజు చిత్రాంగికలు పవృత్తికి వృద్ధవివాహమే కారణమని యుద్ఘోషించును.

"ఈడు గానివివాహ మిది కారణంబు
జోడు చాలనిపెండ్లి శుద్ధాపరాధ" మని

యాచార్యులవారు తమ విషాదసారంగధర నాటకముమూలమున లోకమునకు నీత్యుపదేశము గావించినారు.

---

లను పరిశీలించి చూచి కొంత విషయం తెలుసుకోవచ్చు.

రాయలసీమలోని పల్లెప్రాంతాలలో ఈ బయలు నాటకాలు ఆడడమంటే ఒక పండుగ చేసుకొన్నట్లు. చుట్టుపట్ల పల్లెప్రజలు కూడా గుమికూడుతారు. ఈ నాటకాలను ఆడుటకు ఒక తెగవారు - గూడెము దాసరివారు - వుండేవారు. (ఇప్పుడు ఇతరులు కూడా ఆడుతున్నారనుకోండి) రాయలసీమలో ఇప్పుడు ఆడుతున్న నాటకాలు కొన్నిపదులున్నవి. అంతరించినవి-అచ్చుకానివి మరికొన్ని పదులుండవచ్చు. వాటిలో ఇప్పటికి ఆడుతున్న కొన్ని ఇవి: సారంగధర నాటకం - రచయిత కుమ్మర బాలయ్య; హరిశ్చంద్ర నాటకం - బెడుదూరి రామాచార్లు; రంగాచార్లు; విరాటపర్వం—వేములపల్లి కృష్ణమాచార్లు; చుక్కలూరు రామ నాటకం—నరసింహారెడ్డి; గరుడాచల నాటకం (చెంచు నాటకం)-రాఘవదాసు; ఇంకా అనేక నాటకాలు-లేపాక్షి రామాయణము, మైరావణ చరిత్ర - దొడ్డకవి; సుగ్రీవవిజయం-రుద్రకవి; మోక్షగుండ రామాయణము, నలమహారాజు చరిత్ర, ధర్మాంగద, రుక్మాంగద, శశిరేఖా పరిణయము

ఈ నాటకాలన్నీ పురాణాలలో కథావస్తులను తీసుకొనే రచించినారు. అయినా ప్రజలు వీటిని చూచి ఆనందించారంటే అందులో విశేషముంది. ఆనాటి నాటకాలను ఆ నాటకకవులు సాంఘికపరచి పామరజనానికిది అర్థమయ్యేటట్టు వ్రాశారు. కథావస్తువు పౌరాణికమైనా, పాత్ర పోషణ, సంభాషణ, భాష అనుదినజీవితానికి సంబంధించినదే కాబట్టి ప్రజలు ఆప్యాయంగా చూచినారు. చిలకమర్తి లక్ష్మీనరసింహకవి వ్రాసిన గయోపాఖ్యానం, పౌరాణిక నాటకం, పసులకాపరుల నోటిలో కూడా మెదలుచున్నదంటే నిజానికి అది సాంఘిక నాటకమే! అట్లనే ఈ బయలు నాటకాలు అనేకం

1. రంగస్థలం మాత్రమే ఆచ్ఛాదితంగా ఉంటుంది. ప్రేక్షకులు మైదానములో కూర్చుంటారు. షేక్స్‌పియర్ ఓపెన్ ఎయిర్ డ్రామా వంటిది.

సాంఘిక నాటకాలనే చెప్పవచ్చు. ముఖ్యంగా భాష అప్పటి ప్రజాభాష. ఇప్పుడు ప్రయోగార్హములు కావనుకున్న యెన్నో పదాలు పాటల్లోనే కాకుండా పద్యాలలో కూడా ఆ కవులు ప్రయోగించినారు. గరుడాచల నాటకము (చెంచునాటకము) లో కొన్ని పద్యాలు ఉదాహరిస్తాను.

"ఏమి సింగి నీవు యెట్టెట్లో చేస్తావు
నిన్ను చూచి నాకు వెన్ను వెరపు
లావు లేస్తున్నవి రమ్మని పిలువవె
కోప మేల సింగి గొట్టలేను."

"చంచల నేత్రిరో వినవె
చెంచులఁ గూడుక వేటమార్గముఁ
మించి జయించి బాణముల
మేటిమృగంబుల ద్రుంచి వస్తినే
యెంచ వశంబు గానిపొద
రిండ్లఁ జరించుచు జంతువెంబడిఁ
మంచిగ వస్తినే చెలియ
మాపురి యిక్కడ కెంత దూరమో."

ఈ చెంచునాటకకర్త యాదవదాసు నాటకమంతా అతి రమ్యంగా నడిపినాడు. పామరహృదయంలో నాటుకొనేటట్లు సంభాషణలు, గేయాలు, పద్యాలు నడిపాడు. సామాన్యంగా రైతుబిడ్డలు ఈ సంభాషణ కీర్తనలు పాడుకుంటూ వుంటారు:

"బాణ మెయ్యగలవా మృగముల
బట్టి త్రుంచగలవా
నా కొమతోడుత జారుడుబండల
మీదికెక్కగలవా
మృగములు బట్టెద నే నే నిక
నగములు తిరిగెద నే
పగతులు వచ్చితె రణమును జేసియు
పడవేయగ గల నే
గట్లు యెక్కగలవా పెద్ద
చెట్లు బాకగలవా
చెట్లమీదను జుంటితేనెలు
చేర్చి యివ్వగలవా."

తలుపుతీసేపాటకూటా ఆడవాళ్ళందరి నాలుకలమీద వుంటుంది. "కలికి కవాటము బంధన చేసినకారణ మేమే లక్ష్మీ-నీకు కారణ మేమే లక్ష్మీ."

ఇంక నాటకం ఆడేపద్ధతి: ఊరులోని బయలుప్రదేశంలో బొంగులతో అట్టువ నిర్మిస్తారు. తెర లుండవు. పచ్చతోరణాలు కట్టుతారు. అట్టువమీద వాంగుదార్లు—తాళాలు కొట్టేవాడు, సన్నమేలము వాయించేవాడు, మద్దెలవాడు, శ్రుతిబుర్ర (పాములబుర్రవంటిది) వాయించేవాడు వుంటారు. కిరిసానాయిల్ దివిటీలు రాకముందు పంజా లుండేవి. గ్యాదరకట్టెలను వెలిగించి అట్టువకు రెండుప్రక్కల పట్టుకుంటారు. వేషధారణలో స్త్రీలవేషం కూడా పురుషులే వేస్తారు. భుజకీర్తులు, కిరీటాలకు రంగురంగుల జీరంగిరెక్కలమర్చి సొగసుగా నిర్మిస్తారు. మొఖాలకు-ఆయా రసాలు ఉప్పతిల్లే స్వభావము గలవేషాలకు ఆకుపచ్చ, పసుపుపచ్చ, యెరుపురంగులను వేస్తారు. అట్టువమీదికి వేషము వచ్చేటప్పుడు తప్పెట్లుకొడుతూ ఆహ్వానిస్తారు. అట్టువమీదికిపాత్రప్రవేశమైనతర్వాత సారథి "ఓహో ఈ సభామధ్యంబునకు వచ్చినవా రెవరయ్యా హూఁ!" అని పలుకరిస్తాడు. అప్పుడు పాత్రధారి తన రూపనామక్రియలు వర్ణించుకుంటాడు. ప్రేక్షకులకు పాత్ర పరిచయం చేసినతర్వాతనే నాటకం సాగుతుంది. వచ్చినజనం అందరికి వినపడవలసి వుంటుంది కాబట్టి పాత్రధారివాచికం కంటే వాంగుదార్ల అరుపులు యెక్కువగా ఉంటాయి. వచ్చినప్రతిపాత్రధారి తాండవమో, లాస్యమో పట్టినతర్వాత కరచాలనములతోను, హస్తవిన్యాసములతోను పాట కనుగుణ్యంగా భావప్రకటన చేస్తాడు. నాటకమంతా గేయములతోను, పద్యములతోను సాగిపోతుంది. వచనం అరుదుగా వుంటుంది.

ఇంచుమించుగా ఈ నాటకాలే రాయలసీమంతటా ఆడుతారు. కొన్నిచోట్ల పాత్రలను సారథపరిచయం చేస్తే మరికొన్నిచోట్ల ద్వారపాలకుడు పరిచయం చేస్తాడు. సర్కారుజిల్లాలలో వున్నటువంటి కూచిపూడివీధిభాగవతాలు యిక్కడ లేవు.

ప్రతి నాటకదళానికి (గూడెము దాసరి దళాలకు) ఒక మంత్రగాడు వుంటాడు. ఆయా గ్రామాలలో ప్రదర్శనాలు జరిపినప్పుడు అక్కడి మంత్రగాళ్ళు తమ వాక్శుద్ధిని చెడగొట్టకుండాను, రసభంగం కాకుండాను ఈ మంత్రగాడు రక్షిస్తాడని వీరి నమ్మకం.

ఆంధ్రనాటకపితామహుడు తన తొలి స్టేజి నాటకం వ్రాయక ముందు యెక్కడ

చూచినా ఈ బయలునాటకాల ప్రదర్శనాలే జరిగేవి. ఈ సమయములో అంటే 70 సంవత్స రాల క్రిందట బళ్ళారి పట్టణానికి జమ్‌ఖండి నాటక కంపెనీ ఉత్తరాదినుంచీ వచ్చింది. వారు రంగురంగులపరదాలతో నూతనఫక్కీని నాటకం ఆడినారు; ప్రజలను రంజింపజేసినారు. ధర్మ వరం కృష్ణమాచార్లుగారు కూడా ఆమాదిరిగా మనమూ పరదాలు కట్టి, అందుకు తగినట్లుగా నాటకం యెందుకు ఆడకూడదు అని ప్రశ్నించు కొని కన్నడములో ఉషాపరిణయ నాటకం రచించినారు. పరదాలుకట్టి కన్నడనాటక మాడినారు. కాని పరదాలు జమ్‌ఖండి నాటక కంపెనీవారి పరదాలవలె చుట్టుకుంటూ పైకి లేవక రసాభాస అయిపోయింది. తర్వాత చిత్ర నళీయం వ్రాసి పరదాలు చుట్టుకొంటూ వుండే ట్లు చేసి మొదటి స్టేజినాటక మాడినారు. ఆంధ్రలో చిత్రనళీయంతో నూతననాటకదశ ప్రారంభ మయింది.

రంగస్థలం లేనిదే రూపకంలేదన్న సార్లవారి వాక్కు ఇక్కడ జ్ఞాపకంవస్తూఉంది. జమ్‌ఖండి కంపెనీవారు ప్రదర్శించినపరదాలను అనుక రించి ఆంధ్ర నాటకరంగం మార్పు చెందింది. బయలునాటకాల అట్టుక మారిపోయింది. రంగు రంగుల పరదాలతో నూతనరంగస్థలం వచ్చింది. నూతననాటకాలు వచ్చినవి. నూతనయుగం ప్రారంభమైంది. ఆంధ్రనాటకపితామహుడు ఆంధ్ర నాటకయుగకర్త అయినాడు.

---

(95 వ పుట తరువాయి)

ననియు, ప్రశస్తితో నాటక మంత మైనపిమ్మట భరతులు (నటులు) తాము సామాజికులకు ప్రత్యేకముగా ధన్యవాదములు సమర్పించు కొనుటకు ఈ భరతవాక్యము ఏర్పడియుండు ననియు ఊహించుట కవకాశము లేకపోలేదు. అప్పుడు నాటకాంతమునందలి భాగములు మూడు అగుచున్నవి. (1) నాయ కునకు ఫలాగమప్రాప్తి యగుటతోడనే కథ ముగియుచున్నది. ఇదియే కావ్యసంహారము. ఇచ్చట కావ్యసంహార మనగా నాటకాంతము కాదు. కథాంతము మాత్రమే. (2) ఇంక తన నాటకమును ముగించుచు నాటకకర్త తన ప్రభువునకు, దేశమునకు శుభాకాంక్షలను తెలుపుకొనుట ప్రశస్తి యగును. ఇప్పుడును, అప్పుడును కూడ ఇది నాటకకర్త విరచితమే. దీనితో నాటక మంత ముగుచున్నది. (3) పిమ్మట భరతులు తాము స్వయముగా కూర్చుకొన్న వాక్యములతో గాని, శ్లోకములతో గాని సామా జికులకు ధన్యవాదము లర్పించుకొనుట భరత వాక్య మగును.

ఇట్లివి ఆదికాలములో భిన్నములై యుండు నని యూహించుట కవకాశము లున్నను, కాల క్రమమున ప్రశస్తి, భరతవాక్యములు రెండును కలిసిపోయి, అభిన్నములైన వనుట నిస్సంశయము.

---

(48 వ పుట తరువాయి)

ఏరాజు ఘనకీర్తితారముక్తాళిప్ర
సాదితాశాంగనాసముదయుండు
ఏరాజు మంజులాకారప్రభావసం
తర్జితచంద్రకందర్పనలుఁడు
గీ. అతఁడు మహిసూరి నగరసింహాసనస్థుఁ
డఖిలజనపాలకులమౌళి యందగాఁడు
రాజకంఠీరవక్షమారమణుఁ డతనిఁ
గాంచి మోహించినావు నీ కార్య మగును.

రాగము: ఘంటారవము-ఆదితాళం

కోరినకార్య మెల్ల అవునే నీ
కోరినకార్య మెల్ల పల్ల.
ఇంతి నీనెమ్మదిని యిపుడె
యింత చింత లేల చేసేవే.
పంతగించి యొకమాట చెప్పేను
సంతోష మయ్యో గదవె
కంతుకేళి నేలు రాజకంఠీరవేంద్రుఁడు.

రాగము: ఎరుకలకాంబోధి-ఆటతాళము

ఇంతిరో నిన్నిక నేలును ఇది
వింతమాటలు గాదు
వెలదిరో వినవె. పల్లవి.
కర్ణాటకదేశరాయఁడు-వాఁడు
ఘనసౌజన్యవిధేయుఁడు
అర్ణవమహితగాంభీర్యుఁడు-దాన
కర్ణుఁడు కంఠీరవరాజవర్యుఁడు. ౧.
సులలితగానప్రవీణుఁడు-వాఁడు
లలలాజనపంచబాణుఁడు
తెలిసిన విద్యలజాణఁడు-ఏమో
ఇల నేలు కంఠీరవేంద్రధురీణుఁడు. ౨.
ఘనతరశుభకీర్తిసాంద్రుఁడు-వైరి
జనపాలహస్తిమృగేంద్రుఁడు.
వినుతకలాపూర్ణచంద్రుఁడు-ఇప్పు

# పరిశోధనకు తృణమో! పణమో!

శ్రీ వడ్లమూడి సత్యనారాయణగారు తన కుమార్తె చి. సౌ. విమల వివాహమహోత్సవంలో పరిశోధనకు అందజేసినవిరాళం.

(అర్ధనూట పదహార్లు) రు. 58-0-0

సంవత్సరం చందా : ఆరు రూపాయలు



ప్రాప్తిస్థానం :

కార్యదర్శి,
భాషా సేవక సమితి,
2/589, పైక్రాఫ్ట్స రోడ్,
తిరువల్లిక్కేణి, మద్రాసు-5.